# శాంతి కిరణాలు

రచయిత :

శ్రీ K. ఈశ్వర్

ప్రకాశకులు

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ కాళహస్తి - 517 640

1995

ప్రథమ ముద్రణ

1995 - జనవరి - 3,000 కాపీలు



తిరుమల తిరుపతి దేవస్థానంవారి
ఆర్థిక సహాయముతో ఈ గ్రంథం ముద్రించబడినది



గ్రంథము దొరుకుచోటు :

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ కాళహస్తి - 517 640

**Phones : 2543, 2239 STD : 08578**

---

Designed & Printed at :

**Jagadish Paper Products Pvt.Ltd., Vijayawada-10. Ph:473725**

# విషయసూచిక

# శుభాకాంక్షలు

## శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

'శాంతికిరణాలు' అను గ్రంథమును రచించిన శ్రీ ఈశ్వర్ గారు శ్రీకాళహస్తియందలి శ్రీ శుక బ్రహ్మాశ్రమము నందు బాల్య కాలమునుండియు నివసించుచు, ఆశ్రమమునకు తమ సేవలందించుచు, క్రమముగ ఆశ్రమ మేనేజరుగ వ్యవహరించుచు ఆశ్రమాభివృద్ధికి పలువిధముల తోడ్పడిరి.

ఆశ్రమము తరపున ప్రకటింపబడుచున్న వేదాంతభేరి అను మాసపత్రికకు వారు ప్రధానసంపాదకులు. వారి సంపాదకత్వమున ఆ పత్రిక బహుళవ్యాపకత్వము నొందినది. ఆ పత్రికలో వారి వ్యాసమొకటి ప్రతినెల ప్రచురింపబడుచుండును. ఆ వ్యాస ములు మనోరంజకములుగను, భావోద్దీపితములుగను యుండుటచే వాటినన్నిటిని చేర్చి గ్రంథరూపముగ వెలువరించిన ప్రజలకు చాల ఉపయోగముగ యుండునని భక్తులు తలంచుట వలన అవి ఈ పుస్తకరూపమున ప్రకటింపబడినవి.

శ్రీ ఈశ్వర్‌గారు కార్యదక్షులు. వారు ఏ కార్యమునైనను అకుం ఠిత దీక్షతో నెరవేర్చుచుందురు. వారి నేతృత్వమున పత్రికయు, ఆశ్రమమును గొప్ప అభ్యుదయము సాధించినవి.

భగవత్కృపచే వారు రచించిన ఈ గ్రంథము జనుల హృద యాంతరాళములలో శాంతికిరణములను ప్రసరింప జేయగలద నియు, మున్ముందు వారు మరికొన్ని రచనలను గావించి ప్రజాసేవ చేయగలరనియు విశ్వసించుచున్నాము.

# ఒక్కమాట

భగవదనుగ్రహమువలన 1961 నుండి శ్రీశుకబ్రహ్మాశ్రమ స్థాపకులైన శ్రీవిద్యాప్రకాశానందగిరిస్వాములవారి సేవాభాగ్యము లభించినది.

వారి దివ్యమైన ఆశీర్వాదముచే వారి శిక్షణలో, వారి సేవలో కాలము గడుపుచుండెడివాడను. అలా వారి ప్రోత్సాహముతో ప్రతినెల పత్రికకు వ్యాసం వ్రాసి వారికి చదివి, వినిపించెడివాడను. అందలి విషయాలలో మార్పులు, చేర్పులు, కూర్పులు అత్యంత ప్రేమతో వారు చేయించి వేదాంతభేరిలో ప్రచురించే ఏర్పాట్లు చేసెడివారు. అలా వారి ఆశీర్వాదములతో తయారయిన కొన్ని వ్యాసాలే "శాంతికిరణాలు" అను పేరుతో వెలువడిన ఈ చిన్న గ్రంథము. పాఠకులు ఈ గ్రంథాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ప్రోత్సాహకర్తలగు గురుదేవులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి పాదపద్మములకు భక్తితో ఈ గ్రంథాన్ని అంకితము చేస్తున్నాను.

ఇట్లు
భక్తుల సేవలో
ఈశ్వర్

# 1) శాంతి లభించు చోటు

ఒకానొక పట్టణమున వస్త్రములు అమ్ము దుకాణము ఒకటి గలదు. రకరకములైన వస్త్రములు మాత్రమే అచట లభించునని ఆ దుకాణమునందు గల బోర్డు సూచించుచున్నది. కాని ఒక అమాయకుడు అందులో ప్రవేశించి నాకు పాత్ర సామాగ్రి కావలెనని అడుగగా అచట దొరుకునవి వస్త్రములే గాని పాత్ర సామాగ్రి కాదనియు ఆ ప్రక్కనున్న దుకాణములో అవి లభించగలవనియు అంగడి యజమాని చెప్పెను. కాని అతడు అచ్చోటికి పోక బద్ధకము చేతను సోమరితనము చేతను అచటనే కాలమును వ్యర్థము చేయుచుండెను.

ఆ ప్రకారమే అజ్ఞానులగు జనులు, విషయ విలాసములను తళుకు బెళుకులతో గూడిన ప్రకృతి, లేక మాయయను అంగడి యందు ప్రవేశించి మాకు సంపూర్ణమైన సుఖము కావలెనని అడుగుచున్నారు కాని అది అచట లభించుట లేదు. ఈ ప్రకృతియను దుకాణములో లభించునదేదియో భగవానుడు గీతయందు విశదీకరించి యున్నారు.

'అనిత్యం, అసుఖం లోకం'- అని ఈ వాస్తవమును గ్రహించిన మహనీయులగు సద్గురువులు వారిపై కరుణించి 'నాయనలారా! అనిత్యత్వము, అసుఖత్వము లభించు చోటునందు ప్రవేశించి సుఖము, సుఖము అని ఎంతకాలము విలపించినను పూర్ణసుఖము లభించనేరదు. కావున ఇటు రండు, అత్యంతిక సుఖము లభించు చోటు మీకు చూపించెదము అని చెప్పుచున్నారు. అయితే అచటికి వెళ్లు బాట ఒకింత ఇరుకుగను, నడచుటకు కొంత ప్రయాసగను ఉండుటచే వారు కొంత వెనకాడుచున్నారు.

అసుఖకరమైన ప్రకృతి యను స్థానమునందుండియే, పరిపూర్ణ శాంతి సుఖములు పొందవలెనని అభిలషించుచున్నారు. అందుకొరకై అనేక విధములుగ ప్రయత్నించుచున్నారు. కాని అవి లభించుట లేదు.

నేటి మానవుడు గగన వీథులందు తిరుగుచు, చంద్రమండలాదులను చేరుచు, కోటాను కోట్ల మైళ్ళ దూరమున గల గ్రహములకు వెళ్ళగలుగుచున్నాడు. కాని అతి సమీపమునగల హృదయక్షేత్రమందలి ఆత్మను దర్శింపజాలకున్నాడు. అశాంతికి ఆలవాలములైన బాహ్య విలాసముల కాంక్షను పెంపొందించుకొని శాంతి సుఖములతో విరాజిల్లు సువిశాల ఆత్మ సామ్రాజ్యమునకు దూరమై పోవుచున్నాడు నేటి మానవుడు. జనులు సృష్టి రహస్యములను తెలుసుకొనుటకు ప్రయత్నించుచున్నారే కాని సృష్టికర్తను తెలుసుకొని శాంతి సుఖములననుభవించలేకున్నారు.

మారణాయుధములతో ఒకరి నొకరు హింసించుకొనుచున్నారేకాని అంతఃశత్రువులగు కామ, క్రోధాదులను జయించలేకున్నారు. అణుశక్తిని దుర్వినియోగపరచి, అంతమొందుచున్నారే కాని దైవ శక్తి నాశ్రయించి దేవత్వమును నొందలేకున్నారు. హృషీకములను (ఇంద్రియములను) జయించిన యోగులు, మునులు, మహాత్ములు, సాధుపుంగవులు మాత్రమే దైవత్వము నొంది పరమ శాంతిని అనుభవించుచున్నారు. యంత్రశక్తి గొప్పదేకాని, మంత్రశక్తి, దైవశక్తి మరింత గొప్పవని జనులు ఎంత శీఘ్రముగా గ్రహించిన అంత శ్రేయమును బడయగలరు.

కాబట్టి పరిపూర్ణసుఖశాంతులతో విరాజిల్లవలెనన్న ప్రకృతియందలి తళుకు బెళుకులను మోసపోక శాశ్వత దైవత్వము కొరకు అన్వేషించవలెను. శాంతి సుఖములకు మార్గము భౌతిక శక్తులు

కావనియు ఆధ్యాత్మిక శక్తియే యనియు ఏనాటికైనను గ్రహించ వలసి యున్నది. ఈ సత్యమునే వేదమాత ఈ ప్రకారముగ ఘోషించుచున్నది.

నిత్యోఽనిత్యానాం, చేతన శ్చేతనానాం
ఏకో బహూనాం యోవిదధాతి కామాన్
తమాత్మస్థం యేనుపశ్యన్తి ధీరాః
తేషాం శాన్తిః శాశ్వతీ నేతరేషాం.

కావున ఆత్మయందే నిలకడ గలిగి ఆత్మానుభూతిని బడయుటచేతనే పరిపూర్ణ శాంతి జనులకు లభించగలదు.

# 2) నిత్య సంతోషమునకు మార్గములు

1) తేలు కుట్టినదని చింతించవద్దు, పాము కరవనందులకు సంతోషించు.
2) పాము కరచినదని చింతించవద్దు, ప్రాణము పోలేదని సంతోషించు.
3) ప్రాణము పోవునని చింతించుటకంటే, పరప్రాణికి మేలు చేయలేదని చింతించు.
4) కారు లేదని చింతించవద్దు, కాలు వున్నందుకు సంతోషించు.
5) కోట్లు లేవని చింతన ఎందుకు, కూటికి వుంది కదా అని సంతోషించు.
6) కాలిలో ముల్లు గ్రుచ్చుకొన్నదని చింతించవద్దు, కంటిలో గ్రుచ్చుకోలేదని సంతోషించు.
7) మేడ లేదని చింతించవద్దు, నిలువ నీడ అయినా వున్నందులకు సంతోషించు.
8) అందము కొరకు పరితపించకు, ఆనందము కొరకు పరితపించు.
9) పదవుల కొరకు ప్రాకులాడుటకంటే, పరమాత్మ కొరకు ప్రయత్నించుము.
10) శరీర సౌందర్యము లేదని బాధపడవద్దు, మనోబలము కావాలని మనసారా ప్రార్థించు.
11) లేనిదానికి, అందనిదానికి ఆరాటపడవద్దు, ఉన్నదానితో ఉపశాంతి పొందుము.
12) భోగాలు లేవని చింతించవద్దు, రోగాలు రాలేదని సంతోషించు.

జరిగిన విపత్తును గూర్చి విపరీతమైన, విలక్షణమైన ఆందోళన పడి మనస్సును విషపూరితముగా చేసుకొని విజ్ఞత కోల్పోవుట కంటే విజ్ఞానమును ప్రదర్శించి వికాశమయ జీవితమును గడపుట నేర్చుకొనువాడు ధన్యుడు.

దీనిని చిన్న కథ ద్వారా విచారించెదము.

ఒకనాడు ఒక లక్షాధికారి గుర్రమును స్వారీచేసుకొనుచు ఒక అడవిలో ప్రవేశించెను. అలసిపోయి గుర్రాన్ని ఒక చెట్టుకు కట్టి వైచి తాను నిద్రించెను. లేచి చూచుకొనిన గుర్రము లేదు. వెంటనే వెనుదిరిగి గ్రామం చేరుకొని అందరికీ తీపి పదార్థములను (Sweets) పంచుచుండెను. అంత నొక స్నేహితుడు ఎందులకు తీపి పదార్థములు పంచుతున్నావని యడుగ నాతడు ఈ విధముగా చెప్పెను.

నా గుర్రాన్ని అడవిలో కట్టి పెట్టితిని. ఎవరో ఎత్తుకొని పోయిరి. కాబట్టి ఈ స్వీట్సు పంచుతున్నానని చెప్పగా, గుర్రాన్ని ఎత్తుకెళ్లినందులకు బాధ లేదా అని అడుగ, నన్ను ఎత్తుకెళ్ళలేదు గదా అని సంతోషిస్తూ ఈ స్వీట్సు పంచుతున్నానని జవాబు చెప్పెను.

అంతట ఆ స్నేహితుడు "చాలా చక్కని పాఠమును బోధించితివి. ఈ సూత్రమును ఆధారపరచుకొని నేను కూడా జీవితములో దుఃఖము నుండి విముక్తి చెందెదన" ని సంతోషముగా వెనుదిరిగి పోయెను.

చూచితిరా! కష్టాలు వచ్చినవి అని చింతించుటకంటే పెద్ద కష్టాలు రాలేదని సంతోషంగా భగవంతుని ఆరాధిస్తూ శక్తి వంచన లేకుండా పదిమందికి సహకరిస్తూ జీవితమును దివ్యజీవితముగను, శాంతిమయ జీవితముగను, ఆనందమయ జీవితముగను గడిపిన **వాడే ధన్యజీవి.**

# 3) భగవంతునితో కనెక్షన్

ఎవరైనా ఎంత గొప్పవారైనా ఎన్ని శక్తులు సంపాదించిన వారైనా ఎంత ఎక్కువ అధికారం గలవారైనా ఏ లోకంలోనైనా, ఏ యుగములోనైనా, ఏ కాలంలోనైనా అపకారం, అహంకారం, మమకారం, దురహంకారం, దురాచారం, దుష్ప్రవర్తన మొదలగు రాక్షస గుణాలు గలిగియుండి హింసాత్మక చర్యలు సాగించేవారికి వినాశనము తప్పదు.

ఒక్కసారి చరిత్ర పుటలు తిరుగవేస్తే రావణ, దుర్యోధన, దుశ్శాసన, కంస, శిశుపాల మొదలగువారు సామాన్యులు కాదు. బాహ్యశక్తిలో అగ్రగణ్యులు. ప్రేమ, కరుణ, దయ, అహింస మొదలగు సద్గుణములు లేని కారణముచేత దైవశక్తితో కనెక్షన్ కోల్పోయిరి.

బలుబు ఎంత పెద్దదైనను, పొడుగైనను, లావుదైనను కరెంటును ఆశ్రయించనిదే ప్రకాశమును, వెలుగును, కాంతిని వెద జల్లలేదు. భగవంతుడు ఒక మహావిద్యుత్ ట్రాన్స్‌ఫారంవంటివాడు. అన్ని జీవరాసులు బలుబులవంటివారు. బలుబులవంటి జీవులు కరెంటువంటి భగవంతునితో కనెక్షన్ గలిగియుండాలి. అప్పుడే వారి అనుగ్రహించే, ఆశీర్వాదించే శాంతి సుఖములు లభించగలవు. వారి అనుగ్రహం పొందాలంటే తప్పనిసరిగా వారి సూచనలను, సలహాలను పాటించితీరాలి ! ఆ సూచనలే "భగవద్గీత, భారత, భాగవత, రామాయణ, ఉపనిషత్" ల వంటి గ్రంథములు, వాటిలో సూచించిన సూత్రములు, సిద్ధాంతములు పాటించి ఆచరించి - అనుష్ఠించి సత్ఫలితములు పొందవచ్చును.

"మా కురు ధనజనయౌవనగర్వం"

"ధన, జన, బల, యౌవనాది బలములను చూచి మురిసి పోయి విర్రవీగవద్దు" అని ఆదిశంకరులు సెలవిచ్చిరి. కాల మనోబలములలోకెల్ల బలమైన, భద్రమైన, భవ్యమైన, చక్కనైన దైవబలముతో కనెక్షన్ కొరకు అహర్నిశములు పాటుబడి దాన్ని సాధించి, ఈ జన్మనే చివరి జన్మగ చేసుకొని జీవితమును సమాప్తం చేయువాడే నిజముగ జీవించినవాడు.

# 4) దుఃఖ విముక్తికి మార్గము

దుఃఖము అను పదమును వినుటకు, పీ్ంచుటకు ఎవరును ఇష్టపడరు- దాని బారినుండి దూరమగుటకు విశ్వప్రయత్నాలు చేస్తారు.

అసలు దుఃఖమెందుకు వస్తుంది ?

నాది, నా వస్తువు, నా ఇల్లు, నావాళ్ళు, నా జనులు, నా బిడ్డలు అను 'నా' అనే పదమును నమ్మినప్పుడు, నమ్ముకొన్న ఆ వస్తువులు దూరమైనప్పుడు దుఃఖము దగ్గరగుటకు ప్రయత్నిస్తుంది.

"నాది" అనే పదమునకు మొదటినుండి దూరంగా వున్నవానికి దుఃఖము దూరంగానే వుండగలదు.

అయితే అన్నీ వదలి అడవులకు వెళ్ళమని ఎవరూ చెప్పరు. అలా వదలి వెళ్ళినను మనిషి అడవులలో, కొండలలో, కొండ గుహలలో వున్నను మనస్సు మాత్రము ఇంట్లోను, ఊర్లోను విహ రిస్తుంటుంది. అప్పుడు దుఃఖముతో సహజీవనము చేయవలసిందే. కావున దుఃఖమునకు దూరమగుటకు భగవద్గీతద్వారా భగవంతుడు అందించిన ఈ క్రింది సూత్రాలు అందరికి శరణ్యము.

ఇంట్లో వుండు, ఊర్లో వుండు, సంసారములో వుండు, వ్యాపా రము చేసుకో, ఉద్యోగము చేసుకో, వ్యవసాయము చేసుకో దేనిని ఉపేక్షించకు.

నీ స్వధర్మాలన్ని పాలించు-అధర్మాన్ని నిర్మూలించు. తామ రాకు నీటిలో పుట్టి, నీటిలో పెరిగినను అందులో తగుల్కొనక ఏ విధంగా నీటితో సంబంధము లేనట్లు వ్యవహరిస్తుందో అలాగే తామరాకుగా నీ మనస్సును తయారుచేసుకో. అప్పుడు దుఃఖము

నీ నుండి పారిపోక తప్పదు.

అలాకాక అందులోనే తగుల్కొనితివా, దుఃఖము నీకు దగ్గరై నీ వెంట, నీ ఇంట, నీ చెంతనే కాపురము యుండగలదు. నీతోనే సహజీవనము చేయగలదు అని చెప్తుంది భగవద్గీత.

దుఃఖముతో సహజీవనము చేయుటకు ఎవరును సమ్మతించరు. దానిబారినుండి తప్పించుకొనుటకు విశ్వప్రయత్నము చేయుదురు.

కోరికలకు దాసోహమని వాటివెంట పరుగెత్తినచో దుఃఖము వెంటబడును.

అన్ని దుఃఖములకు మూలము కోరికలు. కోరికలు లేని వాడు కొండంత సుఖమును పొందగలడు. కావున మమకారాలు వదలి, కోరికలను దులిపివేయడమే అన్ని దుఃఖముల బారినుండి తప్పించుకొనుటకు సులభమార్గము. అట్టి మార్గములో పయనిద్దాం.

# 5) తిరుగులేని దైవశాసనము

లోకమున వ్యాపించిన అంధకారమును తన దేదీప్యమాన కిరణములచే ఉదయ భాస్కరుడు పారద్రోలి సమస్త మానవాళికి తమ దైనిక కార్యక్రమము చేసుకొనుటకు దోహదము కలిగించుటకు పరికించినప్పుడును, కోటానుకోట్ల నక్షత్రరాసులను గగన వీధులందు వీక్షించునప్పుడును, పూర్ణిమనాడు చంద్రుని చల్లని వెలుగును నేత్రానందముగ గాంచి ఆనందించునప్పుడును, ఈ భూమండలమున ఉద్భవించు నానా విధములగు వృక్షములను, జీవరాసులను గూర్చి యోచించునప్పుడును, శతసహస్రకోటి భూత భవిష్యత్ యుగములను ఒకసారి ఊహాగానము చేసినప్పుడును, కల్పనాశక్తి మూలమునగాని ఊహా శక్తిమూలమునగాని తెలిసికొనజాలని అగణితములగు జగత్తునందలి రహస్యములను గురించి తలంచునప్పుడుగాని భగవ ల్లీల వైభవము ఒక్క పర్యాయము స్మృతి పథమున చక్కగ గోచరించగలదు. భగవంతుని అపార దివ్యశక్తి హృద్గతముకాగలదు.

ఈ విధముగా జగత్తునందలి అఖండ మహిమాన్విత సమస్త సంపదను ఇముడ్చుకొన్న అనంతమగు ఆకాశము తిలకించునప్పుడు ఎవరి యొక్క అజ్ఞానుసారము ఈ చరాచర ప్రకృతిలోని సమస్త కార్యములు నియమబద్ధములై నడుచుచున్నవా యను భావము మనస్సున పొడమగలదు.

అట్టి అపారశక్తిని గూర్చి యొకింత ఆలోచించినప్పుడు దానికి మూల పురుషుడెవరు? ఈ బ్రహ్మాండమను రథమును నడుపు రథసారధి ఎవరు? అతడెట్టివాడు? అతడేవిధముగ నుండును? ఎక్కడవుండును? అతని నామధేయమేమి? అతనిని దర్శించు టెట్లు? అతనితో మాట్లాడవచ్చునా? ఏభాషతో? ఈ

మొదలగు విషయములను గూర్చి తెలిసికొనవలయునని ప్రతి వారికి కుతూహలముగనుండును. వీనియన్నిటికిని సమాధానము భగవద్గీత 9వ అధ్యాయమందు గోచరించుచున్నది.

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరం
హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే.

"జడమైన ఈ చరాచర ప్రకృతి చైతన్య స్వరూపుడవగు నాచేతనే చలించుచున్నది. నేను అధ్యక్షుడనైయుండి ఈ సమస్తమును నడిపించుచున్నాను" అని గీతాచార్యులు చెప్పుట వలన యావత్ ప్రపంచమేకాక మన ఊహకందని యే లోకములు కలవో వానినన్నిటిని చలింపచేయు మహత్తర శక్తియే దేవుడని మనము తెలిసికొనగల్గుచున్నాము.

మఱి వారియొక్క నివాసమెక్కడ ?

"సర్వస్యచాహం హృదిసన్నివిష్టః" పుష్పమాలయందు దారము ఏ ప్రకారము మాలయంతటను వ్యాపించి పుష్పములన్నిటికి ఆధారభూతముగనుండునో మరియు వెన్నపాలయందెట్లు వ్యాపించియుండునో, అట్లే ఈ ప్రపంచమునందు అణువు అణువునందును వ్యాపించి భగవానుడు సమస్త ప్రాణికోట్ల హృదయాంతరాళమున నివాస మేర్పరచు కొనియున్నాడని విశదమగుచున్నది.

మరి వారి నామధేయమేమి?

అకార, ఉకార, మకార, అర్ధమాత్రలతో కూడిన ఓమ్ అను ఏకాక్షరమే వారి నామము.

అట్టి ఓమ్ అను శబ్దమునుండియే సృష్టి ఆవిర్భవించినదని వేదములు చాటుచున్నవి. అట్టి ఈ సృష్టిని సక్రమముగ నడుపుటకు భగవానుడు ఒక ప్రభుత్వమును నియమించి బాధ్యతలు దానికి ఒప్పగించియున్నాడు. అదియే విశ్వప్రభుత్వము అని పిలవబడుచున్నది.

ప్రస్తుత ప్రభుత్వములోని నియమములు శాసనములు కాలక్ర
మమున తారుమారు కావచ్చునేమోకాని విశ్వప్రభుత్వముయొక్క
నియమములు తారుమారుకావు. అట్లు తారుమారుచేయుటకు
ఎవ్వరికిని సాధ్యముకాదు. అచ్చటి నియమములను ఎవ్వరును
ఉల్లంఘించలేదు. సిఫార్సులకును, లంచములకును, అవినీతికిని, అధ
ర్మమునకును, అన్యాయమునకును, అచ్చట ఏమాత్రము చోటులేదు.
రాజు, ధనవంతుడు, పేదవాడు, విద్యావంతుడు, అధికారవంతుడు,
అనధికారవంతుడు, రూపి, కురూపి మొదలగు భేదములు గాని,
జాతి, మత, కుల, లింగవ్యవస్థగాని ఆ విశ్వప్రభుత్వమువారు
పాటింపరు. వారి శాసనములు చండశాసనములు. అవి తిరుగు
లేనివి. శాసనకర్తయగు భగవానుని శక్తి అమోఘము, అపారము,
అకుంఠితము, అద్భుతము.

జగత్తులో జరుగు సమస్త కార్యములు భగవానుని నియమా
నుసారమే జరుగును. సూర్యచంద్రాదులు, గ్రహములు, నక్షత్ర
ములు, సర్వాంతర్యామియొక్క నియమమునకు బద్ధమయ్యే చలించు
చుండును. సృష్టి ఆదిలో నియమించిన నియమములు మధ్యలో
మార్పబడవు. మహాత్ములును, శాస్త్రజ్ఞులును, జ్యోతిష్కులును,
పంచాంగకర్తలును, ఈ విషయమును చక్కగా గుర్తించగలిగిరి.
అందుచేతనే జ్యోతిష్కులు కొన్ని సంవత్సరముల ముందుకూడ
సూర్యుడు ఫలానిస్థానమున నుండుననియు, భూమి ఫలానిస్థాన
మున నుండుననియు, చంద్రుడు ఫలానిస్థానమున నుండుననియు,
ఫలానిరోజు చంద్రగ్రహణ మేర్పడుననియు, ఫలానిరోజు సూర్యగ్ర
హణ మేర్పడుననియు లెక్కలుగట్టి సెకండ్లతో సహా నిర్ధారణచేసి
చెప్పగలుగుచున్నారు.

జగత్తులోని కార్యములు నియమములేక ఇష్టానుసారము తారు
మారుగ జరుగుచుండునేని పైనతెలిపిన గ్రహసంచారమును

లెక్కగట్టి ఎవరును చెప్పజాలరు. దీనినిబట్టి సృష్టి ఆదిలో సర్వాంతర్యామియగు భగవానుడు నియమించిన నియమములు సక్రమముగ లెక్కప్రకారము చక్కగా జరుగుచున్నవని గ్రహించినవారు దైవభక్తిగలిగియు, పాపభీతి కలిగియు వర్తించుదురు. పాపకార్యమును చేయుటకు వారెన్నడును సాహసింపరు ఎందుకనగా -

పాపమునకు ఫలితము -- దుఃఖము
పుణ్యమునకు ఫలితము -- సుఖము
జ్ఞానమునకు ఫలితము -- మోక్షము

అను భగవచ్ఛాసనమును వారు చక్కగా తెలిసికొనియున్నారు. సృష్టియందలి ఈ నియమములు జాతి, మత, కుల, లింగభేదము లేక సర్వులకును వర్తించును.

" చెడ్డ చెడ్డకును, మంచి మంచికినిగల్గు
దీని దప్పించుకొనుటకు తెరవులేదు"

అను వివేకానందుని వాక్యానుసారము జీవుడు తానుచేసిన ప్రతికర్మకును ఫలితమును అనుభవించవలసివచ్చును. కావున వివేకవంతులగువారు చెడ్డను దూరీకరించి మంచిని గ్రహించి జపధ్యానాది సాధనానుష్ఠానములద్వారా, మరియు ఇతరములగు పుణ్యకార్యముల ద్వారా సర్వాంతర్యామియగు పరమేశ్వరుని ఆశ్రయించి సద్గతి బడయుటయే తమ ప్రథమ కర్తవ్యముగా నెంచుకొనవలెను.

# 6) రోగములు - మందులు

నేటి మానవునికి లెక్కించనలవికాని రోగములు వచ్చుచున్నవి. రోగాల సంఖ్యతోపాటు డాక్టర్ల సంఖ్య, మందులషాపుల సంఖ్య, మందుల సంఖ్య పోటాపోటీగా పెరుగుచున్నవి.

పూర్వకాలములో ప్రయాణ సౌకర్యములు లేని రోజులలో 30 గ్రామాలకు కూడా ఒక వైద్యుడు కనిపించేవాడుకాదు. అప్పుడు ఇన్ని రకాల మందులు, యంత్ర పరికరాలు లేవు. అయినను వారు అత్యధిక ఆరోగ్యంగాను, ఆనందముగాను జీవించెడివారు.

ప్రస్తుత పరిస్థితులు వేరు. యంత్రయుగములో యున్నాము. కడుపునొప్పి, కాలునొప్పి, పంటినొప్పి ఏ నొప్పికయినా ఎక్స్‌రే (X-Ray) పైన ఆధారపడవలసినదే. ఎముకలు విరిగితే భగవంతుడి వరప్రసాదంగా సృష్టిలో దొరకు సామాన్యమైన ఒక రకమైన ఆకు రసం వాడితే ఎముకలు కలుసుకొనే సదుపాయమున్నను వాటిని ఎంతమంది విశ్వసించుచున్నారు. ఉపయోగించుకొనుచున్నారు. ప్రతిదానికి కంగారు, తలనొప్పివస్తే కంగారు, కడుపునొప్పి వస్తే కంగారు, కండ్లు మంటలుపుడితే కంగారు, ఆకలి లేకపోతే కంగారు ప్రతిదానికి తాను కంగారుపడి అందరిని కంగారు పట్టిస్తుంటారు చాలమంది. ప్రతిచిన్నదానికి డాక్టరును కలవాలి. మాత్రలు రాసిస్తా రనుకోండి తృప్తి వుండదు. ఇంజక్షన్ ఇవ్వరేం డాక్టరుగారు అని డాక్టరును వేధిస్తారు.

ఇలా మందులు వాడుట ఫ్యాషనైపోయింది. మందులు అవ సరములేదు. ఆహారములో మార్పుచేసి చూడండని పాతకాలపు వైద్యులు చెపితే ఈ డాక్టరుకు ఏమీ తెలియదని, చాదస్తమని అతని

వద్దకు పోవుట మానేస్తారు. ఇది ఈ కాలపు కొందరి మనుష్య
మనస్తత్వాలు.

అసలు రోగమెందుకు వస్తుందో ఒక నిమిషం ఆలోచిస్తా
జీర్ణకోశము కూడా ఒక రకమైన మిషనే. ఈ మిషనును జాగ్రత్త
వాడుకొనుటకు అలవాటు పడాలి. కనిపించిన తిండినల్లా తినేవా
కొందరైతే, మరికొందరు పోటీపడి క్షారము, ఉప్పు-పులుపు అ
తంగా వాడుతుంటారు. బెడ్‌కాఫీతో ప్రారంభించి గంటగంట
ఏదో ఒకటి నమిలే స్వభావముగలవారు కొందరు లేకపోలేదు.

పొగ త్రాగరాదని ఎంత చెప్పిన వినేవారున్నారా? పొగ త్రా
టలేదు బయటికి వదిలేస్తున్నానని చెప్పేవారు కొందరున్నార
మద్యపానం మానవుని రాక్షసునిగా చేస్తుందని తెలియదా? తెలుస
మరి మానుకొంటున్నారు? ఈ విధంగా అనారోగ్యమును గురిం
శ్రద్ధ కనుపరిచేవారి సంఖ్య ఎక్కువగా వుందేకాని, ఆరోగ్యము
గురించి శ్రద్ధ తీసుకొనువారి సంఖ్య చాలా తక్కువ. ఈ శరీరమ
మానవ యంత్రమునకు దేశకాల పరిస్థితులనుబట్టి, వాతావర
మార్పులనుబట్టి, శరీరతత్త్వాన్ని బట్టి అప్పుడప్పుడు అనారోగ్యమ
కలుగుట సహజమే. చాలామటుకు జబ్బులకు మనము మన ఇంటిలో
దొరకు సామాన్య వస్తువులతో వైద్యము చేసికొని ఆరోగ్యాన్ని పొం
వచ్చును. ప్రస్తుతం ఇచ్చట కొన్ని తెలుసుకుందాం !!

## a) తలనొప్పికి

తెల్ల వెల్లుల్లి పాయనుగాని లేక ఆవాలుగాని తీసుకొని బా
నూరి నొప్పివున్నచోట పట్టువేసిన మరుక్షణం గుణం కనిపిం
గలదు.

## b) అమిత దాహం

ఎండాకాలములో దాహం తీర్చుకొనుటకు రకరకాల డ్రింక్స్ త్రాగుటకంటే నిమ్మకాయ రసంతో సోడా కలుపుకొని త్రాగిన దాహము తీరును. ఈ విషయము చాలామందికి తెలిసినను ప్రాముఖ్యత ఇవ్వరు. ఎక్కువగా ఖర్చుచేసి ఏదో ఒక డ్రింక్ త్రాగితేగాని వారికి తృప్తి అనిపించదు. ఇది కొందరికి సహజమైన అలవాటు.

ఆరోగ్య సూత్రాలు పాటించి అనారోగ్యాన్ని అంతం చేయుటకు ప్రయత్నించి సత్ఫలితాలు పొందుదాం !

# 7) జీవుడా! మేలుకో!

జీవుడా !

1. ఇపుడు నీవు ఆరోగ్యముగా ఉన్నావు. ఈ ఆరోగ్యము ఎల్లకాలము ఉండునా? ఉండదు. రోగములు తగుల్కొని బహుకాలము బాధించును.
2. ఇపుడు నీవు యౌవనమందున్నావు. ఈ యౌవనము ఎల్లకాలము ఉండునా? త్వరలో ముసలితనము వచ్చి మీదపడును. అపుడు నానా అవస్థలు పడవలసి వచ్చును.
3. ఇపుడు నీ ఇంద్రియములు శక్తివంతముగ నున్నవి. ఎల్లప్పుడు అవి ఈ విధముగానే ఉండునా? వాటి శక్తి క్షీణించి పోవును.
4. ఇపుడు మహోత్కృష్టమైన మానవజన్మను నీవు అనుభవించు చున్నావు. రాబోవు జన్మ మానవజన్మయే అను గ్యారంటీ ఏమైనా కలదా? లేదు.

కాబట్టి ఈ పరిస్థితులలో చక్కని దైవ వాతావరణమును కలుగజేసికొని, మరల జన్మ లేకుండా, శాశ్వత కైవల్యమును పొందుటకు బదులు కాలమంతయు విషయ విలాసములలో, ఇంద్రియార్థములలో గడిపివేయుట న్యాయమేనా?

కావున జీవుడా! మేలుకో! అజ్ఞానమును పారద్రోలు. ఆత్మజ్ఞానమును పొంది జన్మసార్థకతను బడయుము. లే! మేలుకో! జీవుడా! మేలుకో!

# 8) సింహావలోకనం

ముందుచూపు మంచిదేకాని వెనక్కి తిరిగి గతాన్ని ఒక్కసారి స్మరించినప్పుడు, సింహావలోకనము చేసినపుడు యుక్తాయుక్తములు, మంచిచెడ్డలు గ్రహించుటకు వీలుండును.

శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాములవారు బోధించు "పురోభివృద్ధిని కోరువారు పూర్వవృత్తాంతము మరువరాద"ని చక్కటి సూక్తికూడ సింహావలోకనమునకు అవకాశమిస్తున్నది.

ఒకసారి ఒక వ్యక్తిని యమదూతలు తీసుకొనిపోవుచుండగా మార్గమధ్యమున ఆ వ్యక్తి వెనక్కి తిరిగి చూచుటకు పర్మిషన్ కోరాడట. వాని కోరికను మన్నించిన యమదూతలు అలాగే తిరిగి చూడమని చెప్పిరి. అంతట అతడు వెనక్కు తిరిగి చూచి "ఇక ముందుకు కొనిపోవుడు" అని పలికెను. అపుడు యమదూతలు "ఎందుకు వెనక్కు తిరిగావు?" అని ప్రశ్నించగా "అహర్నిశములు కృషిచేసి జీవితమంతా కష్టపడి కుటుంబవాసులను పోషించాను. ఒక్కడైనా సహాయము కొరకు వస్తున్నాడేమోనని చూచాను. ఒక్కడూ రాలేదు." అని విచారము వ్యక్తపరిచాడట.

వెంటరానివారి వెంటపడి జనులు కష్టపడి పోషించుచున్నారు. మరి వెంటవచ్చి సహాయపడునవి ధర్మము, న్యాయము, ఉపకారము అని తెలిసికూడ ఆచరించుటకు బద్ధకస్తులగుట ఎంత అవివేకమో ఆలోచించవలెను.

"ధర్మో రక్షతి రక్షితః" అను సూక్తి కూడ మనలను రక్షించేది, కాపాడేది, సహకరించేది మన ధర్మమే అని సూచించుచున్నది.

అట్టి ధర్మము నాచరించుటయే సమస్త పూజలయొక్క,

యాత్రలయొక్క సారాంశము. "బీదలయందు, శక్తిహీనుల యందు, వ్యాధిగ్రస్తులయందు, దేవుని చూచువాడే వాస్తవముగ దేవుని దర్శించువాడు. విగ్రహమునందే దేవుడున్నాడని పూజించు వారి పూజ సామాన్యమైనద"ని స్వామి వివేకానందులవారు సెలవిచ్చియున్నారు.

ఈ విషయములను పదే పదే గుర్తుంచుకొని గత సంవత్సరము ఏమైనా సత్కార్యక్రమాలు చేసినానా? ఎవరికైనా సహకరించానా? కొంతలో కొంతవరకైనా అన్నార్తుల ఆకలి తీర్చగలిగానా? ఆపత్తులో కొందిరినైనా ఆదుకోగలిగానా? లేక ఏవైనా పొరపాట్లు చేశానా? అట్టి పొరపాట్లు ఎట్టివి? వాటిని ఎందుకు చేశాను- ఎలా చేశాను దానికి ప్రేరేపణ ఎలా వచ్చింది? వాటిని సవరించుకొనుట ఎట్లు? మొదలుగా గల విషయములను గ్రహించి జాగర్తపడి ఉన్నతికి మార్గము అన్వేషించ దలంచిన ప్రతి వ్యక్తి వెనక్కి తిరిగి చూడవలసిందే. సింహావలోకనం చేయవలసిందే. ఆలోచించవలసిందే. మంచి మార్గాన్ని అన్వేషించవలసిందే అలాచేస్తే బంగారుకు పుటం పెట్టినట్లు మన మనస్సును శుద్ధంచేసి మంచి మనస్సుగా చేసుకొని తరించవచ్చును. శాంతిని పొందవచ్చును.

# 9) బుద్ధి

బుద్ధికి చాలా ప్రాముఖ్యత గలదు. "అతనికి బుద్ధిలేదు" అను పదము చాలామంది వాడుచుందురు. అనగా అతను చేయరాని పని ఏదో తప్పు చేశాడని దాని భావన.

మరియొక సందర్భములో "అతను చాలా బుద్ధిమంతుడు" అని అనుచుందురు. అనగా అతను మంచి పనులు చేసినాడని భావన.

ఇలా చెడ్డబుద్ధి - మంచి బుద్ధిగలవారు ప్రపంచములో వుందురు. చెడ్డ బుద్ధిని తొలగించి మంచి బుద్ధిని అవలంబించుకోవాలని పెద్దలు చెప్పుదురు.

"సబ్‌కో సన్మతి దే భగవాన్"

"అందరికి మంచి బుద్ధి ప్రసాదించు దేవా!"

అను గాంధీగారి భజన సూక్తి అందరికి తెలిసినదే !

మనస్సుకు, బుద్ధికి తేడా తెలియనివారు కొందరున్నారు.

మనస్సు - సంకల్ప శక్తి.

బుద్ధి- నిర్ణయ శక్తి గలిగి యున్నవి. క్రింది ఉద్యోగి ఏ విషయమైనా తానే నిర్ణయించుకొనుటకు వీలుండదు. పై ఆఫీసరుకు అప్లై చేసి ఆ ఆఫీసరు నిర్ణయాన్ని అమలుపరుచుటయే అతని కర్తవ్యము.

అలాగే మనస్సు క్రింది ఉద్యోగితో సమానము. మనస్సు అనే క్రింది ఉద్యోగి ఏదైనా పని చేయదలంచినపుడు బుద్ధి యొక్క నిర్ణయానికి పంపబడును. బుద్ధి అనే ఆఫీసరు ఆ పని యొక్క

పూర్వాపరాలు ఆలోచించి, నిర్ణయించి మనస్సను క్రింది ఉద్యోగికి ఆదేశాలు జారీ చేయును. బుద్ధి పంపిన ఆదేశాలను అమలుప రుచుటయే మనస్సు యొక్క కర్తవ్యము. బుద్ధి యొక్క ఆదేశాలు మంచివైనను, చెడ్డవైనను మనస్సుచే అమలు జరుపబడును. కావున బుద్ధి యొక్క పాత్ర చాలా ప్రధానమైనది, కీలకమైనది. కాబట్టి బుద్ధి వక్రించినప్పుడు సమస్తము తలక్రిందులగును.

నిత్యజీవితంలో బుద్ధి పాత్ర ఎట్టిదో ఒకింత విచారించుకొం దాము. బస్సులో కాని, రైలులో కాని ప్రయాణము చేస్తూ వున్నాము. మన ఊరు వచ్చింది అనే వార్త చెవులు వింటాయి, కండ్లు చూస్తాయి. వెంటనే మనస్సు గ్రహిస్తుంది. ఆ తదుపరి కర్తవ్యమేమిటని మనస్సు బుద్ధిని అడుగుతుంది. వెంటనే దిగవలె నని బుద్ధి మనస్సుకు హితవు చెప్తుంది. మనస్సు ఇంద్రియాలకు పర్మిషన్ ఇస్తుంది. మనస్సు యొక్క పర్మిషన్‌తో కాళ్ళు దిగుటకు పూనుకుంటాయి.

ఇలా ప్రతి పనికి బుద్ధి నుండి ఆదేశాలు రావలసిందే! "బుద్ధి" సుప్రీం కోర్టు జడ్జి వంటిది. దాని తీర్పునకు తిరుగులేదు. ఒకరిని హింసించాలన్న, దూషించాలన్న, చెడ్డ చేయాలన్న, మంచి చేయాలన్న బుద్ధి నిర్ణయించవలసింపి. కావున అట్టి అత్యుత్తమమైన ప్రధాన పాత్రధారి, సూత్రధారి అయిన "బుద్ధి" ని పరిశుద్ధమొ నర్చుకొని తద్వారా మహోన్నత ఆశయములు, మంచి పనులు, పరోపకార కార్యములు సాధించువానినే బుద్ధిమంతుడు అందురు. అట్టి సద్బుద్ధి సర్వేశ్వరుడు సర్వులకు ప్రసాదించాలని కోరుకొనుట మన అందరి అభిలాష.

# 10) సత్కాలక్షేపము

**శిష్యుడు** - రాక్షసత్వం అంటే ఏమిటి స్వామీ ?

**గురువు** - మనిషిని మనిషి దోచుకోవటం, అపకారం చేయుటం, హింసించటం.

**శిష్యుడు** - మానవత్వమనగా ఏమిటో సెలవిస్తారా ?

**గురువు** - మనిషి సాటి మనిషికి సహాయము చేయుట, మరియు సర్వజీవరాసులకు సహకారము అందించు స్వభావము కలిగియుండుట.

**శిష్యుడు** - ఆహ్వానము చేయకపోయినను, సోమరిగ ఉన్నను, బద్దకముగనున్నను, ప్రయత్నము చేయక ఉన్నను లభించు వస్తువేది గురువరా ?

**గురువు** - మృత్యువు.

**శిష్యుడు** - ప్రయత్నముతో లభించునది ఏది స్వామీ ?

**గురువు** - మోక్షము.

**శిష్యుడు** - శరీరమును దేనితో పోల్చవచ్చును స్వామీ?

**గురువు** - ఈ శరీరమును ఒక అద్దె కొంపతో పోల్చుట మంచిది. అద్దెకొంపలలో ఎల్లప్పుడు నివసించుటకు వీలులేదు. అట్లే ఈ శరీరములందు కూడాను.

**శిష్యుడు** - విషము కంటె ప్రమాదమైన వస్తువు ఏదైనా ఉన్నదా గురుదేవా?

**గురువు**- ఉన్నది నాయనా! విషసర్పాలు ఒక శరీరమును మాత్రమే బాధించును. కాని పాపము చేత కరవబడినవాడు

ఒక శరీరమును మాత్రమే బాధించును. కాని పాపము చేత కరవబడినవాడు జన్మజన్మలు బాధపడవలసివచ్చును. కావున వివేకవంతుడు పాపమునుండి దూరమగుటకు ప్రయత్నించును.

శిష్యుడు - ఐశ్వర్యవంతుడు ఎవరు స్వామీ ?

గురువు - ఉన్నదానితో తృప్తిని పొందువాడు.

శిష్యుడు - దరిద్రుడెట్టివాడో సెలవిస్తారా ?

గురువు - అమితమైన ఆశచే బంధితుడైనవాడు.

# 11) పరలోక ధనము

"మనము తిన్నది మట్టిపాలు, ఇతరులకిచ్చినది మనపాలు" దీని పూర్వాపరాలు విచారించుకొందాము.

మనము తిన్నది ఎటువంటి అమూల్యమైన పదార్థమైనా తెల్లవారి మట్టిలో కలిసిపోతున్నవి. ఇతరులకు మనము ఏ దానధర్మాలు చేసినను, ఆహారము పెట్టినను అట్టివి మనఖాతాలో జమ కట్టుదురు విశ్వప్రభుత్వంవారు తమ బ్యాంకులో. కొడుకుల కిచ్చినది, కూతుళ్ళకిచ్చినది, అల్లుళ్ళకిచ్చినది మనము తిన్నది మన ఖాతాలో జమకాదు.

కావున ప్రతి వ్యక్తి ప్రతిరోజు ఏదో కొంత పుణ్యము చేసి పరోపకారము చేసి వారి వారి ఖాతాలలో జమ చేసుకొనుటకు తప్పనిసరిగా ప్రయత్నించవలెను. లేనిచో ధనరాసులన్నియు వ్యర్థమే. ఈ ధనరాసులను పరలోకములో వాడుకొనుటకు అవకాశములేదని అందరికి అనుభవములోని విషయమే.

కానీ ఇచట వారు వారు సంపాదించిన ధనరాసులను పరలోకములో తప్పని సరిగా ఉపయోగించుకొను పద్ధతి గలదు. ఎట్లన ఒకరు భారతదేశమునుండి అమెరికా మొదలగు ఇతర దేశములకు వెళ్ళవలసి వచ్చినపుడు ఇచటి పైకమును డాలర్లు మొదలైన వాటిగ మార్చుకొని అచట ఉపయోగించుకొనుట ఏ విధముగ సంభవించుచున్నదో అలాగే తమ ధన కనక వస్తు వాహనములను ఇతర లోకములలో ఉపయోగించుకొనదలంచినవారు వాటిని దానధర్మములద్వారా "పుణ్యము" అను ధనముగా మార్చుకొని, అచట చక్కగ అనుభవించుకొనవచ్చును. ఈ విషయములో అశ్రద్ధ చూపినచో పరలోకములో కష్టాలు తప్పనిసరి.

అందుకే ఒక మహనీయుడు దానమనగా సంపాదన అన్నాడు. అనగా పుణ్య సంపాదన. బీదవారు ప్రజల ధనరాసులకు విశ్వప్రభుత్వంవారి బ్యాంక్ తరఫున ప్రతినిధులై సహకరిస్తున్నారు.

ఈ విషయమును గురించి వివేకానందులవారు చెప్పిన విషయము గుర్తు చేసికొందాము. "ఏమో నీవు చాలా గొప్పవాడవని తలంచి చేతిలో నాలుగు కాసులు తీసుకొని బీదవానివైపు గిరాటు వేయకుము. మర్యాదగా అతనికిమ్ము. ఆ బీదవాడు అచట వున్నందుకు కృతజ్ఞుడవై యుండుము. అతని కిచ్చుటవలన ఉపకారము నీకే హెచ్చుగా కలిగినదని తెలిసికొనుము."

ఈ విధంగా దాన మహిమను గురించి మహాత్ములు పలు విధాలుగా సెలవిచ్చియున్నారు. మహాభారతమునందలి కర్ణుడు దానకర్ణుడు అను నామధేయాన్ని సార్థకము చేసుకొన్న విషయము అందరికి తెలిసినదే.

కావున ప్రతివారు తాము సంపాదించిన ధనరాసులు వృథా కాకుండ దాన ధర్మాదులద్వారా సద్వినియోగపరుచుకొని విశ్వప్రభుత్వంవారి బ్యాంకినందు తమ ఖాతాలో జమ చేసుకొని తమకు రక్షా కవచంగా ఉపయోగించుకొనవలసియున్నది. తద్వారా మహత్తర పుణ్యమును సంపాదించి ఆనందమును పొంది జన్మ సార్థకము చేసుకొనుటకు ప్రయత్నించవలయును. అట్టి ప్రయత్నము సాఫల్యము కొరకై భగవానుడు సర్వులను అనుగ్రహించుగాక.

# 12) ఎలా మాట్లాడాలి ?

కొందరి మాటలు ఎదుటివారి హృదయములో మేకులై, సూదులై, బాణాలై, బాకులై బాధించును. మాటలలో కూడ తీక్షత్వము చూపుట ఎందుకో అలా మాట్లాడేవారికైనా అర్థము గాదు.

మరికొందరి మాటలు చక్కగను, సౌమ్యముగను, ఇంపుగను, ముచ్చటగను, ముత్యములవలె నుండి మనోవికాసానికి, శాంతికి దోహదము చేయుచుండును.

శరీరమునకు అలంకారము బంగారు ఆభరణములు అని వాటిని అలంకరించు కొందురు. వాటివలన శాంతి లేకపోగా ఎవరైనా అపహరించెదరను నిరంతర భీతితో, అశాంతితో అను క్షణము కాపురము చేయుచుందురు. కాని పవిత్రవాక్కు అనే ఆభరణం ధరించినచో తనకు తాను శాంతిని పొందుటయే కాక దానిని ఉపయోగించుకున్నవారు కూడ శాంతిని పొందుదురు. ఆ పవిత్రవాక్కు ఇరువురికిని లాభసాటియైన దివ్యరత్నము.

ఇట్టి వాగ్భూషణముతో ప్రపంచములో ఎట్టి అసాధ్యమైన పనిని కూడ సాధించవచ్చును. కత్తులు, కటారులు, బాంబులు, బాణాలు ఉపయోగించి నెరవేర్చలేని పనిని మృదువైన వాక్కుతో సాధించవచ్చును.

తనువున విరిగిన అలుగులు
ననువుగ దీయంగ వచ్చు నతి నిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
విను యెన్ని యుపాయముల వెడలునె యధిపా

(తనువు = శరీరము, అలుగులు = బాణములు)

తా || శరీరమున గ్రుచ్చుకొన్న బాణములను సులభముగా తీసి గాయములను మాన్పవచ్చును. కాని మనస్సున గ్రుచ్చుకొన్న మాటలు అను గాయమును మాన్పుట ఎవరితరము కాదు.

కావున ఎపుడును, ఏ పరిస్థితులలోను ఇతరుల మనస్సును నొప్పించకుండుట ఉత్తముని లక్షణము. ఇట్టి ఉత్తమ సుగుణమే భగవంతుని చేరుటకు చక్కటి సాధనము. ఎట్టి పరిస్థితులలోనైనను ఇతరుల మనస్సును బాధించక చైతన్యనంత వరకు శాంతికి దోహదము చేయువాడు ధన్యుడు. ఉపకారము చేయలేకపోయినను అపకారము తలపెట్టకుండుట కూడ మంచి సుగుణమే.

# 13) గోపూజాఫలము

ఒకప్పుడు పార్వతీదేవి పరమేశ్వరునితో నాథా! జనులు పాప విముక్తి చెందుటకు ఏదైనా మార్గమును, తరణోపాయమును తెలుపుమని కోరెను.

శివుడు పార్వతీదేవితో-

ఓ పార్వతీదేవీ! గోమాతయందు సమస్త దేవతలు వున్నారు.

పాదములందు - పితృదేవతలు

కాళ్ళయందు- సమస్త పర్వతాలు

భ్రూమధ్యంబున - గంధర్వులు

దంతములయందు - గణపతి

ముక్కున - శివుడు

ముఖమున - జ్యేష్ఠాదేవి

కళ్ళయందు - సూర్యచంద్రాదులు

చెవులయందు - శంఖచక్రాలు

కంఠమునందు - విష్ణుమూర్తి

భుజమున - సరస్వతియు

రొమ్మున - నవగ్రహములు

వెన్నునందు - వరుణదేవుడు అగ్నిదేవుడును

తోకయందు - చంద్రుడును

చర్మమున - ప్రజాపతియు

రోమావళియందు - త్రింశత్కోటి దేవతలును నివసించెదరని ప్రతీతి.

అందువలన గోమాతను పూజించి ఆయురారోగ్యమును, అష్టైశ్వర్యములను పొందవచ్చునని పరమశివుడు పార్వతీదేవికి సెలవిచ్చెను.

గోవులకు తృప్తిగ ఆహారము పెట్టిన సమస్త దేవతలకు ఆహారము పెట్టిన పుణ్యఫలము కలుగును.

మనసారా నమస్కరించినందువలన సమస్త దేవతలకు నమస్కరించినంత పుణ్యము కలుగును. గోమాతకు ప్రదక్షిణము చేయుటవలన భూమండలమంతయు ప్రదక్షిణము చేసినంత ఫలము కలుగును.

# 14) రండి ! దయచేయండి !

ఏమండీ ! బాగున్నారా ! రండి కూర్చోండి. ఈ మాటలలో మనకు ఏమీ కష్టము లేదు. మన సొమ్ము పోలేదు. కాని ఎదుటివాడు ఎంత ఆనందపడుతాడు.

మన వస్తువులు, మన డబ్బు, ఇతరులకు పంచవలసివచ్చినా లేక దానమివ్వవలసి వచ్చినా, ఖర్చుపెట్టవలసి వచ్చినా పిసినారి తనము, లోభము అవలంబించినా, దానికి కాస్త అర్థముంది. మన సొమ్ము ఖర్చు పెట్టనవసరం లేకుండా, మాటలతోనైనా, ఒకరిని సంతోషపెట్టుటకు ఎందుకు ప్రయత్నించరు? మాటలలో పిసినారిత నమెందుకు ? ఎదుటివారికి సూదులు, కత్తులు గ్రుచ్చుకొనునట్లుగ ఎందుకు మాట్లాడాలి?

మాట్లాడటము తెలియకనా! చేతకాకనా!

ఏమండి రేపు రండి - అంటే ఎంత బాగుంటుంది. "ఛీ! పో. రేపు రా పో"

అంటే ఎంత కటువుగా, సంస్కారహీనంగా వుంది! కలహానికి కారణాలు ఇట్టివేకదా!

దానధర్మాలు చేయలేకపోయినా, పూజలు, ధ్యానాదులు, తీర్థ యాత్రలు చేయుటకు పరిస్థితులు అనుకూలించకపోయినా, మన మనస్సు పరిశుద్ధంగా, కల్మషరహితంగా, ఎప్పుడు వుంచుకొందుమో

అప్పుడు ప్రశాంతత చేకూరగలదు. అట్టి ప్రశాంతత కొరకు అనేకుల అనేక విధములుగ ప్రయత్నించుదురు.

"నోరు మంచిదైన ఊరు మంచిదంటారు" పెద్దలు.

"కాలు జారిన తీసుకొనవచ్చును. నోరు జారినచో తీసికొనలేము " అనగా కాలు జారి విరిగినచో కట్టు కట్టి సవరించవచ్చును. నోరు జారినచో తద్వారా ఎదుటివాని మనస్సు విరిగి, ముక్కలైపోవును. అట్టి మనస్సుకు చికిత్స చేసి సవరించుట మహాకష్టము.

ప్రపంచములో జరుగు కలహాలకు, దౌర్జన్యాలకు, యుద్ధాలకు కారణం నోరు అదుపులేకనే!

కావున నోటిని అదుపులో పెట్టుకొనుట ప్రస్తుత సమాజములో అవసరమే కాదు, అత్యవసరం కూడా.

ఇంట్లో కలహాంకు-ఊర్లో కలహాలకు "నోరే" కారణం అని తెలుసుకొన్నాం. కావున నోటితో అపవిత్ర పదాలను ఉచ్చరించి తోటి మానవుని విసిగించుట మాని పవిత్రమైన భగవంతుని స్తోత్రాలను ఉచ్చరిస్తూ పుణ్యసముపార్జనతో కాలం గడుపువాడు అదృష్టవంతుడు. అట్టి అదృష్టవంతులము మనమంతా ఎందుకు కాకూడదు? కాలం కలసిరాలేదంటూ కుంటిసాకులు చెప్పి సమయాన్ని వృధా చేయుట సోమరితనం కాగలదు. సోమరికి ఇహంలేదు, పరంలేదు.

అందరూ మంచివారుగనే వుండాలనే మన సిద్ధాంతం-అలా వుంటే ఈ రాద్ధాంతాలెందుకు? ఈ రాద్ధాంతాలు, రభసలు లేని

రాజ్యాన్ని రామరాజ్యం అంటారు.

ఎవరిని హింసించక, బాధించక

మంచి బుద్ధి కలిగి

మంచి ప్రవర్తన గలిగి

మంచి కార్యాలు చేస్తూ

మంచిని పెంచుకుంటూ

మంచి చరిత్ర గలిగి మంచి మాటలతో

మనిషి-మనిషికిగల అగాధాన్ని తొలగిస్తూ, వినయాన్ని పెంచుకొని, విధేయతను అవలంబిస్తూ మానవులమైన మనమంతా మాధవత్వాన్ని పొందుదాం!

# 15) గురుశిష్య సంవాదము

శిష్యుడు - అక్షౌహిణీ సైన్యము అనగానేమి ?

గురువు - ఏనుగులు - 21,870

రథములు - 21,870

గుఱ్ఱములు - 65,610

సైన్యము - 1,09,350

ఈ మొత్తము పరివారమును ఒక అక్షౌహిణీ అందురు.

శిష్యుడు - పాండవులకు ఎన్ని అక్షౌహిణీలు సైన్యము కలదు స్వామీ ?

గురువు - పాండవులకు 7 అక్షౌహిణుల సైన్యము, కౌరవులకు 11 అక్షౌహిణుల సైన్యము కలదు.

శిష్యుడు - కౌరవ పాండవ యుద్ధము ఎపుడు ప్రారంభమైనది ?

గురువు - శోభకృత్ నామ సంవత్సర మార్గశిర శుద్ధ ఏకాదశినాడు

శిష్యుడు - అయితే భగవద్గీత ఎపుడు బోధించారు ?

గురువు - ఆ రోజు ప్రారంభ ఘడియలలో

శిష్యుడు - మహాత్ముల లక్షణములను సెలవిస్తారా ?

గురువు - తాము ఏ సద్విషయమును బోధిస్తారో, దానినే వారు ఆచరిస్తారు. దేనిని ఆచరిస్తారో, దానినే ప్రబోధిస్తారు.

శిష్యుడు - ఉత్తముని లక్షణములను సెలవిస్తారా ?

గురువు - చెడును విననివాడు

చెడును చూడనివాడు

చెడును మాట్లాడనివాడు - ఉత్తముడని శాస్త్రములు వక్కాణించుచున్నవి.

శిష్యుడు - నరకమంటారే? దానిని తప్పించుకొనుటకు ఉపాయమును సెలవిస్తారా ?

గురువు - నరకబాధ నిర్మూలనమునకు పంచ 'న' కారములను పాటించాలి.

శిష్యుడు - అవేమిటి స్వామీ! క్రొత్తగా వింటున్నాను.

గురువు - జాగ్రత్తగా వినుము.

1) స్నానము

2) గానము

3) జ్ఞానము

4) ధ్యానము

5) దానము

శిష్యుడు - మనుష్యులలో ఎన్ని రకాలు కలరు ?

గురువు - 4 రకాలు

1) ఆలోచించి చేయువారు

2) చేస్తూ ఆలోచించేవారు

3) చేసి ఆలోచించువారు

4) ఆలోచన చేసి కూడ మంచి పని చేయనివారు

శిష్యుడు - స్వామీ! భగవంతుని పొందుటకు మార్గాలను

సెలవిచ్చెదరా ?

గురువు - చిన్నపిల్లవాని మనస్తత్వమును అవలంభించాలి.

రాగద్వేషాలు లేని నిర్మల హృదయమును కలిగియుండాలి.

ప్రహ్లాదుని వలె ప్రార్థించాలి.

మీరాబాయి వలె దేవుని కొరకై విలపించాలి.

ఇతరుల బాధను తన బాధగా భావించి, వారి బాధను తొలగించుటకై శక్తివంచన లేకుండా శ్రమించాలి.

శిష్యుడు - ఋషి అనగా వివరిస్తారా స్వామీ ?

గురువు - హృషీకములను (ఇంద్రియములను) జయించినవాడే ఋషి.

# 16) పరనింద

లోకములో కొందరికి వైద్యవృత్తి, కొందరికి ఉపాధ్యాయ వృత్తి, కొందరికి న్యాయవాద వృత్తి, మరికొందరికి చేనేత వృత్తి- ఈ ప్రకారముగ అనేక వృత్తులుండును. కాని కొందరికి అసత్యా రోపణలు చేయుచు కాలమును గడపుటయే వృత్తిగా కలిగి యుందురు. వారు పనిగట్టుకొని ఇతరులపై నిందారోపణలు, నిర్హేతుక నిరాధార విమర్శలు చేయుచు కాలికి బలపము కట్టుకొని ఊరూరా, వాడవాడలా తిరుగుచు, పరులపై అభాండములను వేయుచు తిరుగాడుచుందురు. దానివలన వారికి ఇసుమంతైనను ప్రయోజనము చేరకున్నను వారు అట్టి నీచ వృత్తిని వదలకయే యుందురు.

సహేతుకములైన ఆరోపణలకు జనులు స్వాగతము పలికి ఏవైనా దోషములను వారు ఎత్తిచూపినచో, వాటిని తొలగించుటకై యత్నము చేయవలసినదే, కాని ఏ కారణము లేకయే ఒకరిపై నిందలు మోపుట, అసత్యారోపణలను చేయుట త్యాజ్యమేయగును. అట్టి పరదూషణ సామాన్యముగ అసూయవలననే కలుగుచుం డును. అసూయ మహాదుర్గుణము. అది అసురగుణములలో శిరోమణి. మానవుడు ఎన్ని శక్తియుక్తులు కలిగియున్నను ఆ ఒక్క దుర్గుణముచే అతడు ఘోరదుర్గతిని పొందితీరును. దుర్యోధనుడే ఇందులకు తార్కాణము.

ఇతరులతో మాట్లాడునపుడు జనులు ఎంతయో జాగరూకత వహింపవలసి యుండుననియు తాము పలుకు మాటలు ఒరులకు ఉద్వేగకరములుగా గాకయు, సత్యముగను, ప్రియముగను, హిత ముగను ఉండవలెననియు గీతాచార్యుడు బోధించెను. కావున తద్విరుద్ధముగ ప్రవర్తించి, అసత్యవచనములను పలుకుచు ఒరులకు

బాధ కలుగజేయుచు దుర్గతినొందుట భావ్యము కాదు.

పరనింద చాల హేయమైన గుణము. దానిని ముముక్షువు దరికి చేర్చరాదు. తనను పొగడుకొనుట, ఇతరులను నిందించుట- రెండును చాల గర్హితములైనవి. కాబట్టి ఈ రెండింటికిని ముముక్షువు చాల దూరమున నుండవలెను. అసూయనుండి ప్రాదుర్భవించిన పరనిందాదుల వలన జనులకు ఘోర దుర్గతి కలిగియే తీరును. అసూయ, పరదూషణాది అసురగుణములవలన పాప ఫలితమగు దుఃఖమును మానవుడు అనుభవించియే తీరవలెను. తత్ఫలితముగ నీచ జన్మలను కూడ బడయవలసివచ్చును.

పరనిందకు పాల్పడువారు ముందుగా తాము శుద్ధులుగా ఉన్నారాయని విచారించవలసియున్నది. తమ కంటిలో దూలమును విస్మరించి, ఎదుటివాని కంటిలోని నలుసును గూర్చి పలుకుట భావ్యము కాదు. ఒకరిని ఆక్షేపించుటకు ముందుగా తమరు శుద్ధముగా నున్నారో, లేదో చూచుకొనుట ఉత్తమము.

మరియొక రహస్యమేమనగా, ఇతరులను నిర్హేతుకముగా, నిరాధారముగా ఎవరైన నిందించినచో, అతడు తన పుణ్యమును నిందితునకిచ్చి నిందితునిలో ఏదైనా పాపమున్నచో దానిని గ్రహించునని పెద్దలు చెప్పెదురు. కావున ఎవరును మరియొకరిని నిందించకుందురు గాక!

పరమదుఃఖమునకు ఆలవాలమై, పరమదుర్గతికి హేతుభూతమై, నరకమున పడద్రోయునట్టి పరదూషణను, పరనిందారోపణలను, అసూయాది దుర్గుణములను జనులు కట్టిపెట్టి, మహోన్నత ఆత్మస్థితిని, కైవల్యమును కలుగుజేయు సమభావమును, ప్రేమభావమును కలుగజేసికొని విశ్వమంతటిని ఆత్మరూపమున వీక్షించుచు, కరుణామయులై దయాపూరితులై, పరమానందము ననుభవించెదరు గాక !

# 17) ఆనందము ఎవరిసొత్తు

పెద్ద పెద్ద అధికారులను, లక్షాధికారులను చూచి "ఆహా! వారెంత అదృష్టవంతులు. వారు ఆనందంగా సుఖాలు అనుభవిస్తున్నారు" అని కొందరు అనుకొనుచుందురు. కాని లోగుట్టు పెరుమాళ్ళకెరుక. వారికి ఉన్న బాధలు సామాన్యులకు లేవని గ్రహించవచ్చును.

ఇక లక్షాధికారిని "ఏమండీ! మేకేమి! 4 అంతస్థులు మిద్దె. 4 రకాల కార్లు, 40 మంది నౌకర్లు, 4 ఎయిర్ కండిషన్డ్ గదులు వున్నాయి. హాయిగా ఉన్నారు" అని అడిగిన అతని సమాధానం - "ఇన్నీ ఉన్నాయండీ! అవసరమైనది మాత్రము లేద" ని బదులిస్తాడు. "ఏమిటి అవసరము శాంతి, ఆనందము అవి తప్ప అన్నీ వున్నాయి. " అని అంటాడు. కారణము శాంతిసుఖాలు సంపదలో లేవు. సంతృప్తిలో ఉన్నాయి. ఎలాగో విచారిస్తాము.

ఒక బీదవాడు ప్రతిరోజు భిక్షాటనము చేసుకొని ఆ వచ్చిన ఆహారమును తృప్తిగా, కడుపునిండా భోంచేసి, కంటినిండా నిద్ర పోయేవాడు. ఒకరోజు భిక్షాటన సందర్భములో 99 రూపాయలు దారిలో దిరికినవి. 100 రూపాయలు చేయాలనే ఆలోచనలో పడ్డాడు. భిక్షాటన అన్నాన్ని అమ్మి ఆ డబ్బుతో 100 రూపాయలు చేయాలనే సంకల్పము కలిగింది. వెంటనే అమ్మకమునకు పెట్టాడు. 5 రూపాయలకు అమ్మగలిగాడు. దొరికిన 99కు 5 చేర్చాడు. 99+5 = 104 అయింది. దీనిని 110గ చేయాలనుకున్నాడు. రెండు

రోజులు భిక్షాటన చేసి కడుపుకు తినకుండ 15 రూపాయలకు అమ్మ కము పెట్టాడు. 104 + 15 = 119 అయింది. సంఖ్య బాగా లేదు 125 చేయాలనుకున్నాడు. కడుపుకు తిండి తినకుండా సంపాదనలో పడ్డాడు. చివరగా నడవటానికి శక్తి కోల్పోయాడు. కళ్ళు గుంతలు పడ్డాయి. కన్ను మూశాడు. భిక్షాటన చేసుకొని కడుపునిండా తిని, కంటినిండా నిద్రపోయేవానికి సంపాదించాలనే దురాశ ఎంతటి దుష్ఫలితము నిచ్చెనో దీనిని బట్టి గ్రహించగలుగుచున్నాము.

అందుకే పెద్దలు -

దురాశ దుష్ఫలితమును ఇచ్చును,

అత్యాశ అధోగతికి చేర్చును- అని చెప్పియున్నారు.

శాంతి సుఖము సంపదలలో లేవు,

సంతృప్తిలో ఉన్నాయను విషయమును గ్రహించి, అందని దానికి ఆరాటపడకుండా ఉన్నదానితో ఉపశాంతిని పొందగలిగిన వాడు ఉత్తముడు. ఉత్తమోత్తముడు.

# 18) కలియుగ వైకుంఠం

ఇది కలియుగము ఇపుడు ప్రపంచములో ఉన్న జీవులందరు కలి యుగవాసులు. కలియుగంలో ధర్మం ఏకపాదంతో ఉండుననియు, అధర్మం విచ్చలవిడిగా తాండవము చేయుచుండుననియు చెప్పుదురు. కాని ఆ వాక్యములచే ఎవరును కంగారుపడనక్కరలేదు. అధర్మం తమపై సవారి చేయునని ఎవరును భయపడనక్కరలేదు.

యుగము మానవుని పరివర్తన నొందించలేదు. మానవుడు జాగరూకుడై యుండి తనలో ఏ విధమైన వికారము ప్రవేశింపకుండ చూచినచో, ఏ విధమైన అపవిత్రత, దుర్గుణము, దురాచారము, కల్మషము జొరబడకుండఇ జాగరూకుడై యుండినచో ఇక కలి యుగము అతనిని ఏమి చేయగలదు? కలియుగము యొక్క ప్రభావము అతనిపై ఏమి ఉండగలదు?

దైవ విషయమున, ధర్మ విషయమున సచేతస్కుడై యుండువా నిపై కలియుగముయొక్క పెత్తనము ఏమియుసాగదు. యుగము మానవుని ఏమియు చేయలేదు. మనుజుడు తాను జాగ్రత్త వహించియుండినచో ఇక ఎవరును, ఏదియు అతనిని ఏమియు చేయజాలవు.

కలౌ కృతయుగం తస్య
కలిస్తస్య కృతేయుగే
యస్య చేతసి గోవిందో
హృదయే యస్య నాచ్యుతః

ఎవని చిత్తమందు గోవిందుడుండునో, అనగా ఎవడు తన చిత్తమందు గోవిందుని ధ్యానించునో అతడు కలియుగమందు న్నప్పటికిని కృతయుగమునందున్నవాడే యగును. అట్లే ఎవడు

తన హృదయమున అచ్యుతుడగు పరమాత్మకు స్థానమొసంగడో, ఆ పరమాత్మను గూర్చి చింతింపడో, ధ్యానింపడో అట్టివాడు కృతయుగమున ఉన్నవాడైనను కలియుగవాసియే కాగలడు- అని శాస్త్రములు పలుకుచున్నవి.

కృతయుగమున హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు మొదలగు క్రూరులు జన్మించియుండలేదా? అట్లే కలియుగమున బుద్ధుడు, శంకరాచార్యులు, రామకృష్ణ పరమహంస, వివేకానంద, గాంధీజీ వంటి పరమపవిత్రులు జన్మించలేదా? కాబట్టి యుగము మానవుని తయారుచేయదు, మానవుడు యుగమును తయారుచేయును.

ఎవడు తన హృదయమున నిష్కల్మషముగ, మహా పవిత్రముగ, దోష రహితముగ, ఉంచుకొనునో, ఎవడు తన చిత్తమున నిరంతరము నారాయణుని స్మరించుచు, ధ్యానించుచునుండునో అతడు తన ఉపాధిని, తన పరిసరములను, తన గ్రామమును, తన దేశమును వైకుంఠముగ చేసికొనిన వాడేయగును. ప్రతివారియొక్క జీవితలక్ష్యమిదియే. తన శరీరమును వైకుంఠముగ దైవనిలయముగ మార్చుకొనుట, తన చిత్తమున భగవంతుడగు శ్రీమన్నారాయణుని ప్రతిష్ఠించుట- ఇదియే జీవుని కర్తవ్యము.

కాని ఏ కొలదిమంది మహనీయులో ఆ ప్రకారముగ తమ యందు దైవనిలయములను, వైకుంఠములను సృష్టించుకొనుచున్నారు. బహుసంఖ్యాకులు తమ చిత్తములను కలుషితముగ, అపవిత్రములుగ నొనర్చుకొనుచున్నారు. అట్టివారు పరిపూర్ణ శాంతి సుఖములను ఎన్నటికిని నోచుకోలేరు. కాబట్టి మానవుడు బహుజాగరూకుడై ప్రతిదినము దైవధ్యాన, జపతపాదులను భక్తిపూర్వకముగ సలుపుకొనుచు, ఆధ్యాత్మిక వాతావరణమును తనలో సృష్టించుకొనుచు, చెడును దరికి చేరనీయక తన హృదయమును వైకుంఠముగ మార్చుకొని, వైకుంఠమును తనలోనే సృష్టించుకొని

నారాయణుడగు భగవంతుని సాన్నిధ్యమున పరిపూర్ణ శాంతి సుఖ ములను అనుభవించుచు బ్రహ్మానందముతో విరాజిల్లునుగాక! ఈ సందర్భమున "తత్త్వసారము" అను చిన్న పుస్తకమందలి రెండు తత్త్వములను ఇచట ఉదహరించుట సమంజసమని తలంచుచు న్నాను.

. పాపకార్యము చేయబోకన్నా
పాపఫలితము పరమ దుఃఖము తెలిసికోరన్నా,
రాక్షసత్వము పారద్రోలి,
దైవభావము కుదుటపరచి
పాపగంధము లేశమైనను
లేక యుండుము చిత్తమందున
తత్త్వసారము తెలిసికోరన్నా
సద్గురుని చెంత, నిజము కనుగొని లాభమొందన్నా

. పాపమేమియు చేయవద్దన్నా
పుణ్యంబుచేతను చిత్తశుద్ధిని బడయుమోరన్నా
జపము చేతను, తపము చేతను
తీర్థయాత్రల సేవచేతను
పుణ్యపుంజను పెంచి పెంచి
మోక్షపదవిని పొందురయమున
తత్త్వసారము తెలిసికోరన్నా
సద్గురునిచెంత, నిజము కనుగొని లాభమొందన్నా

# 19) జన్మ ఎందుకు సోదరా!

జన్మలో దుఃఖం
మరణంలో దుఃఖం
జీవితంలో దుఃఖం
మరెందుకీ జన్మ సోదరా !

ఎందరో మహానుభావులు
పుట్టిరి పెరిగిరి
ఎన్నియో ధర్మరహస్యాలను
వెదజల్లిరి ఏరుకో జీవుడా
మేలుకో మానవుడా
అందుకో సోదరా !

దుర్మార్గులను దూరంగా
సన్మార్గులకు సమీపంగా
ధర్మమార్గానికి దగ్గరగా ఉండి
యోగమార్గంలో సాగిపో సోదరా !

కుతంత్రములతో
కొల్లగొట్టి కొంపలు
నాశనము చేయువారి

కొలువు మనకెందుకు సోదరా !

సోమరితనానికి దూరమై
భగవంతునికి దగ్గరై
భవబంధాలను దులిపివేసి
దివ్య జీవితం గడుపు సోదరా !

దరిద్రులం కాదు మనం
దారిద్ర్యం దరిదాపులకు
రాకూడదని ఆజ్ఞాపించు
రారాజులం మనం
దైవసామ్రాజ్యాధిపతులమైయుండు
మనకు దైవ దర్శనమే కాని
దారిద్ర్య దర్శనం కాదు సోదరా !

రారమ్ము రామరాజ్యంలో
పభ్యులమైపోదాం
రామునితో ఆనందంగా ఉందాం
రాముని కృపాకటాక్షం పొందుదాం
ఈ జన్మే తుది జన్మగా
చేసివేస్తాం - అట్టి ప్రయత్నం లేని
జన్మ ఎందుకు సోదరా!

# 20) మహావీరుడు

మహాభారత యుద్ధము 18 రోజులలో పూర్తి అయినది. రామరావణ యుద్ధము కూడ కొద్ది రోజులలో పూర్తి అయినది. కాని సాధకుని హృదయమున జరుగు యుద్ధమునకు అంతులేకున్నది.

ధర్మానికి - అధర్మానికి

న్యాయానికి - అన్యాయానికి

పుణ్యానికి - పాపానికి

ఈ యుద్ధములో సాధకుడు అనగా ముముక్షువు జయము పొందవలెననిన పటుతరమైన ఆయుధములను ప్రయోగించి మాయ, అజ్ఞానమను శత్రువులను ఓడించవలసియున్నది. ఈ యుద్ధములో గమనించదగు విషయము లేమనగ-

1) ధర్మము కొరకు జరుగు పోరాటములో అపజయములను అవమానములను లెక్కచేయరాదు. అవి సామాన్యమైనవి. వాటివలన జీవితమునకు వెలుగు ఏర్పడును.

2) ప్రయత్నములు పోరాటములే జీవితమునకు శోభః

3) లక్ష్యమును చేరవలెనను తలపుతో వెయ్యి పర్యాయములు ఓడినను మరల మరల ప్రయత్నించి దాని అంతము చూడవలసినదేకాని వెన్ను చూపించరాదు.

4) లోకమును జయించవలెనను తలపుమాని లోపల (హృదయములో వున్న అంతఃశత్రువులను) నున్న కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను శత్రువులను జయించవలెనను దృఢతర నిర్ణయమును గైకొనవలయును.

5) ఈ యుద్ధములో సైనికునికి వుండవలసిన ప్రధానమైన సుగుణములు పవిత్రత, సహనము, పట్టుదల అను ఈ ఆయుధములను ధరించి మాయతో యుద్ధము చేయువానిని ప్రపంచములో ఏ శక్తి జయించజాలదు. ప్రపంచమంత ఎదురుతిరిగి నిలిచినను ఈ సుగుణములు గలవాడు ఒంటరిగి నిలిచి పోరాడగలడు. జయించగలడు.

మరణము అందరికి సమానమే, కాని ఇట్టి మహోత్కార్యాల కొరకు పోరాడి మరణించినవాని జీవితము ధన్యజీవితము. లేనిచో ఈ చరాచర పశుపక్షాదులు, క్రిమికీటకాదులు, వృక్షములు పుట్టుచున్నవి చచ్చుచున్నవి. వాటివలె కాక మానవ జీవితము మాధవ జీవితముగ తీర్చిదిద్దుటకై ప్రయత్నించి ఈ ధర్మాధర్మ యుద్ధములో విజయభేరి మ్రోగించువాడే వీరుడు, మహాశూరుడు.

# 21) అసురభావము వీడవలెను

అసుర స్వభావము కలవారు ఈ ప్రపంచము సత్యమనియు, దేవుడు లేడనియు, భోగవిలాసములను అనుభవించుటయే జీవితలక్ష్యము తలంచి దంభము, దర్పము, అసూయ, ద్వేషము మున్నగు రాక్ష గుణములు కలిగియుందురు. మరణించిన తరువాత ఈ శరీరము మరల రాదు కనుక అది ఉన్నపుడే ఎగిరెగిరి త్రాగవలెను. గంతుల వేయవలెను. భోగములు అనుభవించవలెను! - అని వారు పలుక చుందురు. భోగములు అనుభవించుటకు ఒకవేళ డబ్బు చాలని ఋణము చేయుడని చెప్పుదురు. త్రాగుడు, మధుమాంసము మున్నగు నిషిద్ధ వస్తువులను వారు ప్రోత్సహించుచుందురు.

ఇది సరియైన మతము కాదు. భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ ఇట్టి అసురిక స్వభావమును తెస్పగ ఖండించి వైచెను. జీవి తము ఇంద్రియ సుఖము కొఱకు కాదు, ఆత్మ సుఖము కొఱకు భోగముల కొఱకు కాదు, యోగము కొఱకు. భోగాదులే జీవిత లక్ష్య మైనచో మానవుడుగా పుట్టనవసరము లేదు. ఏ పశుపక్ష్యాదులుగా జన్మించినను ఆయా జన్మలలో విషయ సుఖములు లభించుచునే యుండును. కాబట్టి వివేకవంతుడు అసుర స్వభావమును వీడి జీవితము క్షణభంగురమని భావించి తన జీవిత లక్ష్యమగు ఆత్మ సాక్షాత్కారమును త్వరితముగ సాధించవలెను. దంభదర్పాదులను

దరికి చేర్చరాదు. త్రాగుడు, మాంసభక్షణము మొదలైన రాజసిక క్రియలను అవలంభించరాదు.

సాత్త్వక స్వభావమును అభ్యసించి పరప్రాణి యెడల ప్రేమ, దయ, కరుణ కలవారై, దైవ సంపదను అవలంభించి ఇంద్రియమ నంబులపై విజయము సాధించి జీవితమును ఆధ్యాత్మికమయముగ, దైవగంధయుతముగ గావించుకొనవలెను. దుర్జనుల సాంగత్యమును విడనాడి సజ్జనుల సాంగత్యమునే ఆశ్రయించవలెను. తరించుటకి దియే రాజబాట. అసుర స్వభావమును ఏమాత్రం దరికిచేర్చరాదు.

# 22) పుట్టినరోజు పండుగ

పండుగల కొరకు ఎదురుచూచుచుందురు చిన్నపిల్లలు-ఏలయన పిండివంటలు, కొత్తబట్టలు వచ్చునని సంతోషముతో గంతుల వేయుచుందురు.

అట్లే పుట్టిన పండుగకు కూడ ఎదురుచూచుచుందురు.

పుట్టిన తేదీని గురించి తెలిసికొనుటకు ఆరాటపడుచుందురు చాలామంది. మరిపుట్టింది ఎందుకో తెలుసుకొనవలెనను సంకల్ప ముగలవారు అరుదుగ వుందురు.

పుట్టింది ఎందుకో మొదట ప్రశ్న వేసుకొందాము.

తిరిగి పుట్టకుండా చేసుకొనుటకు అని సమాధానము చెప్పుచు న్నారు పెద్దలు.

జైలు శిక్ష నుండి విడుదలయినవాడు తిరిగి జైలుశిక్ష కొరకు ఎదురుచూచువానినేమందురు? పిచ్చివాడందురు.

మరి జీవులు కూడ తల్లి గర్భమనెడి జైలు శిక్ష నుండి, కారాగారము నుండి బయటపడి తిరిగి అట్టి కారాగారము కొరకు ఎదురుచూచు వానిని ఏమని పిలవాలనో ఊహించండి.

పుట్టిన పండుగల సంఖ్య పెరిగినకొద్ది చావు సంఖ్య దగ్గర పడుచుండునను ధర్మరహస్యము ఎందరు ఆలోచించుచున్నారు.

సూర్యుడు ఒక్కరోజు పడమటకు వెళ్లి కనుమరుగైనప్పుడు మన జీవిత సంఖ్యలో ఒక్క రోజు తగ్గిపోవునని ఎందరు ఊహించుచున్నారు.

పుట్టుటలో బాధ, పెరుగుటలో బాధ, ముసలితనములో బాధ,

చనిపోవుటలో బాధ - ఈ బాధలు చూస్తూ కూడ ఎందుకు విముక్తి కొరకు ప్రయత్నించరు? అనుదానికి అజ్ఞానమను కైపే కారణమని భర్తృహరి సెలవిచ్చి యున్నాడు.

పుట్టినందుకు ఏదో ఒక మహత్తరమైన పరోపకార కార్యము చేసి చచ్చుట మంచిది. కాని కేవలము త్రాగుట, సంతానము గనుట ఈ పనుల కొరకు మానవ జీవితము అవసరము. ఈ పనులు పందులు, కుక్కలు, నక్కలు, గాడిదలు, పశువులు, పక్షులు, క్రిమికీటకాదులు కూడ చేయుచున్నవి.

ఈ సామాన్యమైన పనులకు అమూల్యమైన మానవజన్మ అవసరములేదు.

మానవజన్మను వ్యర్థకార్యములకు ఉపయోగించువాడు బంగారు నాగలితో దున్ని జిల్లేడు చెట్లు పైరుపెట్టి, అట్టి జిల్లేడు తోట కంచె కొరకు చక్కెరకేళీ అరటి చెట్లను నరికి కంచె వేయువానితో సమానము.

కావున పుట్టిన పండుగలు ఎన్ని జరుపుకొన్నామని లెక్కలు వేయుటకంటె, మంచి పనులు, పరోపకార కార్యములు ఎన్ని చేశామని లెక్క చూచుకొనుట ఉత్తమము. ఇట్టి పరోపకార కార్యములను జరిపిన దినములనే నిజమైన పుట్టిన రోజు పండుగలుగ పరిగణించవలయును.

# 23) భక్తి వుంటే ఇక ఏమి కొరవ ?

పరమ భక్తుడు దయార్ద్రి హృదయుడైన ఒక మహారాజు యుండెను. అతను ఎంతో మంచి గుణవంతుడుగ పేరు గాంచెను. అతని భార్య కూడ అనుకూలవతియై రాజ్య కార్యాలలో చేదోడు వాదోడుగా సహకరించుచుండెను. వారికి ఒక కుమార్తె గలదు. మంచి విద్యావంతురాలైన కుమార్తె యుక్తవస్కురాలై యుండెను. ఆమెకు వివాహము చేయు సంకల్పముతో ఒకనాడు రాజు రాణి సమావేశమై వరుని గురించి ఆలోచిస్తూ వచ్చిరి. రాజకుమారునకిచ్చిచ మన కొమార్తెను వివాహము చేయుటకంటే పరమ భక్తునికెవ్వనికైన ఇచ్చి వివాహము చేయుట మంచిదని నిర్ణయించుకొనిరి. మరి అట్టి భక్తుని జాడ ఎలా, ఎక్కడ లభిస్తుందని ఆలోచించుకొని రేపు మన పట్టణమునగల రామాలయమునుకు వెళ్ళి ప్రయత్నం చేస్తాం. ఎవడైనా భక్తుడు దొరకగలడని నిర్ణయించుకొనిరి.

రాజదంపతుల మధ్య ఈ సంభాషణ యంతయు రాత్రి 12 గంటల సమయములో జరుగుచుండగ దొంగతనమునకై సరిగ అదే సమయమునకు ఏతెంచిన దొంగ ఈ సమాచారము విని దొంగత నము ఎంత చేయగలను? ఎంత చేసినా తక్కువేగదా? రాజునకు అల్లుడనైతే అంతా వాదేగదా అని ఆలోచించి వచ్చిన పని వదలి మరుసటి రోజు ఒక పరమ భక్తుని వేషముతో రామాలయమునందు ఒక మూల కూర్చొని ధ్యానము చేయుచుండెను. మరుసటి రోజు

పరమ భక్తుడైన అల్లుని నిర్ణయించుకొనుటకు రామాలయమునకు మారువేషములతో రాజు రాణి వెళ్ళిరి.

అచట ఈ కపట భక్తుడు వారి కంటబడెను. చాలాసేపు రాజు రాణి వాని వాలకం చూచిరి. నిజమైన భక్తుడుగనే అతడు వారికి తోచెను.

రాజు రాణి అతనిని సమీపించి వినయముగ "ఏమండీ! మీ భక్తి శ్రద్ధలను చూచి మాకు పరమానందమైనది. మా కుమార్తెను నీకు ఇచ్చి వివాహము చేసి అల్లునిగ స్వీకరించాలని మా సంకల్పము. తమరు అంగీకరించుడని" వేడుకొనిరి. అప్పుడు ఆ కపట సాధువుకు కనువిప్పు కలుగగా అతడిట్లు ఆలోచించసాగెను. "ఆహా! కపట భక్తిలోనే ఇంత సుఖము, ఆనందము, గౌరవము లభించుచుండగ అసలు నిజమైన భక్తి నాలో వుంటే, ఇంకా ఎంత గొప్ప స్థితి కలుగగలదు? ఇట్లా ఆలోచించి ఆ దొంగ అసలు విషయాన్ని రాజు, రాణి గారికి వివరించి నా తప్పు క్షమించమని వేడుకొని తదుపరి ఆ దొంగ నిజమైన భక్తి శ్రద్ధలు గలిగి భగవంతుని ఆరాధించి, ధ్యానించి తాను తరించి ఇతరులకు తరణోపాయమును చూపి ధన్యుడయ్యెను.

కాబట్టి దైవభక్తి ఉండినచో ఇక అన్ని సంపదలు ఉన్నట్లే, అట్టి అనన్య భక్తికై సర్వులును ప్రయత్నించుదురు గాక!

# 24) మానవా! దుర్గుణములు మానవా?!

మానవుడా! ఎన్ని జన్మలు గడిచినవి? ఎందఱు తల్లుల పాలు నీవు త్రాగితివి. మల మూత్రముల కొంపలో, గర్భ నరకములో ఎన్నిసార్లు కాపురముంటివి? దాని నుండి తప్పించుకొనవలెనను అభిలాష ఇంకను నీకు కలుగలేదా? బంధనమే నీకు రుచించు చున్నదా? ఇప్పటికైనను తెలివి తెచ్చుకొనుము. ఈ నీ దీర్ఘ ప్రయాణమును విరమించి హాయిగా విశ్రమించుము, త్వరితముగ గురుసన్నిధికి బోయి జన్మరాహిత్యమునకై మార్గమును వెతకుము.

ఈ జనన మరణ రూప సంసార బాధలన్నిటికీ కారణము అపవిత్రమైన మనస్సు. మనస్సునందు బహుజన్మార్జిత దుర్గుణ ములు, దుర్వాసనలు, అశుభ సంస్కారములు ఉండును. వాటన్నిటిని ప్రయత్న పూర్వకముగ సద్వాసనలచే, సద్గుణములచే బయటకు గెంటి వేయవలెను. అట్లు చేయనిచో, ఈ సంసృతి, ఈ బాధ, ఇంకను బహుకాలము కొనసాగుచునే యుండును. అట్లు బాధను అను భవించుచు జీవితమును భారభూతముగ చేసికొనుట విజ్ఞులకు పాడి కాదు. కాబట్టి అన్ని అనుకూలములు, సదుపాయములు కలిగియున్న ఈ మానవ జీవితమందే హృదయ పవిత్రతను అల వాటు చేసికొనవలెను. ప్రతిదినము, జపధ్యాన పారాయణాదులు పూర్తి అయిన వెనుక కొంతసేపు నిశ్చలముగ రూ కూర్చుండి ఆత్మపరిశోధన చేయవలెను. మనస్సునందు ఏయే దుర్గుణములను చీడ పురుగులు చేరినవి? వాటిని ఎట్లు హృదయక్షేత్రము నుండి తొలగించవలెను? దుర్వాసననలు అను కలుపు మొక్కలను ఏ ప్రకారము పెకలించివేయవలెను? - మున్నగు విషయములను గూర్చి దీర్ఘముగ ఆలోచించి ఆ సాధన కార్యక్రమమునంతను

చక్కగ అమలు పఱచుకొనవలెను. ప్రతిదినము కొంత అభ్యాసము చేయవలెను.

ఈ ప్రకారముగ బహుకాలము గొప్ప ప్రయత్నమాచరించిననే కాని మనస్సు దారికి రాదు. ఇంద్రియములు లొంగవు. చెడ్డ గుణములు తోకముడువవు. కాబట్టి సాధకుడు ధైర్యమును చేబట్టి నిర్భయత్వమను డాలును, వైరాగ్యమను కవచమును, ఆత్మజ్ఞాన మను ఖడ్గమును ధరించి జీవిత సంగ్రామమున మహోత్సాహ ముగ పాల్గొని దుర్గుణములను శత్రువులను దూరముగ తరిమికొట్టి హృదయమును నిష్కంటకముగ, శత్రురహితముగ గావించవలెను. మానవుడా! ఇప్పటికే చాల విలంబనము జరిగినది. ఎన్ని జన్మలో పాడైనవి. ఇక మీదటచ ఒక్క క్షణమైనను వృథా చేయగూడదు. ఈ జన్మయందే కడతేరుటకు అహర్నిశములు తీవ్ర ప్రయత్నమాచ రించవలెను. మానవుడా! చెప్పినది అర్థమయినదా? ఇప్పటికైనను దుర్గుణములను మానుము. సద్గుణములు చేబట్టుము. సత్పురుషు లను ఆశ్రయించుము. సత్కార్యములను ఆచరింపుము. భగవంతుని భక్తితో భజింపుము. జీవితమును సార్థకము చేసికొనుము.

# 25) దేవా! తమరి పరిశీలనకై ఎన్ని అర్జీలు!

(ఒక భక్తుని భావపరంపర)

జగన్నాటక సూత్రధారీ! దేవాధిదేవా! విశ్వప్రభుత్వ అధినేతా! సర్వధీసాక్షిభూతా! శ్రీనివాసా! సంకటహరణా! వేంకటరమణా! గోవిందా! తిరుమలవాసా! ఆపదమొక్కులవాడా! తమకు ఎన్ని అప్లికేషన్లు! ఎన్ని అర్జీలు! ఎన్ని మెమొరాండాలు! సంవత్సరము పొడవునా వచ్చుచుండును గదా! కడుపు నిండాలని కొందరు, కడుపు కొట్టాలని కొందరు, కలిసి రావాలని కొందరు, కలసి రాకూడదని కొందరు, వాన రావాలని కొందరు, వాన రాకూడదని కొందరు, పంట పండాలని కొందరు, పంట ఎండాలని కొందరు, గెలవాలని కొందరు, గెలవకూడదని కొందరు, మంత్రి కావాలని కొదరు, కాకూడదని కొందరు, మనశ్శాంతి కావాలని కొందరు, మనోబలం కావాలని కొందరు, ఉన్నది నిలవాలని కొందరు, లేనిది రావాలని కొందరు, ఆకలిగా ఉన్నదని కొందరు, పైకెగబాకాలని కొందరు, లేనిది రావాలని కొందరు, తిన్నది అరగలేదని కొందరు, ఆరోగ్యము లేదని కొందరు, ఆనందము కావాలని కొందరు, భోగభాగ్యాలు కావాలని కొందరు, పుత్రులు కావాలని కొందరు, పుత్రికలు కావాలని కొందరు, మంచి కోడళ్ళు కావాలని కొందరు, మంచి అల్లుళ్ళు కావాలని కొందరు, బ్రతకాలని కొందరు, చావాలని కొందరు- ఇంతమంది ద్వారా, ఇంకను కోటాను కోట్లమంది ఎన్నో అప్లికేషన్లు తమకు అందుచున్నవి గదా!

వీటన్నిటిని తమరు ఎపుడు పరిశీలిస్తారు! పరిశోధిస్తారు! పరీక్షిస్తారు! ఫలితాలు ఇస్తారు! ఇవన్నీ ఒకసారి ఊహించినచో మాకు ఆశ్చర్యము కలుగుచున్నది. ప్రాణికోట్ల యొక్క ఈ కేసులు అన్నిటిని తమరు తృటిలో పరిష్కరించి వేయుచున్నారు. అట్టి తమ

అపూర్వ దివ్యశక్తికి మా అనంతకోటి జోహారులు. "ప్రాణికోట్ల యొక్క ఇన్ని కేసులు పరిష్కరించవలసి వచ్చుచున్నది గదా, తమకు విశ్రాంతి ఎచట!" అని కొందరు తలంచవచ్చును. ఇన్ని కార్యక్రమములు జరుపుచున్నను తమరు శాంత స్వరూపులే అయియున్నారు. (శాంతాకారం భుజగశయనం...). తమరు సాక్షీభూతులు. తమ సాన్నిధ్యమున అన్ని పనులు సవ్యముగ, ప్రశాంతముగా జరిగిపోవు చున్నవి. తమరు రూపొందించిన విశ్వశాసనము తన పనిని తాను నెరవేర్చుకొని పోవుచున్నది. పాపముచే దుఃఖము, పుణ్యముచే సుఖము, జ్ఞానముచే మోక్షము - అనునదియే ఆ శాసనము. ఆ శాసనము ప్రకారము ఎవరు చేసిన కర్మయొక్క ఫలమును వారు అనుభవించుచున్నారు.

ధర్మోరక్షతి రక్షితః - ధర్మాన్ని ఆచరిస్తే అది మనలను రక్షిస్తుందని తెలిసి కూడా ఎంతమంది దానిని ఆచరించ గలుగుతున్నారు దేవా! ఎవరి కర్మకు వారు నమస్కరించుకొని సత్కర్మలు, సదాచారములు చేసి ధన్యులు కావలసిందే. ఎవరి ఉద్ధారము వారే పొందాలని విదితమగుచున్నది స్వామీ! అలా ఉన్నతి పొందుటకు మాకు వలసిన శక్తి భక్తి ప్రసాదించమని మనసా శిరసా కోరుకొనుచున్నాను దేవా!

తమకు దాసోఽహం,దాసోఽహం, దాసోఽహం,

# 26) రాగమే రోగము

రాగమే - రోగము

అనురాగమే (Attachment) - అంటువ్యాధి

రాగము, - అనురాగము,

అహం, మమతలు - అను అంటువ్యాధినుండి విముక్తికై పరితపించువాడు ధన్యుడు.

రోగి వైద్యుని కొరకు పరితపించినను సరియైన వైద్యుడు దొరకుట రోగి యొక్క అదృష్టము.

అట్లే అహం - మమతలు అను అంటువ్యాధి నుండి విముక్తి పొందుటకు సద్గురువు అను చక్కని గురువు అను వైద్యుడు లభించుట భక్తుని అదృష్టము.

గురువులు దొరకవచ్చునుకాని సద్గురువులు లభించుట దుర్లభము. కావున సద్గురువు అను డాక్టరును ఆశ్రయించి వారిచే చికిత్స బడసిన భవరోగము బాధించదు.

వ్యాధిలేదని వాదించువారు ఒక విషయమును గమనించాలి.

పుట్టినారా? లేదా?

పుట్టుట అనునదియే వ్యాధి

ఈ వ్యాధి బారినుండి విముక్తి పొందుటకు, సద్గురువులను ఆశ్రయించుట, సచ్ఛాస్త్రములను చదువుట, జపధ్యానాదులను చేయుట, పరోపకార కార్యములను తలపెట్టుట, దానధర్మాదులను శక్తివంచటన లేకుండ ఆచరించుట మొదలగు మార్గములను అవలంబించుటయే చక్కని మార్గముగా మహర్షులు సెలవిచ్చిరి. కావున వివేకవంతుడు మహర్షుల యొక్క సూచనలను తు.చ. తప్పక ఆచరించి జీవితమును సార్థకము చేసుకొనవలెను.

# 7) మిత్రమా! ఎందుకు బాధపడుచున్నావు?

వ్యాపారములో నష్టమొచ్చిందనా?

కోట్లు సంపాదించలేదనా?

నీవు అనుకున్నది జరగలేదనా ?

సంతానము లేదనా? ఉన్న సంతానము గతించినదనియా?

ఉండి కూడ నీ సంతానము నీవు చెప్పినట్లు వినలేదనియా?

పెక్కు అంతస్థుల మేడ కట్టలేదనా? A.C. (ఎ.సి.) రూము లేదనియా? కారు లేదనియా? నిన్ను గౌరవించువారు లేరనియా? అధికారము లేదనియా? ఒక్క నిముషము ఒక్క విషయాన్ని గురించి ఆలోచించు మిత్రమా!

రాత్రి నిద్రలో హాయిగా, ఆనందంగా గడిపావుగదా?

అట్టి అపరిమితానందము ఏ వస్తువువలన గలిగినది? ఏమి తింటే గలిగింది? ఏమి చూస్తే గలిగింది? ఏమి తినలేదు, ఏమి చూడలేదు, సమస్తము మరిచావుగదా?

అలా సమస్తము మరచినప్పుడు గలిగిన హాయి, ఆనందము, సుఖము, సంతోషము ఎల్లప్పుడు అనుభవించాలని నీకు వున్నచో అన్నిటిని వదలి అడవులకు పారిపోనవసరము లేదు. తామరాకు నీటిని వదలి పారిపోదు. నీటిలో వుంటూ నీరును అంటుకోదు. అలాగే నీవు కూడా సంసారములో వుండినను అంటుకోకు, తగులుకోకు, అప్పుడు అపరిమిత ఆనందం నీ వశమగును. అదియే ఆత్మానందము. ఇట్టి ఆనందమే స్థిరమైనది. శాశ్వతమైనది.

అట్టి ఆనందము కొరకే అందరూ పాటుపడుచుందురు.

భగవదనుగ్రహము, గురు ఆశీర్వాదము , స్వప్రయత్నముంతో ఇట్టి శాశ్వతానందమును అందరూ బడయవచ్చును.

# 28) ధన్యవాదాలు (Thanks)

మనము నిత్యము ధన్యవాదాలు (Thanks) అంటాము, వింటాము, మంచి నీళ్ళిస్తే ధన్యవాదాలు అంటాము. మరి మంచినీళ్ళను సృష్టించిన వారికి ధన్యవాదాలు చెప్పమంటే సంకోచిస్తూ సంశయించువారు లేకపోలేదు. భగవంతుడు ఎంత మహోపకారం చేస్తున్నాడో ఒక్క నిముషము ఆలోచిద్దాం.

శరీరము నిలవాలంటే ఆహారముకన్న ముఖ్యమైంది ఒకటుంది. ఆహారము లేకుండా కొన్ని రోజులు నడవవచ్చు. గాలి పీల్చకుండా రెండు నిమిషాలు ఈ శరీరయంత్రాన్ని పనిచేయించలేము. అది శవమైపోతుంది. అంతటి విలువైన, ముఖ్యమైన, ముఖ్యాతి ముఖ్యమైన గాలికొరకు ఇతరుల దయాదాక్షిణ్యాంపై ఆధారపడవలసివస్తే మానవునిగతి ఏమౌతుందో ఒక్క నిమిషము ఆలోచిస్తే ఒళ్ళు జలదరిస్తుంది.

బస్సు సమయానికి రాకపోతే ప్రయాణం రద్దు చేసుకుంటాము. రేపటికి వాయిదా వేస్తాం. ఎండ లేకపోతే తడిసిన గుడ్డలు రేపు ఆరేస్తాం. సమయానికి అన్నం లేకపోతే ఒక్క రోజుకు ఫరవాలేదు అని సర్దుకుంటాము.కాని ఒక్క నిమిషం గాలి లేకపోతే సర్దుకోగలమా?! అప్పుడు ఈ ప్రపంచం ఏమవుతుంది? ప్రాణులు ఏమవుతారు? .

ఏ బిల్లు చెల్లించవలసిన అవసరం లేకుండ, కష్టపడి సంపాదించవలసిన అవసరం లేకుండ, కాలు కదపకుండా, వున్న చోటునుండి మరో చోటికి వెతుకుతూ పోవవసరం లేకుండ మనం ఎక్కడ ఏ చోట ఏ ప్రదేశంలో వుండే ఆ ప్రదేశానికి ఆ గాలిని మ

వెంట మన ఇంట మన చెంతనే వుండునట్లు చేసిన పరమదయామయుడైన పరంధామునికి ఆస్తిక నాస్తిక అనే తారతమ్యం లేకుండా అందరం ధన్యవాదాలు చెప్పుకుందాం. అలా చెప్పనివాడు కృతఘ్నుడు. అనగా చేసిన మేలు మరచిన అపరాధి. అట్టి అపరాధి జనన మరణ కాలచక్రంలో పడి అలా గిరిగిరా తిరగవలసిందే. అలాంటి పరిస్థితి రాకముందే జాగ్రత్తపడి సృష్టి కర్తకు ధన్యవాదాలు అర్పించి, వారు బోధించిన ధర్మాన్ని పాటించి అనుష్ఠించి ఆచరించి తద్వారా వారి అనుగ్రహ ఆశీర్వాదాన్ని పొంది ఈ జన్మను చివరి జన్మగ చేసుకొనుటకు ప్రయత్నిస్తాం.

జయ్ శ్రీరామ - వాసుదేవ!

# 29) దేవుడు గమనిస్తున్నాడు

జపాలు, ధ్యానాలు, పూజలు, యాత్రలు, అభిషేకాలు, అర్చనలు, గీతాపారాయణలు, స్తోత్రములు, దండకాలు, భజనలు చేస్తున్నవారిని **అత్యంత జాగరూకతతో గమనిస్తున్నాడు. భగవంతుడు-** నేను చెప్పినది చేస్తున్నారా? లేక గ్రామఫోన్ రికార్డువలె రొటీన్‌గా కాలాన్ని వెళ్ళబుచ్చుచున్నారా? అని. భూతదయలేని పూజలు గొప్ప ఫలితాలు ఇవ్వవని భగవంతుడు అనేకచోట్ల చెప్పియున్నాడు. రోగపీడితుని జబ్బు పోవాలంటే రోగికి మందుయొక్క వర్ణన, దాని గొప్పతనాన్ని గూర్చి అరగంట ఉపన్యాసం దంచినా వాని జబ్బు నయంకాదు.

అలాగే ఆకలి గొన్నవానికి ఆకలి తీరాలంటే అన్నం పెట్టాలి. అన్నం కూరలు, లడ్డు, పాయసం మొదలగువాటియొక్క గొప్పతనాన్ని గురించి ఎన్ని గంటలు వర్ణించినా ఆకలితీరదు గదా! అలాగే దేవుడు చెప్పిన సత్య, ధర్మాలను పాటించాలి, అమలుపరచాలి, ఆచరించాలి, అంతేకాని వర్ణనలతో, స్తోత్రాలతో సరిపెట్టరాదు. అలా దేవుని మహిమలు సంవత్సరాలు వర్ణించిన ఫలితం తక్కువే! దేవునికి ప్రీతికరమైన పనులను చేసి, దేవుని ఆజ్ఞను పాటించిన అప్పుడే పూర్ణఫలితం లభించగలదు.

భక్తులమని మనము అనుకున్నంత మాత్రమున ప్రయోజనము లేదు. భగవంతుడు అనుకోవాలి 'వీడు నా భక్తుడని' అప్పుడే

మన జన్మ సార్థకము. పుట్టినందుకు ఫలితము, దోషాలు, అకృత్యాలు, అన్యాయాలు, అధర్మాలు చేస్తూ దేవుడు గమనించలేదు గదా అని భావించరాదు. దేవుడు గుడియందున్నాడని అక్కడ మాత్రం జాగ్రత్తగ వుంటే చాలునని భ్రమపడరాదు. ప్రతి జీవి యొక్క హృదయమందు సాక్షిగ, సర్వసాక్షిగ గమనిస్తున్నాడు. కావున ధర్మమార్గములో, న్యాయమార్గములో పయనిస్తూ జప ధ్యానాది కార్యాలను ఆచరిస్తూ ముందుకు సాగిపోదాం! తద్వారా జన్మరాహిత్యాన్ని పొందుదాం.

# 30) గురుశిష్య సంవాదము

శిష్యుడు - మోక్షమునకు మొదటి మెట్టు ఏది స్వామీ?

గురువు - నిర్మలమైన మనస్సే.

శిష్యుడు - గురుదేవా? అన్ని వేగములకన్నా అమిత వేగముకలది ఏదో సెలవిస్తారా?

గురువు - మనోవేగము.

శిష్యుడు - భగవంతునికి ఇష్టమైన నిలయము ఏదియో చెప్తారా?

గురువు - దయగల హృదయమే.

శిష్యుడు - మానవులను ఎన్ని తరగతులుగ విభజించవచ్చును స్వామీ?

గురువు - నాలుగు తరగతులుగా విభజించవచ్చును.

శిష్యుడు - అట్టి నాలుగు తరగతుల వారిని వివరిస్తారా గురువర్యా?

గురువు - ఉత్తములు మంచిపని ప్రారంభించుట

స్వభావము దానిని పూర్తిచేయువరకు విశ్రమించకుండుట.

మధ్యములు మంచిపని ప్రారంభించినను

స్వభావము ఆటంకములకు జడిసి మధ్యలోనే విరమించుట.

అధములు మంచిపనిని కలలోనైనా

స్వభావము ఊహించకుండుట

అధమాధములు మంచిపని చేయువారికి విఘ్నములు కలి గించుటకు

విశ్వయత్నములు చేయుట.

శిష్యుడు - అన్నిటికంటె సులభమైన పని సెలవిస్తారా?

గురువు - ఇతరుల తప్పులను వెతుకుట.

శిష్యుడు - అన్నిటికంటె కష్టమైన పని ఏది స్వామి?

గురువు - అన్ని పనులు విరమించి నిశ్చలముగా మనస్సును వుంచి నిర్మలముగా కూర్చొనుట.

అయితే అభ్యాసవశమున ఈ పనిని సాధించవచ్చు.

శిష్యుడు - మతమనగానేమి స్వామి?

గురువు - మతిని శుద్ధము చేయునదే మతము.

శిష్యుడు - కోపమును జయించు మార్గములను సెలవిస్తారా?

గురువు - త్రిసూత్రములను పాటించాలి.

శిష్యుడు - అట్టి త్రిసూత్రములను గూర్చి వివరించ ప్రార్థన.

గురువు - కోపము వచ్చినపుడు - పాటించవలసిన త్రిసూత్రములు.

1) అద్దము చూచుకొనుట, 2) నవ్వుట, 3) పాట పాడుట.

శిష్యుడు - ఎవరైనా చనిపోయినచో కలుగుబాధ నుండి విముక్తి చెందుటకు మార్గము సెలవిస్తారా?

గురువు - చనిపోయినందులకు బాధ కలుగదు. ప్రక్కింటి వారు చనిపోవుట చూస్తున్నారుకదా! దినపత్రికలో రోజూ వందలాదిమంది చనిపోయిన వార్తలను చదువుచున్నారుగదా ! ఎవరైనా బాధపడుచున్నారా? లేదు దీనినిబట్టి చావులో బాధలేదు. "నా వారు" అనే పదములో బాధంతా ఇమిడియున్నది. కావున 'నా' అనే పదము నుండి దూరమైపోయినచో బాధలు లేవు- బాధ్యతలు లేవు.

# 31) మంచి దారి చూచుకొందాం !

రంగనాథం గారు మహాపండితులు. అనర్గళంగా అహర్నిశములు ఉపన్యసించగల దిట్ట. రోజూ ఒక దేవాలయంలో పురాణం చెప్పేడివారు. అందరు శ్రద్ధతో వినెడివారు. ఒకరోజు ఒక క్రొత్త భక్తుడు వచ్చాడు. ఉపన్యాసం జోరుగా సాగిపోతోంది. ఈ కొత్త భక్తుడు మధ్యలో లేచి, నమస్కరించి, "పండితోత్తమా! మిమ్ము చూస్తున్నా, మీ అమృతధారవంటి ఉపన్యాసాన్ని వింటున్నా నా హృదయం ద్రవించిపోతుంది. మీలాగే సర్వసంగపరిత్యాగిగా మారాలని ఉంది. మీరు అన్నీ వదలినవారివలే వున్నారు. నాకు దారి చూపించండి మహాప్రభో!" అని వేడుకొన్నాడు. అందుకు పండితుని సమాధానం ఈ విధంగా సాగిపోయింది.

"నేను మహాజ్ఞానిని, గొప్ప పండితుడను, సకల శాస్త్రాలు పరిశీలించి పఠించాను. అన్ని శాస్త్రాలు నాకు తెలుసు. మహామహు లుచేత సన్మానాలు, మణికంఠహారాలు పొందాను. కవిసార్వభౌమ, విశ్వవిఖ్యాత మొదలగుగాగల బిరుదు సంపాదించాను-" అని తన గొప్పతనాన్ని అరగంటకు తక్కువ లేకుండ ఘన ఘనా ఘంటారావంగా చెప్పి ముగించారు - పండితోత్తముడు.

ఈ విధంగా తన సొంతడబ్బా మోగించుకొంటూ గ్యాస్‌కొట్టె డివారిని గురించి కఠోపనిషత్ ఇలా వివరించింది-

అవిద్యాయా మంతరే వర్తమానాః
స్వయంధీరాః పండితం మన్య మానాః
దంద్రమ్యే మానాః పరియన్తి మూఢాః
అంధేనైవ నీయమానాయథాంధాః

ఏది అవసరమో దానిని తెలుసుకోకుండా, ఏది చేయవలయునో దానిని చేయకుండా, దేనిని పొందిన మనశ్శాంతి చేకూరునో దానిని పొందకుండా, గ్రుడ్డివానికి మరో గ్రుడ్డివాడు దారి చూపిన ఇద్దరూ గోతిలో పడుట ఎంత యథార్థమో-మాకంతా తెలుసు, మేం చేసేదే రైటు, మేం చెప్పిందే వేదము, అని విర్రవీగేవారి స్థితి కూడా అంతేనని యమధర్మరాజు నచికేతునికి వివరించాడు.

సత్యవిషయము, తెలుకుకోకుండా మహిషాసుర, రావణాసుర, నరకాసుర, కంస, శిశుపాల, దుర్యోధన, దుశ్శాసనాదులు, తమ తమ ధన, కీర్తి, ఐశ్వర్యాదులను చూచి మురిసిపోయి, విర్రవీగి వికాసాన్ని కోల్పోయి అధోగతి పొందిన విషయాన్ని ఒకసారి గుర్తుచేసుకొన్నచో, వారంతా దారి తప్పిన వారిగ గమనిస్తే విజ్ఞుడు మంచిదాని కొరకై ప్రయత్నిస్తాడు. బుద్ధిమంతుడు ప్రహ్లాద, నారద, పరాశర, అంబరీష, శుక, అన్నమాచార్య, త్యాగరాజ మొదలగు భక్తాగ్రేశ్వరులను ఆదర్శంగా స్వీకరిస్తారు. తద్వారా శాంతిశుఖాలు పొందుతాడు.

మనమంతా ఆ త్రోవలోనే పయనిస్తాం.

# 32) వెంటవచ్చు ధనము

సుబ్బయ్య చాలా చురుకైనవాడు, తెలివిగలవాడు, తన బుద్ధిబలముచే కోట్లాది రూపాయలు సంపాదించగలిగాడు. అతనికి ఒకే ఒక పుత్రసంతానము. కొడుకును బాగా చదివించాడు. వ్యాపారసరళి నేర్పించాడు. తండ్రికి కాస్త దైవభక్తి గలదు. ఆ ఊరికి ఒక స్వామివారు వచ్చారు. అందరూ వెళ్లారు. అందరితో పాటు ఈయన కూడా వెళ్ళాడు.

ఆ స్వామివారి ఉపన్యాసం ఇలా సాగింది– "లక్షలు సంపాదించిన ఓ లక్షాధికారులారా! ఆ లక్షలు సంపాదించుటకు మీరు పడిన శ్రమ, కష్టమును ఒక్కసారి గుర్తు చేసుకొనండి. ఇంత శ్రమపడి సంపాదించిన డబ్బు మీదేగదా! ఆ డబ్బుపైన మీకు సర్వాధికారాలు వున్నవి గదా! చనిపోయి పరలోకానికి వెళ్ళునపుడు ఈ డబ్బును అక్కడ ఉపయోగించుకొనుటకు ఏర్పాటు చేస్తాను.

మీ యావదాస్తిని పరలోకానికి తీసికొని వెళ్ళుటకు, ముందు మీ సుపుత్రులను పర్మిషన్ (అనుమతి) అడిగి చూడండి" అన్నారు స్వామి.

ఈ లక్షాధికారి ఆత్రుతతో ఇంటికెళ్ళి పుత్రునితో ఇలా అన్నాడు– "ఈ డబ్బు నాది, ఈ సంపాదన, నాది డబ్బు నా ఇష్టము వచ్చినట్లు వాడుకుంటాను. నేను పరలోకానికి తీసుకెళ్తాను" అనగానే పుత్రుడు మండిపడ్డాడు. పండ్లు పటపట కొరికాడు. ఒక్క పైసా నీకివ్వను. తాకటానికి వీలులేదు అని ఎదురుతిరుగుటయేకాక అప్పటినుండి తండ్రిని హింసించుట ప్రారంభించాడు.

చూశారా! జనులు కష్టపడి సంపాదించిన ధన

రాసులను ఇక్కడి వారికి ఇచ్చి వచ్చిచేతులతో పర-
లోకానికి వెళ్ళుచున్నారు. కాబట్టే శ్మశానము వరకైనా
వస్తున్నారు. ఉన్నదంతా పట్టుకెళ్తామంటే ఒక్కడు శ్మశా-
నానికి రాడు. పైపెచ్చు ద్వేషిస్తూ, దూషిస్తూ నానాబాధలు,
హింసలు పెట్టెదరు. వ్యక్తుల యొక్క స్వభావం తెలుసుకొని జీవిత
మును పరమార్థచింతనకే అంకితముచేసి పరమశాంతిని పొందుటకు
ప్రయత్నించువాడే ధన్యుడు.

పుణ్యమనే ధనమును పరలోకానికి తీసుకెళ్ళుటకు ఏ ఒక్కరి
పర్మిషన అవసరములేదు. కావున అద్దానిని సాధించుటకై శక్తివంచన
లేకుండా ధర్మకార్యములు ఆచరించి పరప్రాణికి ఉపకారము చేసి
దైవము యెడల భక్తికలిగి తద్వారా పుణ్యధనాన్ని సేకరిద్దాం. అదియే
జీవుని వెంటవచ్చు ధనము. అట్టి ధనమే అందరికి శ్రీరామరక్ష!

# 33) ఆకాశ వింతలు

1) ప్రతినక్షత్రము ఒక సూర్యునివంటిది.

2) మనకు చాల సమీపములో ఉన్న నక్షత్రమునే మనము సూర్యుడు అనుచున్నాము.

3) మనకు సూర్యునికి మధ్య దూరము 9 కోట్ల మైళ్ళు.

4) సూర్యునివద్ద దాదాపు **80**వేల మైళ్ళు ఎత్తుగల మంటలు భగభగ లేచుచుండును.

5) సూర్యుని మంటలవేగము గంటకు 3 లక్షలమైళ్ళు.

6) సూర్యునిలోని వేడివలన 35 వేల టన్నుల నీటిని ఒక నిమిషానికి సలసల కాచవచ్చును.

7) సూర్యుని మించిన వైశాల్యము గల నక్షత్రములు సుదూరములో కోటానుకోట్లు కలవు.

8) మనకు సమీపమున వున్న నక్షత్రం ఎన్నియో కోట్లమైళ్ళు దూరములో వున్నది.

9) ప్రతినక్షత్రము అమితమైన వేడిని పంపుచున్నది వాటి దూరము లెక్కింపనలవిగానంత సుదూరమగుటచే వాటివేడి మనకు తగులుటలేదు.

10) "అల్ఫాసెంటోరి" అన్న పేరుగల నక్షత్రం సూర్యుని తరువాత మనకు దగ్గరగా వున్న నక్షత్రము. దీని దూరము $4\frac{1}{2}$ కాంతి సంవత్సరములు.

11) కాంతి వేగము సెకనుకు (అనగా కన్నుమూసి తెరచులోపల) 18,6000 మైళ్ళు.

12) ఒక సుదూర నక్షత్రం నుండి మనకు వెలుతురు రావా

లంటే సెకనుకు 18,6000 మైళ్ళ చొప్పున కాంతివేగముతో బయలుదేరినను అనేక సంవత్సరములు పట్టును.

13) కొన్ని నక్షత్రాలు ఇరవైరెండువైల కాంతి సంవత్సరముల దూరములో కూడ ఉన్నవి.

14) మన సూర్యునికాంతి ఐదు(5) రంగులలో ఉన్నది - అవి 1. ఎరుపు 2. ఆకుపచ్చ 3. పసుపు 4. గులాబి 5. నీలం.

15) గ్రహములతోబాటు కొన్ని తోకచుక్కలు కూడ సూర్యునిచుట్టూ తిరుగుచున్నవి. 'హేలీ' అను తోకచుక్క సూర్యుని ఒకసారి ప్రదక్షిణము చేయుటకు 76 సంవత్సరములు పడుతుంందట అది 1910 లో కనబడినది. మరల 1986లో కనబడినది.

16) ఆకాశములో సూర్యునితోపాటు అనేక నక్షత్రాలు, తోక చుక్కలు, గ్రహాలు, చంద్రుళ్ళు, ఉల్కలు వున్నవి.

# 34) శరీర యంత్రము

ఈ కలియుగమున విజ్ఞానశాస్త్ర ప్రవీణులు అనేక వినూతన యంత్రములను కనుగొనుచున్నారు. కనుకనే ఈ యుగమునకు యంత్రయుగమని పేరు వచ్చినది. అయితే విజ్ఞాన శాస్త్రమునకు అంతుచిక్కని ఒక యంత్రము కలదు. ఆ యంత్రము లేనిచో తక్కిన యంత్రముల యొక్క ఉనికియే సంభవించదు. ప్రస్తుతము ఆవిష్కరింపబడు యంత్రములన్నియు ఏ యంత్రముయొక్క సహాయముచే తయారుచేయబడుచున్నవో తెలిసికొనుట అవసరము. శరీరమను యంత్రమే ఈ యంత్రము లన్నిటిని తయారు చేయుచున్నది. అద్దానిని తెలిసికొనినచో దైవశక్తి చక్కగ అవగాహనము కాగలదు. మరియు సృష్టికర్తయెడల భక్తిభావన పెంపొందగలదు.

పారిశ్రామిక వేత్తలు కర్మాగారములను నెలకొల్పి, అందులో సైంటిస్టులను, ఇంజనీరులను నియమించి ఏవిధముగ యంత్రములను నిర్మించుచున్నారో అట్లే బ్రహ్మదేవుడను గొప్ప పారిశ్రామికవేత్త విశ్వము అను కర్మాగారమున పృధివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములచే శరీరమను యంత్రమును తయారుచేసెను. ఆ పంచభూతాత్మకమగు సామాగ్రిచే చతురాననుడు కోటానుకోట్ల రకముల జీవరాసులు అను చిత్ర విచిత్రములైన యంత్రములను తయారు చేయుచున్నాడు. కాని వానియన్నింటిలో ఉత్కృష్టమైనదియును, అత్యంత విలువగలదియును, పలువిధములగు శక్తి స్తోమతలు కలిగినదియును, ఇతర యంత్రములను సృష్టింపగల ప్రజ్ఞానైపుణ్యము, శక్తిగలిగినట్టిదియునగు ఉత్తమోత్తమమైన ఒక యంత్రమును బ్రహ్మదేవుడు తన యావచ్ఛక్తిని ఉపయోగించి తయారు చేసియున్నాడు. అదియే మానవశరీరము.

అట్టి మానవశరీర యంత్రముయొక్క విశిష్టత యెట్టిదో భాగవతకారుడు ఈ క్రింది విధముగా స్పష్టీకరించియున్నాడు.

సృష్ట్వా పురాణి వివిధాన్యజ ఆత్మశక్త్యా
వృక్షాన్సరీసృప పశూన్ ఖగదంశ మత్స్యాన్
తైస్తైరతుష్టహృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోక ధిషణం ముదమాప దేవః

(భాగవతము)

బ్రహ్మదేవుడు చీమ, దోమ, గోవు, పక్షులు మొదలుగాగల లక్షలకొలది ప్రాణికోట్లను సృష్టించినప్పటికిని శాంతిని బడయక, తృప్తిని బొందక, ఏదియో కొరతగ నుండుటచే సుదీర్ఘముగ ఆలోచించి చిట్టచివరకు మానవశరీరమును తయారుచేసి పరమ సంతుష్టిని బొందెనట కారణమేమనగా ఆ మానవశరీరము దైవసాక్షాత్కారమునకు, జన్మరాహిత్యమునకు వలసిన పటుతర శక్తిసామర్థ్యములూ కలిగియున్నది.

ఇట్టి మానవశరీరయంత్రమునందు జరుగు కార్యములు అత్యంత ఆశ్చర్యజనకములై యున్నవి. ఈ యంత్రము విశాల ప్రపంచసృష్టిని సూక్ష్మరూపములో చూపుచున్నది. ఈ యంత్రమున ప్రదర్శితమైన సూక్ష్మాతిసూక్ష్మ విషయములు మానవుడు నిర్మించిన ఏ ఇతరములగు యంత్రములలోను కానరావు. ఈ శరీర యంత్రమును గూర్చి విపులముగా తెలిసికొనినచో సృష్టికర్తయొక్క అపార శక్తిసామర్థ్యములు, నైపుణ్యము విశదము కాగలదు. మానవునియొక్క మనస్సును ఫోటో తీయు సాధనమును ఇంతవరకెవ్వరును కనిపెట్టియుండలేదు. యోగులు, ఋషీశ్వరులు, మునులు మనస్సుయొక్క సూక్ష్మతర శక్తులను

చక్కగ గ్రహించియున్నారు. ఈ శరీరయంత్రము ఎంతకాలము పనిచేయును, ఎప్పుడు ఆగిపోవును అను విషయమును గూర్చి ఇదమిత్థముగ ఎవరును చెప్పజాలకున్నారు.

ఈ శరీరయంత్రముయొక్క పుట్టుపూర్వోత్తరము లన్నియు, దీనిని గూర్చిన రహస్యములన్నియు తెలిసినవారు ఈ ప్రపంచమున ఒక్కరు మాత్రమే కలరు వారే యంత్ర నిర్మాతయగు పరమాత్మ.

ఈ శరీరరూప యంత్రమునందు మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములను షట్చక్రములు నెలకొల్పబడియున్నవి. బొడ్డు క్రిందిభాగమునందు 'కుండలిని' అను అద్భుతమగు ఒక శక్తియు నియమించబడియున్నది. జప, ధ్యాన, యోగాది సాధనములచే ఆ కుండలినీ శక్తిని మేల్కొలిపి షట్చక్రములద్వారా సహస్రారమున చేర్చినచో జీవునకు అద్భుతమగు శక్తులు కలుగును.

మఱియు తాను సంకల్పించిన సంకల్పము నెరవేఱును. జన్మ రాహిత్యరూపమోక్ష పదవియు కలుగును ప్రస్తుతము విజ్ఞాన శాస్త్రజ్ఞులు కనుగొనుచున్న ప్రతి యంత్రమునకు మూలము, ఆధారము ఈ శరీర యంత్రమేయని జ్ఞప్తియందుంచుకొనవలెను. కావున ఇట్టి అమోఘ శరీర యంత్రమును విషయవిలాసములందు, వ్యర్థ కార్యములందు దురుపయోగము చేయక, పరులను హింసించుట యందు ఉపయోగించక, జపధ్యానాదులందును, పరోపకారాది పుణ్యకార్యములందును 'మోక్షప్రాప్తి' యందును వినియోగించి యంత్రనిర్మాతయొక్క ఆదేశమును సఫలీకృతము చేయవలయును. జీవితమునిందిట్టి లక్ష్యసాధనను జనులు తమ తక్షణ కర్తవ్యముగా నెంచి, తదనుసారము కార్యాచరణములో ప్రవేశించుట శ్రేయస్కరము.

# 35) దూషణములో భూషణము

ఒకప్పుడొక మహనీయుడు పాదచారియై ఎచటికో పోవుచుండగా ఆ మార్గముననే మరియొక బాటసారి పోవుచు ఆ మహనీయుని చూచి అకారణముగ అతనిని నానా విధముల పరిహసించుచు, దుర్భాషలాడుచు, దూషించుచు వెంబడింప సాగెను. అటుకొంత దూరము పయనమైపోవగా మార్గమధ్యములో ఒక గ్రామము తటస్థించెను. ఆ గ్రామములో ఈ పాంథుడగు మహాత్మునకు శిష్యులు కలరు. వారాతనిని చేరదీసి ఆదరించిరి. అప్పుడతడు తన శిష్యులద్వారా కొంత మజ్జిగతో కూడిన అన్నమును తెప్పించి తనను దూషించుచు వెంటబడిన బాటసారిని సగౌరవముగ పిలిపించి 'నాయనా! భోజనము ఎప్పుడు చేసితివి! శ్రమయనక నన్నానావిధముగ చాలాదూరమునుండి దూషించుచు నడచితివి. చాలా సంతోషము. ఇదిగో ఈ మజ్జిగతో కూడిన అన్నమును భుజించి కొంత విశ్రాంతి తీసికొనుము' అని తనను దూషించిన అతనిని ఆదరించి గౌరవించెను. అప్పుడా బాటసారి 'స్వామీ! నా దూషణవలన మీకేలాటి కోపతాపములు కలుగుకుండుటకు కారణమేమియో తెలుపుడు' అని ప్రార్థించగా, ఆ మహాత్ముడిట్లు ఉద్బోధించెను–

'తిట్టబడువాడు మరియును తిట్టువాడు
ఒక్కడైయుండ స్తుతివిందలున్నె చెపుమా'.

'నాయనా! నీవు దూషించినది ఆత్మనా? లేక శరీరమునా? ఆత్మనైనచో మన ఇరువురియందేగాక చరాచర ప్రాణికోట్లలో కూడ ఒకే ఆత్మ అనుస్యూతముగా వ్యాపించి యున్నది. కనుక నీవు దూషించినది ఎదుటివానిని కాదు. వాస్తవముగ నిన్ను నీవే నిందిం

కొని, దూషించుకొని, పరిహసించుకొని సంతోషించుచున్నావు.
త్మజీ నేను చింతించుట దేనికి?'

ఒకవేళ ఆత్మనుగాక నా స్థూల శరీరమును దూషించుచు
న్నావా? అది నాకు మహద్భాగ్యమే యగును. అంతకంటె నాకు
వలసినదేమున్నది? ఎందుకనగా! ఈ రక్త, మల, మాంసాదుల
కూడిన ఈ స్థూల శరీరమునుండి వేరుపడి "అహంబ్రహ్మాస్మి"
ను మహావాక్యములద్వారా నా నిజస్వరూపమగు "జన్మరహిత
త్మ" యను సద్గతిని పొందుటకు ప్రయత్నించుచున్న నాకు ఈ
లశరీరము 'విరోధి' గనేయున్నది. నేను శరీరము కంటె
రుగనున్నాను. నేనే ఎప్పుడును ఈ స్థూలశరీరమును దూషించు
న్నాను. నీవు కూడ దీనిని దూషించుటలో సహకరించినందులకు
న్ను అభినందించవలసి యున్నది.

మరియు సర్వులను సంతోషింపజేసి, సర్వులకు ఆనందమును
ందజేయుట ద్వారా జన్మరహిత మోక్షపదవిని అవలీలగా నధిరో
ంచవచ్చునని తలంచి వేలకు వేల రూప్యములను వెచ్చించి అన్న
త్రాది దానధర్మ కార్యములను, పరోపకార క్రియలను చేయుచు
రిపరి విధముల జనులు కృషి సల్పుచున్నారు. మరి నేనో
న తెల్పిన విధముగ ద్రవ్యమును వెచ్చించి ఆయా పుణ్యకార్యముల
నిని చేయలేకపోయినను నీకు ఏదియో విధముగ మహదానందము
లుగజేసినవాడనగు చున్నాను. ఏలయనగా, నన్ను దూషించి నీవు
నందపడుచున్నావు.

ఆత్మజీ నీ ఆనందమునకు నేనే కారకుడను గదా! నాయనా!
ఆనందమే నా ఆనందము. నీ సుఖమే నా సుఖము.

అయితే నీవు ఇంకొకదానిని దూషించుట మఱచినావు. ఈ
స్థూల శరీరమునకు కారణభూతమైన మనస్సే అది. అది లేనిపోని
ాడు సంకల్పములను సంకల్పించి స్థూల శరీరముచే అనేక పాడు

పములు చేయించి తానుచెడి, ఇతరులను చెడగొట్టుచుండును. అ
మహా గయ్యాళి. దాని పొగరుమోతు తనమును మాన్పించిన
తప్ప జన్మరాహిత్య పదవికి అవకాశము కలుగదు. కావున
మనస్సుయొక్క దుష్టత్వమును దూషించి దానిని తొలగింప చేయు
అవసరమా - అని ఈ ప్రకారముగ అమ్మహాత్ముడు బాటసా
దూషణమును భూషణముగా భావించి నిర్వికారముగనుండు
తిని వివరముగ తెలుపగా, వెంటనే బాటసారి అతని పాదము
వ్రాలి తప్పు క్షమింపుడని వేడుకొని శిష్యుడై పోయెను.

కావున సాధకుడగువాడు తన జీవితమునందు తటస్థిం
దూషణములచే ఏమాత్రము ప్రభావితుడుగాక వాస్తవముగ
యందు దోషములున్నచో వానిని సవరించుకొని, దోషము
లేనిచో, ఎదుటివాడు చేయు దూషణమును తన సహనత్వ
మకు ఒక పరీక్షగా నుపయోగించుకొని పురోభివృద్ధిని బడయుచు
వలయును.

# 36) ఉపనిషత్ అనగా?...

ఏది జ్ఞానమునకు అగ్రస్థానమొసంగుచు మానవుని హృద
యమున ఆవరించియున్న అజ్ఞానాంధకారమును పటాపంచలు
చేసివైచునో,

అద్వైత ఆకాశ గగన వీధులందు విహరించుచు శోకమోహాదు
లనెడి భయంకరారణ్యమునుండి జనులను కాపాడునో,

అవిచ్ఛిన్నమై, అచ్ఛేద్యమై, జాతి మత కుల భేదముల కతీతమై
వెలుగునో,

ఋషులస్వానుభవములతో కూడి, ప్రమాణపూరితములగు
సిద్ధాంతములను వెదజల్లునో,

సకలశాస్త్రసారాంశమును విశదీకరించి జనుల అజ్ఞానతమమును
పోగొట్టునో,

తన్నాశ్రయించిన సకల ప్రాణికోట్లకును, శాంతి సుఖముల
నొసంగి, మోక్ష సామ్రాజ్యాధిపత్యమును గలుగజేసి బ్రహ్మానంద
సాగరములో నోలలాడించునో - అదియే ఉపనిషత్.

# 37) నడిచే దేవాలయము

దేవాలయములు ఎప్పుడు నడవవు. అవి ఉన్నచోటునే ఉండును
ఏండ్ల తరబడి నిశ్చలముగ, స్థిరముగ కదలక మెదలక అవి నిలి
యుండును.

కాని ప్రపంచమున ఒక అపూర్వమైన దేవాలయము కలదు
అది నడచుచుండును. అప్పుడప్పుడు నడవకయు యుండును
ఆ దేవాలయము యొక్క నిర్మాత మానవుడు కాదు, భగవ
తుడు. నడిచే దేవాలయాలను ఎన్నిటినో వారింతవరకు నిర్మి
చియుండిరి. నిర్మించుచున్నారు. భావి కాలమున నిర్మిం
నున్నారు. ఆ నడిచే దేవాలయమును నిర్మించుటకు ఇటుక అక్క
రలేదు, సున్నముక్కరలేదు, సిమెంటుతోను, కమ్ములతోను పనిలేదు
దానిని భగవంతుడు అతి చాకచక్యముగ నిర్మించి ప్రపంచముల
వదలి వేయుచున్నాడు. వదలివేసిన వెంటనే ఇక అది స్థిమి
ముగ నుండక ఒక చోటనుండి మరియొక చోటికి ప్రయాణమ
సాగించుచుండును. ఇది ఎంత విచిత్రము!

ఆ నడిచే దేవాలయము మరేదియు కాదు, శరీరము. (
శరీరము అను దేవాలయములో ఆత్మయను దేవుడు కాపురము
డుచున్నాడు. ఈ దేవాలయములోని మూలవిరాట్టు ఆత్మయే.

దేహో దేవాలయః ప్రోక్తో
జీవో దేవస్సనాతనః
త్యజేదజ్ఞాన నిర్మాల్యం
సోఽహం భావేన పూజయేత్

అని శాస్త్రములు వక్కాణించుచున్నవి. దేహమే దేవాలయమ

ఆత్మయే సనాతన దేవుడు. అజ్ఞానమను నిర్మాల్యమును తీసి వేసి 'సోఽహం' (నేనే ఆత్మను) అను భావముతో ఆత్మదేవుని పూజించవలయును.

దేహమే యొక దేవలంబన్నా
దానియందున ఆత్మదేవుడు వెలయుచుండన్నా
దుర్గుణాలను ధూళినంతను
శ్రద్ధతో ఊడ్చివైచి
సద్గుణాలను పూలచేతను
ఆత్మదేవుని పూజసలుపుము
తత్త్వసారము తెలిపికోరన్నా
సద్గురునిచెంత నిజముకనుగొని లాభమొందన్నా

అని పెద్దలు ఘోషించుచున్నారు. కాబట్టి శరీరమను అపూర్వ దేవాలయమును బడసిన దానిని అపవిత్రము చేయక, అది దైవమునకు నివాసస్థానమని గ్రహించి, లోనున్న ఆ దైవమును (ఆత్మను) సాక్షాత్కరించుకొనుటకై తీవ్రముగా యత్నించవలెను.

ప్రతి మానవుడు తన శరీరము ఒక పవిత్ర దేవాలయమనియు, తనయందలి పంచకోశములలోపల ఆత్మదేవుడను మూలవిరాట్టు కాపురముండుచున్నాడనియు ప్రగాఢముగ విశ్వసించి ఆ శరీరమును మలిన చేష్టలకు ఉపయోగించక, పవిత్ర కార్యములనే దానితో నిర్వ హించుచు లోనగల ఆత్మయను దేవుని ఈ జీవితమునందే అనుభూతి మొనర్చుకొనుట కొరకై అనవరతము కృషి చేయ వలెను. శమదమాది సాధనలను పట్టుదలతో సాధించుచు చిత్తశుద్ధి నిబడసి తద్వారా ఆత్మజ్ఞానమును సంపాదించవలెను. ఆత్మాను భూతిని పొందవలెను.

ఇంతియే కాదు. ప్రతిమానవుడు సృష్టిలోని ప్రతిప్రాణి ఒక నడిచే దేవాలయము అని భావించుచు, ఆ దేవాలయములో ప్రతిష్ఠితుడై యుండిన దేవుడను మూలవిరాట్టును దృష్టియందుం చుకొని, ఆ ప్రాణిని ఏమాత్రము బాధింపక, ఆ ప్రాణిని తనవలెనే చూచుచు, ప్రేమ, దయ, కరుణము వర్షించుచు, ప్రేమమార్గమును, ధర్మమార్గమును, దయామార్గమును అనుసరించుచు, "నిర్వైర స్సర్వ భూతేషు" అని గీతాచార్యుడు సెలవిచ్చినట్లు సర్వభూతదయ కల్గి ఏ ప్రాణిని బాధింపక, సమస్త జీవరాసులయెడల అపార ప్రేమ కలిగియుండవలెను. ఈ ప్రకారముగ సమస్త ప్రాణికోట్లు నడిచే దేవాలయములు అను భావముకలిగి గొప్ప హృదయ పరివర్తన కలిగి, భక్తి జ్ఞానములను చక్కగ సంపాదించి ఆత్మసాక్షాత్కారమును బడసి మానవ జీవితమును చరితార్థమొనర్చుకొనవలెను.

# 38) క్రోధమునకు హెచ్చరిక

ఓ క్రోధమా !

నిన్ను ఆశ్రయించిన వారిని నీవు ధర్మాధర్మ విచక్షణారహితులు గను, జ్ఞానశూన్యులుగను, వివేక రహితులుగను చేసివైచి వారిద్వారా నానావిధములైన దుష్కృత్యములకు అవకాశము కలిగించుచున్నారు.

ఓ పిశాచమా!

నిన్ను గూర్చి జనులు ఏమనుకొనుచున్నారో గమనించితివా? నిన్ను పిశాచముగ జనులు వర్ణించి చెప్పుకొనుచున్నారు. ఏల యనగా, నీవు పిశాచము పగిది శరీరములో ప్రవేశించి జన సామాన్యము యొక్క చిత్తమును మలిన మొనర్చివేయుచున్నావు. నిన్ను జయించుటకు సిద్ధముగనున్న సాధుసత్పురుషుల చెంతకు మాత్రము వెళ్ళుటకు నీవు సాహసించలేకున్నావవ. అచట నీ ఆటలను వారు సాగనివ్వరని నీకు బాగుగ తెలియును.

ఓ క్రోధాగ్ని !

అగ్నియొక్క వేడికంటె నీవనేక రెట్లధికమగు వేడిని కలిగియు న్నావు. అయినను శాంతమను మంచుగడ్డను హృదయమున ప్రతిష్ఠించుకొనినవారిపై నీవు నీ శక్తిని ప్రయోగించలేవు. ఒకవేళ పట్టుదలతో నీవు అట్లు ప్రయత్నించినచో పరాభవమొందుట తథ్యము. అట్టితఱి నీ సహజ క్రోధాగ్నిని నీవు కోల్పోయి శాంతించెదవు అది ఉభయులకును శ్రేయస్కరము కాగలదు.

ఓ రాక్షసా!

జనుల హృదయాంతరాళమందు ప్రవేశించి మానవత్వమును మంటగలుప ప్రయత్నించు నీ హృదయము అతి కఠోరమైనది.

నీగుండె లోహముకంటెను కఠినతరమైనది. అట్టి నిన్ను శాంతమను వర్షముచే స్నానము చేయించినచో నీవు దాసోహమనక తప్పవు.

ఓ తస్కర శిఖామణీ !

నీవు మిత్రునివలె నటించి జనుల నాశ్రయించి వారిచెంతనున్న జ్ఞానమను రత్నము నపహరించుటకు ప్రయత్నించుచున్నావు. కాని మహాత్ముల సాంగత్యముచే జనులు మేలుకొని నీవు ప్రబల శత్రువని దొంగవని తెలిసి కొనుచున్నారు. ఇక నీ ఆటలు అట్టివారియొద్ద సాగవు, వారు సాగనివ్వరు.

ఓ రాజసమూర్తీ !

నీ ఉనికికి రజోగుణమే హేతువనియు, ఆవేశమే కారణమని విజ్ఞులు తెలిసికొనినారు. నిన్ను కనుగొనుట వారికి ఏమంత కష్టముకాదు. నీవు నిన్ను ఆశ్రయించువారియొక్క నేత్రములు అగ్నిజ్వాలలవలె ఎఱ్ఱగ చేసి చూచుటకు భయంకరాకృతి కలవారుగ నొనర్చెదవు. వారి ముఖమును సహజ సౌందర్యమునుండి తప్పించి వికారయుక్తముగ జేసి రాక్షసుని చందమున గావించెదవు. వారి నోటినుండి కర్ణకఠోరమైన నానావిధ దుర్భాషణములను పలికించెదవు. వారి మెదడులోను శరీరములోను, ఒకానొక విషపూరిత సంచలనము గలిగించెదవు.

ఓ అరిష్టదాయకా !

అన్యాయమును, అధర్మమును అణగద్రొక్కి ప్రజోపయోగమగు ఒక మహోన్నత కార్యమును సాధించుటకై ఎవరైన ఎప్పుడైన తాత్కాలికముగ నిన్ను ఆశ్రయించినచో అట్టి సమయములో ప్రకటితమగు కోపము కృత్రిమము అనియు, అదియంతయు నాటకరంగమున ప్రదర్శించబడు రౌద్రమే అనియు మాత్రము మఱువకుము.

ఓ ప్రతిపక్షీ!

అరిషడ్వర్గములో నీవు ద్వితీయస్థానము నాక్రమించుకొన్నావని విఱ్ఱవీగుచున్నావేమో! ఈ విషయమును తెలివిగలవారు ముందుగనే గ్రహించినవారై నిన్ను జయించుటకు వజ్రతుల్యములగు శమద మాది ఆయుధములను మఱికొన్ని ఉపాయములను పెద్దలద్వారా గ్రహించి వాటిని నీపై ప్రయోగించుటకు తగిన సమయము కొఱకు వేచియున్నారు.

# 39) చేరవలసిన చోటు- చేయవలసిన పని

ప్రపంచములో ఉద్భవించిన పిపీలికాది భూతకోటి మొదలుకొని సూర్యచంద్రాదుల వఱకుగూడ ప్రతిజీవి మృత్యువను ప్రళయాగ్నికి ఆహుతి కావలసివచ్చునను పరమరహస్యమును 'జాతస్య హి ధ్రువో మృత్యు' అను శాస్త్రవాక్యము తేటతెల్లముగ తెలుపుచున్నది.

మఱియు 'యద్దృశ్యం తన్నశ్యం' అను వేదవాక్యము కూడ ఈ విషయమునే విపులీకరించుచున్నది. ఏది కంటికి కనపడునో, అది ఇప్పటికి కాకపోయినను ఏనాటికైనను కాలగర్భములో నశించుట తథ్యమని గ్రహించవలసి యున్నది. ఏది సృష్టికి పూర్వము లేకను, లయానంతరము గోచరించకను మధ్యలో కనిపించునో అది మిథ్యయని భావించవలసి యున్నది. దీనినిబట్టి బంధు, మిత్ర, పుత్ర, కళత్రాదులు కూడ శాశ్వతములు కావని స్పష్టముగ విశదమగుచున్నది. అట్టిచో వారిపై మమత్వమేల? శరీర వియోగసమయమున బంధువర్గమువారు కాని, సన్నిహితులు కాని, ఆప్తులు కాని, మిత్రులుకాని ప్రాణమును నిలుప సమర్థులు కారుగదా? యమదూతల భయంకర చర్యలకు వారు ఎదుర్రు చెప్పలేరుగదా? ఇట్టి విషమ పరిస్థితిని తప్పించుకొనవలెనన్న, ఏది శాశ్వతమైనదో, అక్షయమైనదో, ఆనందదాయకమైనదో అట్టిదానిని తప్పక ఆశ్రయించవలసియే యున్నది.

అట్టి మహోన్నత లక్ష్యము యొక్క సాఫల్యము కొరకు తపస్సు, ధ్యానము, యోగము ముఖ్యములని తలంచి వానిని ఆచిరించుటకు బద్ధకంకణులు కావలయును మఱియు అట్టి కార్యసాధనమందు భయంకర విఘ్నములు తటస్థించినను వానినన్నిటిని ధైర్యముతో

ఎదుర్కొని నిశ్చల, నిర్మల, సంయమముచే భీకర అజ్ఞానాంధ కార పరిపూరితమగు ఘోరాటవిని ఆత్మోద్యానవనముగ మార్చుకొని అందు విహరించిన వాడే 'మృత్యోర్మా అమృతంగమయ' అనునట్లు మృత్యువును దాటి అమృతత్వమును బడయుగలరు.

ఒక బస్సునుగాని, రైలునుగాని, కారునుగాని గమ్యస్థానమును చేర్చుటలో ప్రధానపాత్ర వహించువాడు, కీలకస్థాన మాక్రమించునది డ్రైవరు. అట్లే మోక్షధామమును చేరవలయునను కుతూహలముతో జీవుడు శరీరమను వాహనము నధిరోహించి ప్రయాణమును సాగింప దలంచి సరియైన డ్రైవరు ఎవరాయని ఆలోచించుచుండగా అత్తటి "ధీః" అనగా బుద్ధి అను వాడు ముందుకు వచ్చెను.

ఈ బుద్ధి అను సారథి వివేకయుక్తుడు కానిచో శరీర రథమును మహర్షులు చూపిన సవ్యమార్గమున బోనీయక అన్యమార్గమును పట్టించి అధోగతికి చేర్చును. కనుకనే గాంధీపితామహుడు 'సబ్ కో సన్మతి దే భగవాన్' 'ఓ భగవంతుడా! ప్రజలకు మంచిబుద్ధిని కలుగ చేయుము' అని ప్రార్థించెను. బుద్ధి చెడినచో, మతి లోపించినచో మానవత్వమే లోపించును మానవత్వము లోపించినచో మూఢత్వము చెలరేగును. మూఢత్వము చెలరేగినచో మృగత్వము తాండవించును. అట్టి మృగత్వముచే-

పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరే శయనం

అనునట్లు చచ్చుట, పుట్టుట, వచ్చుట, పోవుట అను జనన మరణ రూపయంత్రములో తగుల్కొనవలసివచ్చును.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత.

"ఈ జననమరణ రూప మహాయంత్రమును గిరగిర త్రిప్పుచున్న పరమాత్మను ఆశ్రయించి పునర్జన్మరహితులుకండు! ఆత్మ స్వామ

జ్యమునకు నారపత్యమును వహించుడు!" అని గీతాదేవి ఎలుగెత్తి చాటుచున్నది.

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే.

ఏయే లోకములందు ఏయేవిధముగ తిరిగినను చివరికి సర్వాంతర్యామియగు సర్వేశ్వరునియందైక్యము పొందనిదే సుఖశాంతులతో కూడిన అమృతత్వమును పునరావృత్తిరహిత మోక్షధామమును పొందుట దుర్లభమని గీతాదేవి పై శ్లోకముద్వారా ఇంకను విపులముగ తెలుపుచున్నది. కావున ప్రతివారును జగన్మాతయగు గీతామతల్లి యొక్క పైవాక్యములను ఆచరణయందుంచుకొనుచు ఆ తల్లియొక్క చరణసాన్నిధ్యమున సద్బుద్ధియుతులై జీవనయాత్ర సాగించినచో పరమాత్మరూపలక్ష్యమును చేరుట తథ్యము. అట్టి పరమాత్మస్థానమే ప్రతివారును చేరవలసినచోటు. మరియు అట్టి పరమాత్మ యెడల భక్తి ప్రపత్తులు గలిగి అనవరత సాధనచే మాయను జయించి జీవన్ముక్తిని బడయుటయే ప్రతివారును చేయవలసినపని.

# 40) జంతుబలి భావ్యంకాదు

ఏదో ఒక నెపముతో కొందరు జంతువులను బలి ఇచ్చుచున్నారు. ఇది హర్షించగద్ద విషయము కాదు. జంతువులను బలి ఇవ్వమని ఏ దేవత కోరదు, ఏ దేవుడు కోరడు. అలా కోరువారు దేవతలు కారు, దేవుళ్ళు కారు.

తన బిడ్డలను బలి ఇవ్వమని ఏ తల్లి, తండ్రి కోరరుగదా? అలా కోరినవారిని తల్లిదండ్రులుగా ఎవరైనా ఊహిస్తారా? భావిస్తారా?

సమస్త జీవరాసులు భగవంతుని సంతానమే. తమ సంతానమును తనకే బలి ఇవ్వమని వారు ఎలా కోరెదరు-ఇది అసహజమైన విషయము. నమ్మటానికి వీలులేని విషయము.

నోరు మెదపలేని ఆ మూగజీవులను అత్యంత కిరాతకముగ, వాటి తలలను నరుకుచుండినప్పుడు అవి పడు బాధలు, వాటి కేకలు కండ్లారా చూస్తూ చెవులారా వింటూ ఎవని హృదయము ద్రవించదో, జాలి హృదయముగ మారదో అట్టివానిని మానవుడనుటకు వీలులేదంటారు మహాత్ములు.

నోరులేని ఆ జంతువులనే బలి ఎందుకివ్వాలి, భక్తిప్రపత్తులు ప్రదర్శించుటకు ఆ జంతువులే దొరికాయా మానవునికి? వారి వారి శరీర అవయవములు వున్నవిగదా? వారి కాళ్ళు, చేతులు నరికి బలి ఇవ్వమంటే ఇస్తారా? వారి సంతానమునే బలి ఇవ్వమంటే బయటపడుతుంది వారి నిజస్వరూపము.

బలులు ఇచ్చుటద్వారా ప్రదర్శించు భక్తి, భక్తి కాదు. అది అనాగరికత, అమానుషత్వము. క్షమించరాని నేరము.

"దేహమే యొక దేవళంబన్న

దానియందున, ఆత్మ దేవుడు వెలయుచుండన్నా"

అంటారు మా గురుదేవులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు తమ 'తత్త్వసారము' అను గ్రంథములో.

అత్యంత పవిత్రమైన దేహమనే దేవాలయమును పవిత్రంగా, పరిశుభ్రంగ వుంచుకొనక చచ్చిన జంతువుల యొక్క రక్తమాంసాదులను ఆరగించుచు ఆ దేవాలయమును అపవిత్రము చేయుట ఎంతవరకు సమంజసము?

చచ్చిన ప్రాణులను ఎచ్చట సమాధి చేస్తారో, కాలుస్తారో, ఆ ప్రదేశాన్ని శ్మశానమంటారు. చచ్చిన ప్రాణుల మాంసమును ఆరగించుటద్వారా వాటికి తన శరీరములో చోటిచ్చి ఈ నా **దేహమనే దేవాలయమును శ్మశానంగా తయారు** చేయుట కంగీకరించనంటాడు ఒక మహనీయుడు. మాంసమును తినమరిగిన కొందరు **వాలుకకు దాసులై** దానిని అదుపులో పెట్టుకొనలేక నానా యాతనలు పడుచు శరీర బలము కొరకు తింటున్నామని అలా తినవలసి వస్తూందని చెప్పుచున్నారు.

సింహము, పులి మొదలగు జంతువులు తమ బలము కొరకు మానవుని మాంసమును అభిలషిస్తే మానవుడు అంగీకరించి ఆ ప్రాణులచేత ఆరగింపబడుటకు సిద్ధపడ్తాడా? మాంసముకంటే బలవర్ధకములైన విటమినులు శాకాహారపప్పుదినుసులలో వున్నవి! శాకాహారులు బలంగా లేరని చెప్పగలరా?

కుంటుసాకులు చెప్పి ఎవరినీ మోసగించలేము. తాను చేసిన పాపము విషసర్పమువలె కాటు వేయుటకు వెన్నంటి తరుముచుండగలదు.

కావున ఇతరులను చంపి, హింసించి బాధించుటకు పరమ పవిత్రమైన మానవజన్మను ఉపయోగించక, చేతనైతే సహకరించుట,

లేకపోతే ఊరక వుండుట ద్వారా కూడ ఒక విధముగ సహకరించి నవారే అగుదురు.

"అపకారము చేయకుండుట
ఒక విధముగ ఉపకారము చేసినట్లే"

జంతుబలియను మూఢనమ్మకమునుండి మానవుడు బయట పడి తనలోని దుర్గుణాలను బలి ఇచ్చుటద్వారా మాధవత్వమును పొందుటకు అర్హుడు కావలెను. అట్టి దైవత్వమును పొందువారి 'క్యూ' (వరుస)లో మనమంతా నిలబడుదాం!

# 41) మంచిబుద్ధి

మతి అనగా బుద్ధి. సన్మతి అనగా సద్బుద్ధి. ఒక దేశము యొక్కగాని, ప్రపంచముయొక్కగాని, మానవునియొక్కగాని, శాంతి-సౌభాగ్యములు బుద్ధిమీదనే ఆధారపడియున్నవి. ఎన్ని సంపదలు, ప్రాపంచిక విద్యలు ఉన్నను బుద్ధి యొకటి సరిగా లేనిచో, బుద్ధి బూడిదపాలయినచో వినాశమే గతి.

సముద్రము నుండి జలము ఆవిరియై మేఘరూపముగ పరిణామమొంది, వర్షించి నదులుగా మారి, నదులనుండి చిన్న చిన్న కాలువలలో చేరి ప్రజోపయోగకరమగు విధముగనే జ్ఞానమను సాగరమునుండి పవిత్రమగు జీవశక్తి బుద్ధికి సంప్రాప్తమగుచున్నది. బుద్ధినుండి ఈ శక్తి సమస్త ఇంద్రియములందు ప్రవేశించి తన్మూలమున వివిధములగు పరిణామములను కలిగించి ఆ పరిణామములచే ఏర్పడు ఫలితములను జీవునిచే అనుభవింపజేయుచున్నది.

మనస్సు సంకల్పించిన ప్రతి విషయమును, బుద్ధి ఒక న్యాయాధిపతిగ వ్యవహరించి 'ఇది తగదు, ఇది తగును' అని నిశ్చయించును. ఈ నిశ్చయము సుప్రీంకోర్టు తీర్పువంటిది. తిరుగులేనిది, దీని తీర్పును శిరసావహించి ఇంద్రియములు ఆ ప్రకారము వ్యవహరించుచుండును. కావుననే గీతాచార్యుడు-

"బుద్ధ్యా విశుద్ధయా యుక్తో"

'అత్యంత నిర్మలమైన బుద్ధి గలవాడు మాత్రమే మోక్షమునకు అర్హుడగును' అని విశదీకరించి యున్నాడు.

అట్లే "సబ్ కో సన్మతి దే భగవాన్"

'అందరికి మంచి బుద్ధి నొసంగుడు' అని గాంధిమహాత్ముడు భగవానుని ప్రార్థించెను. బుద్ధిని సత్క్రమ మార్గమున, దైవమార్గమున కేంద్రీకరించినచో సర్వాభీష్ట సిద్ధియు మోక్షప్రాప్తియు సంభవించును. నిర్మలబుద్ధి మోక్షము నొసంగ సమర్థమై యుండును. అట్లుకాక ఈ బుద్ధియే కలుషితమై రాక్షసగుణయుక్తమై యున్నచో అది జీవుని నరకబాధకు కారణభూతమగుచున్నది.

మానవ జీవితము యొక్క సమస్త శక్తులకంటెను బుద్ధి అత్యుత్తమమై మహాప్రభావోపేతమై యున్నది. ప్రపంచమున వ్యాపించియున్న అగణితములగు మిథ్యా విషయములందు సారభూతమగు సత్యమును గ్రహించవలయున్నను, యుక్తాయుక్త విచక్షణ చేయవలయున్నను ఈ సన్మతియే జనులకు శరణ్యము. మఱియు దూరదృష్టికిని, సత్య, ధర్మ కార్యములొనరించుటకును, సచ్చింతనము, సత్సాంగత్యము, సద్విషయ ప్రసంగము, సద్గ్రంథ పఠనము, పవిత్రాచరణము, హితకార్య సేవనము మొదలుగాగల ఉన్నతాశయముల సంపాదనమునకును గాంది మహాత్ముడు తెలిపిన ఈ 'సన్మతి' సర్వులకును, ఉపాదేయమై యున్నది. కావున అఖండ మహిమాన్వితమగు దైవశక్తిని అగాహన చేసికొనవలయునన్నచో, జ్ఞాన సూర్యప్రభాసమన్వితమై, అత్యంత శక్తి స్తోమతలు గలిగియున్నట్టి అమూల్యమైన ఈ సద్బుద్ధిని, సన్మతిని సంపాదించి ఈ జీవితమందే దైవసాక్షాత్కార రూప సద్వ్రతమును పరిపూర్ణమొర్చుకొనవలెను.

# 42) దాసోऽహం, శివోऽహం

శ్రీ రామకృష్ణపరమహంస యొక్క గృహస్థశిష్యులలో నాగమహాశయుడను నాతడు చాల ముఖ్యుడు. సన్న్యాసి శిష్యులలో వివే-'నందుడు చాలగొప్పవాడు, నాగమహాశయుడు పరమభక్తుడు. వివేకానంద పరమజ్ఞాని, ఒకరు 'దాసోऽహం' మార్గావలంబి. మఱియొకడు శివోऽహం' పథగామి. ఒక పండితోత్తముడు వారిరువురిని దర్శించి ఇరువురి స్వభావములను, మనస్తత్త్వములను తక్షణమే హృదయంగమ మొనర్చుకొని వారినిగూర్చి యిట్లువర్ణించెను.

'మాయ' అను మహాశృంఖలము (గొలుసు) నాగమహాశయుని, వివేకానందుని ఇరువురిని కట్టివైచినది.

కాని నాగమహాశయుడు తనకాయమును చిన్నదిగ, చిన్నదిగ తగ్గించుకొనుచు వచ్చి తుట్టతుదకు ఒక చిన్న పురుగువంటి ఆకృతికలవాడై ఆ గొలుసుయొక్క రింగులోని సందుగుండా దూరి తప్పించుకొని పారిపోయెను! వివేకానందుడో తన శరీరమును పెద్దదిగ, పెద్దదిగ కావించుకొని, విజృంభించి ఆ గొలుసును బ్రద్దలుచేసి పారిపోయెను.

ఈ ప్రకారముగ ఇరువురును మాయాబంధమునుండి విముక్తిని బడసిరి- అనగా భక్తిమార్గావలంబియగు నాగమహాశయుడు 'దాసోऽహం' అను భావనగల్గి తన అహంకారమును చంపుకొని-

త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ.

-'దేవా! నేను నీ దాసానుదాస తద్దాసానుదాస దాసుడను' - అని భగవానుని కీర్తించుచు తన ఉపాధిని తన మనస్సును చిన్న దిగ, చిన్నదిగ చేసికొని తుదకు పరమాత్మయందు లయిపజేయును. జ్ఞానమార్గావలంబియగు వివేకానందుడు-

మత్తో నాన్యత్కించి దత్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తు మాయోప క్లప్తమ్
ఆదర్శాంతర్భాసమానస్య తుల్యం
మయ్యద్వైతే భాతి తస్మాచ్ఛివోఽహమ్.

- ఈ ప్రపంచము నాకంటె అన్యముగ ఒకింతైనను లేదు. మాయచే ఈ ప్రకారముగ అది బాహ్యమున కల్పింపబడి యున్నది. అద్దమువందు వస్తువెట్లు కల్పితమై భాసించునో అట్లే అద్వయమగు నాయందీజగత్తు మిథ్యారూపమున భాసించుచున్నది.

కావున వాస్తవముగ ద్వైతములేదు. పరమాత్మయే కలదు. అట్టి అద్వయ శివస్వరూప పరమాత్మే నేను- అని ఎలుగెత్తి పాడుచు తన ఉపాధిని (మనస్సును) విశాలమొనర్చి, విశాలమొనర్చి తుట్టతుదకు అనంతపరమాత్మగనే భాసిల్లును-అని భావము.

కావున ఏ విధముగ జూచినను ఇరువురును ఏదోయొక విధముగ తమ మనస్సులను లయముచేసి ఆత్మమాత్రులై శేషించియుండిరి. భక్తియొక్క పరాకాష్ఠయు, జ్ఞానముయొక్క పరాకాష్ఠయు రెండును ఒకటియే. మార్గమొకింత భిన్నముగ కన్పించినను, లక్ష్యమొకటియే, పైనదెల్పిన నాగమహాశయ, వివేకానందులలో ప్రధానమైన గుణము ఎత్తి చెప్పబడినదే కాని, వాస్తవముగ నాగమహాశయునియందు జ్ఞానము లేకపోలేదు, వివేకానందునియందు భక్తి లేకపోలేదు.

కాబట్టి ఇక ముముక్షువులు ఈ భక్తి, జ్ఞానములగూర్చిన తర్క వితర్కములందు బడక ప్రధానకర్తవ్యమగు శీలసంపాదన (Ethical training) యందు కాలమును వినియోగించుదురుగాక! అది సిద్ధించినచో అన్నియు సిద్ధించినట్లే, భగవద్గీతయొక్క హృదయము ఈ సచ్ఛీలసంపాదనయే అయియున్నది.

హృదయనైర్మల్యము, చిత్తశుద్ధి, మనఃపవిత్రత ఎచటనుండునో అచట పరమాత్మ దేదీప్యమానముగ ప్రకాశించుచుండును. కావున ముముక్షువులెల్లరును తీవ్రపురుష ప్రయత్నము నాశ్రయించి, అనన్యభక్తిసంయుతులై, తమ హృదయమందలి అసూయాద్వేషాది దుర్గుణములన్నింటిని పారద్రోలి, భగవంతునకు అతి ప్రియులై వారి కరుణచే ఈ మహాభయంకరమగు మృత్యు సంసార సాగరమును అవలీలగ దాటివేయుదురుగాక!!

**ఓమ్ తత్ సత్**

# 43) పుష్కరం

జన్మానికి శివరాత్రి అన్నట్లు 12 ఏళ్లకొక్కసారి ఒక్కొక్క నదికి పుష్కరం అనే పండుగ వస్తూంటుంది. అది దీర్ఘ కాలానికి వచ్చే పండుగ కాబట్టి దానికొరకు చాలామంది ఎదురు చూస్తూంటారు. ముఖ్యంగ పెద్ద నదుల సమీపంలో యుండే వారు గొప్ప ఉత్కంఠంతో దానికొరకు కాచుకొనియుంటారు. 12 రోజులు జనులు ఆయా నదులలో స్నానాలు చేసి దానధర్మాలు గావించి, పుణ్యాన్ని సంపాదిస్తూంటారు. అసలు పుష్కరమనేది ఎట్లా ఏర్పడుతుందో ఒకింత ఆలోచిస్తాం.

మూడున్నర కోట్ల తీర్థములతో కూడి పుష్కరు దేవత గంగాది నదులలో నివసించు కాలానికి పుష్కర కాలమని పేరు.

బృహస్పతి మేషరాశిలో ప్రవేశిస్తే గంగానదికి పుష్కరము.

అలాగుననే బృహస్పతి వృషభరాశియందు సంచరిస్తే నర్మదా నదికి,

మిథున రాశియందు సరస్వతీ నదికి,

కర్కాట రాశియందు యమునా నదికి,

సింహ రాశియందు గోదావరి నదికీ,

కన్య రాశియందు కృష్ణానదికి,

వృశ్చిక రాశియందు భీమరథీ నదికి,

ధను రాశియందు పుష్కర నదికీ,

మకర రాశియందు తుంగభద్రా నదికీ,

కుంభ రాశియందు సింధు నదికీ,

మీన రాశియందు ప్రణీతా నదికి పుష్కరము.

పుష్కర కాలంలో జనులు ఆయా నదులలో స్నానాలు చేయటమే కాకుండా ఎందరికో దానాలు చేస్తారు. ధర్మ కార్యాలెన్నియో నిర్వహిస్తారు. ఈ విధంగా జనులు ఎంతయో పుణ్య సంపాదన గావిస్తూంటారు. మంచిదే.

కాని అన్ని నదులకంటె, అన్ని తీర్థములకంటె గొప్పదైన తీర్థమొకటి సమీపాన్నే యుంది. అదియే మానస తీర్థం. అదియే హృదయ తీర్థం. మనస్సును పవిత్రంగా యుంచుకొంటే, కామ క్రోధాదుల యునికి అచట లేకుండ చేస్తే అది అన్ని తీర్థములకంటె గొప్ప తీర్థముగ విరాజిల్లుతుంది. అట్టి పవిత్ర మానస తీర్థంలో స్నానం చేసినవారికి పుణ్యమే కాదు. సాక్షాత్ మోక్షమే లభిస్తుంది. ఈ రహస్యం తెలుసుకొని జనులు తమ మానస తీర్థాన్ని నిష్కల్మషముగ యుంచుకొని అందు ఎలాటి దోషాలు ప్రవేశింపనివ్వకుండ బహుజాగరూకతతో ప్రవర్తిస్తూ ఆత్మానందం అనుభవిస్తూ పవిత్ర మానవ జీవితాన్ని చరితార్థం చేసుకోవాలి. అద్దం నిర్మలంగా యుంటే,

దుమ్ము లేకుండా యుంటే ముఖం స్వచ్ఛంగ గోచరించునట్లు మనస్సు శుద్ధంగ యుంటే అధిష్ఠానమగు ఆత్మయొక్క అనుభవము చక్కగ కలుగుతుంది. అట్టి ఆత్మానుభూతియే సర్వుల యొక్క చరమ లక్ష్యం. ఇతర పుణ్య కార్యాలతో పాటు ఈ మహత్తర కార్యాన్ని కూడా సాధించి జనులు ధన్యులయ్యెదరుగాక!

పుణ్య సంపాదన కొరకై పుష్కర తీర్థ సేవనము కొందరికి అందుబాటులో లేకపోవచ్చు. అందరికి సమీపంలో యున్న మానవ తీర్థాన్ని పవిత్రవంతం చేసుకొంటే అట్టి తీర్థ సాన్నిధ్యంచే హృదయాన్ని పునీతం చేసుకొంటే జీవితం చరితార్థమౌతుంది. పరమశాంతి చేకూరుతుంది. జన్మరాహిత్యం సిద్ధిస్తుంది. కైవల్య పదవి సంప్రాప్తిస్తుంది.

# 44) రావిచెట్టు మహిమ

ఈ చరాచర ప్రకృతిలో అణువణువునా భగవంతుని దివ్యశక్తి వ్యాపించి యున్నది.

"ఇందుగలడందులేడను సందేహంబు
వలదు చక్రి సర్వోపగతుండు
ఎందెందు వెదకి చూచిన
అందందే కలడు"

ప్రహ్లాదుని కోరికపై నృసింహమూర్తిగా ఆ పరాత్పరుడు స్తంభమునందు దర్శనమిచ్చెను.

నిప్పు పుల్లలో నిప్పు వున్నను అగ్గిపెట్టె ద్వారా అది బయటబడునట్లే భగవంతుడు సర్వత్రా వ్యాపించియున్నను భక్తుని ప్రార్థనచేతనే బహిర్గతుడై దర్శన మొసంగును.

"చెట్లు, పుట్ట, రాతి, నదులు మొదలగు అన్నిటియందును వ్యాపించి యున్నాను" అని గీత 10 వ అధ్యాయములో వివరించి యున్నాడు కృష్ణభగవానుడు.

"అశ్వత్థః సర్వవృక్షాణాం"

వృక్షములలో రావిచెట్టుయందు ఎక్కువ శక్తితో వున్నానన్నారు.

అట్టి రావిచెట్టు మహిమను, గొప్పదనమును గురించి వివరించుకొందాము-

మూలమునందు, శాఖలయందు, స్కంధమునందు, ఆకులయందు, ఫలములందు సర్వత్రా అచ్యుతుడు సమస్త దేవతలతో కూడియుండును అను విషయము స్కాంద పురాణము చెప్పుచున్నది. రావిచెట్టును విష్ణు స్వరూపముగ చెప్పెదురు కనుకనే

రావిచెట్టు విష్ణువుగాను, వేపచెట్టు మహాలక్ష్మిగా భావించి ఒకే పాదులో వేపచెట్టును, రావిచెట్టును పెంచి పెండ్లి చేయుచుందురు. ఇలా చేసి సాక్షాత్ లక్ష్మినారాయణులకు కల్యాణము చేసినట్లుగ భావించెదరు. రావిచెట్టు ఇంతటి మహిమతో కూడుకొనియున్నది కావుననే దీని పుల్లలను యజ్ఞయాగాదులకు మాత్రమే ఉపయోగించెదరు-ఇతర విధములుగా ఉపయోగించరు.

రావిచెట్టుకు ప్రదక్షిణము చేయుచు ఈ క్రింది మంత్రమును పఠించుటచే శరీర ఆరోగ్యముతోపాటు, మానసిక ఆరోగ్యము కూడా పొందగలరు.

మంత్రము-

మూలతో బ్రహ్మరూపాయ

మధ్యతో విష్ణురూపిణే

అగ్రత శ్శివరూపాయ

వృక్షరాజాయతే నమః

"మూలమందు బ్రహ్మదేవుడు, మధ్యభాగమున విష్ణువు, చివరి భాగమున శివుడు గలిగియున్న ఓ అశ్వత్థ వృక్షరాజమా! నీకు నమస్కారము" అని ఈ మంత్రము యొక్క అర్థము.

# 45) మరణ భయమెందుకు ?

మానవుడు ఎక్కువగా అమితంగా భయపడేది మరణము అను నాలుగక్షరాలకే. ప్రతి జీవియు జీవించాలనే ప్రయత్నిస్తాడు. చావుకు ఎదురేగి స్వాగతము చెప్పుటకు సాహసించడు. బ్రతికి బయటపడాలనే తపన, ఆరాటము అతనికి తెలియకనే అతనిలో ఉప్పొంగును. బొంబాయి ప్రయాణమంటే సంతోషిస్తాడు. అమెరికా, రష్యావంటి ఇతర దేశాలకు ఎవరైనా ఉచితంగా తీసుకెళ్తానంటే ఆనందపరవశుడౌతాడు. కానీ పరలోకానికి ప్రయాణము కట్టమంటే జంకుతాడు. బాధ చెందుతాడు-ఏడుస్తాడు. దీనికి కారణము తిరి గిరాని లోకము అని అతని భావన. తిరిగి ఈ శరీరముతో ఇప్పుడున్న ఇంటికి వచ్చుటకు వీలుంటే తప్పక ఇతర లోకాలకు కూడా ఊరెళ్ళినట్లు వెళ్ళి, వచ్చుటకు సూటుకేసు సర్దుకుంటాడు.

పరలోకానికి వెళ్ళినా, ఋణానుబంధముతో తిరిగి తన ఇంటికే రావచ్చును కానీ ఆకారము మారుతుంది. తండ్రిగా, తాతగా, అవ్వగా, అక్కగా పరలోకానికి వెళ్ళినవాడు, కుమారుడిగ, కూతు రుగ లేక ఇంటిపనిమనిషిగ మన ఇంటికి రావచ్చును. ఇది వారు చేసుకొన్న కర్మఫలితమునుబట్టి ఆకారాలు మారుచుండును. కావున మంచిపనులే చేయాలి. మంచిగనే బ్రతకాలి, అప్పుడు నిర్భయంగా మృత్యువును ఆహ్వానించవచ్చును. (BE FEARLESS) నిర్భయంగా ముందుకు సాగిపోవచ్చును. ఎవరికిని జంకనవసరము లేదు. పుణ్యధనమును సంపాదించినవారికి సగౌరవంగా స్వాగతము దొరుకును.

మంచు వేడిగ వుందంటే ఆశ్చర్యము. నిప్పు చల్లగ ఉందంటే ఆశ్చర్యము. అలాగే పుట్టినవాడు చావలేదంటే ఆశ్చర్యము.

విశ్వప్రభుత్వములోని ప్లానింగ్ మినిష్టర్‌గారైన బ్రహ్మదేవుడు మట్టిబొమ్మలు చేయదలంచి భూదేవిని మట్టి ఇమ్మని అడిగారట. తిరిగి నా మట్టి నాకిచ్చు షరతుపై అయితే మట్టి ఇస్తానని భూదేవి పలికిందట. వారిరువురి అగ్రిమెంటు ప్రకారమే సకల జీవరాసులు భూదేవిలో కలిసిపోతున్నారు.

"రాజు రౌతు యనెడి భేదము బ్రతికియుండేవరకురా

మట్టి మట్టి కలిసినాక యెట్టి భేదాలుండరా"

అన్నారు ఒక మహానుభావుడు. కావున ఎంతకాలం బ్రతికామని కాకుండా ఏ విధంగా బ్రతికినామని ప్రతి ఒక్కరు ఆలోచించాలి. "Not long life but Divine life" దీర్ఘజీవితము కొరకు ప్రాకులాడుటకంటే దివ్యజీవితము కొరకు ప్రయత్నించినవాడి జీవితమే ధన్యము.

అట్టి ధన్యజీవులము మనమంతా ఎందుకు కాకూడదు. అట్టి ప్రయత్నములో మనమంతా ముందుకు సాగిపోదాం !

# 46) ఏది మనది?

సోదరా! ఈ పరితాపమెందుకు? లాటరీలో లక్షల రూపాయలు రాలేదనా? లేక నిన్నటివరకు వున్న కోట్లు ఈ రోజు నిన్ను వదలిపోయాయనా? ఈ కోట్లు నీవికావు. ఈ ఆస్తి నీదికాదు. ఈ విషయం నీకు తెలుసు. అయినా నీవు ఒప్పుకోవు. ఈ విషయమై రాజీపడలేవు. ఎందుకు ఒప్పుకోవు? అదే మాయ. మాయ వలలో చిక్కుకొన్న ప్రతివ్యక్తికి ఈ బాధ తప్పదు. మంచి సదాచార సంపన్నుడయిన వ్యక్తికి దయ్యము ఆహించినపుడు మధు మాంసములు కావలెనని ఎలా అంటాడో తిరిగి ఆ భూతము వదిలిన పిదప తన సదాచారముతో సత్క్రియలతో సత్ప్రవర్తనలతో ఎలా మెలగునో అలాగే మాయ, అజ్ఞానము ఆవహించిన వానికి యథార్థ విషయములు వివరించిననూ, విశదపరచిననూ వినడు.

నా సంపద పోయిందని అందరితో చెపుతావు. నిజానికి అది నీ సంపద అన్నందుకు గుర్తేమి? నీవు వచ్చేటప్పుడు తెచ్చావా? నీవు ఎలా ఏ విధంగా వచ్చావో, పుట్టావో నీకు తెలియదా? దిగంబరంగా, జానెడు మొలత్రాడు కూడా లేకుండా భూమిమీద పడ్డావు ఈ విషయం నీకు తెలియక కాదు. తెలుసు. తిరిగి త్వరలో అన్నీ వదలిపోవాలని కూడా తెలుసు. పోవు నపుడు వంటరిగా పోవాలని తెలుసు. ఈ ధనరాసులకు నీవు అధిపతిగా వున్ననూ వాటితో నీ ఆయుస్సును ఒక్క నిముషము అధికముగా కొనలేవని తెలుసు. మరి ఎందుకు ఈ ధనరాసులకై పరితపించుట. పుట్టుచూ ఏడ్చావు చాలదా? ఏడుపును జీవిత మంతా కొనసాగించాలా? తినుటకు, ఏడ్చుటకు కాదుకదా పుట్టింది. ఏడ్పును పోగొట్టుకొనుటకు పుట్టావు. ఏడుపు మన స్వభావమూ కాదు, మన స్వరూపమూ కాదు.

జీవితమంతా శాంతిగా, సంతోషంగా వుండాలని కోరు ప్రతి వ్యక్తీ కొన్ని మార్గదర్శక సూత్రాలను పాటిస్తే అవి మనసుకు శక్తివంతమైన టానిక్‌లో మంచి ఫలితాలు ఇవ్వగలవు. మనమేమీ తేలేదు. ఏమీ సృష్టించలేదు పోయిందనటానికి. మనం ఏమి తీసుకున్నా ఇక్కడి నుంచే తీసుకొన్నాము. మనము ఏమి ఇచ్చినా ఇక్కడినుంచే ఇచ్చాము. ఈ రోజు ఏది మనదో నిన్న అది మరి ఎవరిదో, ఎల్లుండి ఇంకెవరిదో. ఈ పరివర్తన సమాజంలో సహజమైనది. ఇట్టి సహజమైన పరివర్తనను గురించి యథార్థ విషయము గ్రహించిన వాడికి ఏడుపు రాదు. దుఃఖం కలుగదు.

అట్టి ఏడుపురాని స్థితిని స్థితప్రజ్ఞ లక్షణము అంటారు. అట్టి స్థితి సర్వులకూ కలగాలని ఆశిస్తాము.

# 47) పైసా ఖర్చు లేకుండా పరమాత్మను పొందుతాం

ఆ గుడి, ఈ గుడి, ఈ దేవుడు, ఆ దేవుడు అక్కడ ఇక్కడ అని అంతటా తిరిగినా దుర్గుణాలకు తిలోదకాలు ఇవ్వనిచో, సద్గుణాలను కలిగియుండనిచో సత్ఫలితాలు శూన్యము.

ఒక వ్యక్తి మరో వ్యక్తికి 10వేల రూపాయలు ఇచ్చెను. తీరా అతను దానిని పరిశీలిస్తే అవి చెల్లని నోట్లు. దానివలన అతనికి ఎట్టి ప్రయోజనము లేకపోయెను. సద్గుణాలు లేని పూజలు, వ్రతాలు, హోమాలు, ధ్యానాలు, జపాలు, పారాయణాదులు పూర్ణ ఫలితమును ఒసంగజాలవు.

డాక్టర్ రోగిని పరీక్షించి-నీ జబ్బు చాలా తీవ్రమయినది. నీవు ఈ మందులు వాడుచుండుము కాని గోంగూర తినవద్దు, ఆవకాయ వాడవద్దు, వంకాయను వదులుకో, మద్యము మానుకో అని పథ్యము యొక్క లిస్టు రోగికి అప్పగించినారు. మందు తింటూ పై చెప్పిన పథ్యమును అవలంబించనిచో జబ్బు తగ్గుటకు బదులు హెచ్చు అయ్యే అవకాశము గలదు.

ఈ విషయమును గురించి భగవంతుడు భగవద్గీత 11వ అధ్యాయము చిట్టచివరి శ్లోకము ద్వారా వివరించెను.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ. (గీత-11-55)

"ఓ అర్జునా! నీవు కర్మయోగము, ధ్యానయోగము, జ్ఞాన యోగము, భక్తియోగము మొదలగు ఏ యోగములు చేసినను

ణికోట్లపై వైరమును, ద్వేషమును, క్రూరత్వమును వదలి ప్రేమ,
య, కరుణ గలిగి యుండవలెను" అని సెలవిచ్చిరి.

దీనినిబట్టి సద్గుణాలు లేనిచో భగవంతుడు మన నైవేద్యా
కు, పూజలకు, పుష్పాలకు, కొబ్బరికాయలకు, పాదయాత్రలకు,
ందుపులకు, దక్షిణాలకు ప్రాధాన్యత ఇవ్వరని తెలియుచున్నది.

"పూజలలో కెల్ల గొప్ప పూజ ఉపకారము చేయుట" అని ఒక
హనీయుడు సెలవిచ్చెను. కావున నీకున్నది నీవు తిను. కాని
విలో కొంతభాగము ఒక ప్రాణికి సహకరించుటకు ఉపయోగించు.
భమును దూరీకరించు. ఒకరి బాధను నీ బాధగా తలంచు.
వు సుఖంగా, సౌఖ్యంగా, సంతోషంగా, ఆనందంగా, శాంతిగా
ండాలను కొంటున్నావు. ఎదుటి వ్యక్తి కూడ అలాగే వుండాలని
ంక్షించు. ఇలా సద్గుణాలనే పూలతో పూజించు. అదే ఉత్తమపూజ,
శేషపూజ, అగ్రపూజ. దానికే అధిక ఫలితం, అనంతసుఖం , అట్టి
ద్గుణాలనే పూలతో మనమంతా భగవంతుని పూజించి దుర్గుణాలనే
గాళిని దులిపి దేహమనే దేవాలయమును పవిత్రంగా, ప్రశాంతంగా
ంచుకొందాం!

ఇట్టి పరమ పవిత్రమైన సద్గుణాలను అవలంబించుటద్వారా
రమాత్మను పొందుతాం. ఇట్టి ప్రయత్నమునకు పైసా ఖర్చు
కుండా ప్రయత్న లోపము లేకుండా ముందుకు సాగిపోదాం !
త్ఫలితాలు పొందుదాం!

# 48) మనస్సుకు మందులు

1. ధ్యానము, దానము, అనుష్ఠానము, ఆచరణ అలవరచు కుంటూ మంచి నియమాలతో మనిషి మనస్సు సాగిపోవాలి.
2. ప్రపంచములో బ్రతకడం ఒక వింతైన, విచిత్రమైన విషయము కాదు. కాని మన బ్రతుకు బండ కాకుండా భగవంతుని ప్రీతిని, ప్రేమను పొందు బ్రతుకు కావాలి.
3. తేనెటీగ పువ్వు యొక్క గంధాన్ని, సుకుమారాన్ని, రంగుని, ఆకారాన్ని ఏమి చెరపకుండా మకరందాన్ని మాత్రమే సేకరిస్తుంది, స్వీకరిస్తుంది. అలాగే నిజమైన జ్ఞాని సంఘాన్ని బాధించకుండ తన ధర్మాన్ని ఆచరిస్తూ సంఘమునకు తోడ్పడుతాడు. అట్టి జ్ఞాని యొక్క ప్రవర్తనను మనము అలవరచుకోవాలి.
4. ఏనుగు భారీగా, పెద్దదిగా వుంటుంది. వింత వింత చేష్టలు అది అప్పుడప్పుడు చేస్తూంటుంది. అందులో ముఖ్యంగా నెత్తిన మన్ను, దుమ్ము కొట్టుకుంటుంది. దానివలన ప్రక్కనున్న మరో జీవికి ప్రాణికి కళ్ళలో ఆ దుమ్ము పడి ఊపిరాడకుండా నష్టం, కష్టం కలుగుతుందిగదా? అదే ప్రకారంగా కొందరు చేసే ప్రతి పని ఇతరులకు కష్టనష్టాలను గలిగిస్తుంది. కాబట్టి అట్టివారికి దూరంగా యుండాలి.
5. చెట్టుకు అంటుకొని, తీగ ప్రాకుతుంది. అది అలా ప్రాకి, ప్రాకి పెరిగి చెట్టు కొమ్మలను వంచేస్తుంది. మానవునిలో దుష్ట స్వభావాలు కూడా అలాగే పెరిగి, పెరిగి మనిషి మనుగడను సర్వనాశనం చేస్తుంది. అంతా మునిగి మిగిలేది ఏమీ లేనప్పుడు అసలు విషయం తెలుసుకునేలోగానే కాటికి

పోయే సమయం ఆసన్నమౌతుంది. కాబట్టి కాలయాపన చేయక జనులు తమ మనస్సును శుద్ధ పరచుకొనుటకై యత్నించాలి. అజ్ఞానముచే తెలియక చెడు కార్యాలు చేసి, తదుపరి పశ్చాత్తాపముతో పరితపించి చేసిన తప్పులు దిద్దుకొని సన్మార్గములో పయనించువాడు మేఘాల నుండి వెలికి వచ్చిన చంద్రునిలా ప్రకాశించగలడు. రత్నాకరుడు రకరకాల పాపకార్యాలు చేసిన ప్పటికి అతడు తన హృదయమును పరిశుద్ధమొనర్చుకొని "వాల్మీకి" అను నామధేయముతో నేడు ప్రాతఃస్మరణీయుడై అందరి మనస్సు లలో ఆరాధించబడుచున్నాడుగదా! కాబట్టి మానవుడు తెలియక చేసిన పాపమును గురించి ఆవేదనతో కాలమును వ్యర్థము చేయుటకంటే వివేకముతో, విజ్ఞానముతో పాపమును కడుగుకొను మార్గములనన్వేషించి పుణ్యమార్గము ద్వారా పునీతుడు కావాలి.

ఇట్టి సుగుణములే మనస్సుకు బలమైన మందులు. ఇట్టి మందులను మహాత్ములు సేవించి మనందరిని సేవించమని ఆదేశిస్తున్నారు.

కావున మనము వాటిని సేవించి చిత్తశుద్ధిని బడసి ధన్యులమయ్యెదముగాక!

# 49) గోవులు - గోపాలుడు

కొందరి మాటలు ముల్లులై ఎదుటివారి మనస్సును చిల్లులుగా తూట్లు పడునట్లు యుండును. అట్టి గాయాలకు 'ప్రేమ' అను రెండక్షరములతో కూడిన మందు వాడినచో వెంటనే ఆ గాయము నయమగును. భగవంతుడు దయామయుడు, ప్రేమమయుడు, కరుణామయుడు వారి మాటలు ఇంపుగను, సొంపుగను, సౌమ్యముగను, మృదువుగను, మధురముగను వుండి ప్రతి మాటయు ఎంతో అంతరార్థముతో కూడుకొని యుండును.

ఒకనాడు బాలకృష్ణుడు తల్లియగు యశోద చీరకొంగు పట్టుకొని లాగుతూ "అమ్మా! ఈ రోజు గోపాలురతో గోవుల వెంట అడవులకు వెళ్తా" నన్నాడు.

అందులకు యశోద "నాయనా! అడవులంటే సామాన్యంగా భావిస్తున్నావు. అడవులు రాళ్ళు, రప్పలు, పురుగులు, తేళ్ళు, పాములు మొదలగువాటితో నిండి యుండును. ఈ రోజు నీకు చెప్పులు కుట్టిస్తాను అవి ధరించి రేపు అడవికి గోవులతో వెళ్ళు నాయనా! " అని తల్లి చెప్పెను.

"అమ్మా! మన గోవులు చెప్పులు లేకుండా అడవిలోకి రోజూ పోవుచున్నవే! వాటికి చెప్పులు కుట్టించి పంపాలని ఎవరూ ఆలోచించుటలేదే!" అని బాలకృష్ణుడు చమత్కారముగ, ముద్దుగ తల్లితో పలికెను.

"అవి పశువులు గదా, నాయనా!" అని తల్లి జవాబిచ్చెను.

"అమ్మా! అవి పశువులైనా తమ ఆహారాన్ని పాలుగ మార్చి మనకిస్తున్నాయి. వాటికున్న కృతజ్ఞతాభావము మానవులలో లేకున్నది. నేను ఒక్క దినము గోవులను చూడకపోయినా అవి

కన్నీరు కారుస్తాయి. నావైపు చూస్తూ వుంటాయి. దూడలు కూడ పాలు తాగుతూ నా శబ్దము విన్నంతనే పాలు త్రాగుట మానేసి నావైపు చూస్తుంటాయి.

గోవులు చెప్పులు లేకనే అంతటా సంచరిస్తూంటాయి. అవి లోకానికి ఎంతయో ప్రయోజనమును కలుగజేస్తూంటాయి. పరోపకారము గావిస్తుంటాయి " అని గోవులలోని గొప్పతనాన్ని బాలకృష్ణుడు తన ముద్దు మాటలతో తల్లికి వివరిస్తూ తద్వారా మనందరికి చక్కటి బోధ చేసెను.

# 50) మహాత్ముల అడుగుజాడలలో పయనిద్దాం

లోకమున జనులు పలువిధములగు మనస్తత్త్వములు గలిగియు డినను వారిని ఐదు తరగతులుగ విభజించవచ్చును.

## మొదటితరగతివారు

సత్కార్యములను ప్రారంభించి తాను సంకల్పించిన ఆ పవిత్రకార్యమును ఆచరించుటలో అనే విఘ్నములు ఎదురైనను దృఢమైన వజ్రతుల్యముగ ధైర్యసాహసములతో ముందుకు కొనసాగుచు కార్యమును పూర్తి చేయనిదే విశ్రాంతి నొందరు.

## రెండవ తరగతివారు

జప, ధ్యాన, ధర్మ, పరోపకారాది కార్యములను ప్రారంభిం మధ్యలో ఏవైనా విఘ్నములు తటస్థించినచో ఆ కార్యములన విరమించివేయుదురు.

## మూడవ తరగతివారు

తాము సంకల్పించిన సత్కార్యములను చేయదలంచియు రేపు, రేపు అని వాయిదా వేయుచు కార్యమునకు కాలదోషమును పట్టించుచు అమూల్యమగు కాలమును వ్యర్థము చేయుచుందురు.

## నాల్గవ తరగతివారు

సత్కార్యములను గూర్చిన సంకల్ప మాత్రముతోనే తృప్తిప డుచుందురు. వారు గాలిలో మేడలు కట్టుదురు. అంత మాత్రమేకాని కార్యమును ప్రారంభించుట గాని, ప్రారంభించవలె నని ఉద్దేశించుటగాని కలిగియుండరు. మాటలతోనే తృప్తిచెంది సంతోషించెదరు.

ఐదవ తరగతివారు

తాము సత్కార్యములు ప్రారంభించకపోగా ఎదుటివారు చేయు చుండినచో వారిని జూచి హేళనచేయుచుందురు.

ఈ ఐదు తరగతివారలలో మొదటి తరగతివారే మహాత్ములన బడుదురు. వారు దుఃఖమునందు సంతోషమును, ఆపత్తునందు ధైర్యమును, దూషణయందు భూషణమును, చెడ్డయందు మంచిని గ్రహించుటయేగాక శీతోష్ణ సుఖదుఃఖములకును, మానావమానముల కును, అతీతులుగను, సాక్షిభూతులుగను వ్యవహరించెదరు. ప్రపంచ జనులలో కొందరు వారిని గూర్చి ఎట్టి దురభిప్రాయమును వెళ్ళబుచ్చినను, వారు సత్యమందే స్థిరప్రతిష్ఠ గలిగి-

"కొందరే సత్యమెరుంగుచుందు రిలను
కాని తక్కినవారలు ఘనుడ నిన్ను జేరి
నవ్విన లక్ష్యంబు చేయబోకు"

అను వివేకానందుల వాక్యానుసారము జనుల నిందాస్తుతులను లక్ష్యపెట్టకనుందురు. వారు అజ్ఞానాంధకారమును పటాపంచలు చేసివైచి, జ్ఞానజ్యోతియై ప్రకాశించుచు, అనేక భౌతిక, ఆధ్యాత్మిక శక్తులను కరతలామలకము చేసికొని ఈ అనంత విశ్వమందు ఆనందపరవశులై సంచరించెదరు. అయినను

అద్వైతం త్రిషులోకేషు
నాద్వైతం గురు సన్నిధౌ.

అద్వైతమును మూడు లోకములలో ప్రదర్శించవచ్చునుగాని గురుసన్నిధి యందు మాత్రము ప్రదర్శించరాదను వాక్యమునకు బద్ధులై వారు తాము ఎంత ఉన్నత స్థానము నధిష్ఠించినను గురు వాక్యమును తు.చ. తప్పకుండా ఆచరించుచు గురుసన్నిధియందు

వినయ విధేయులై పరిపూర్ణ గురుభక్తిని కలిగియుందురు. మహాత్ములు ముందు తాము ఆచరించి తరించి తదుపరి మానవాళిని తరింప చేయుటకు ప్రయత్నించెదరు.

సూదంటు రాయి సూదులను ఆకర్షించిన విధముగ మహాత్ము నాస్తికులను సహితము తమవైపునకు ఆకర్షించుకొని తరింపచే దురు. బుద్ధభగవానుడు, రామకృష్ణ పరమహంసాది మహనీయు ఈ ప్రకారముగనే ప్రపంచమున ఆధ్యాత్మిక జ్ఞానజ్యోతిని వెలి చగలిగిరి. ఇట్టి ప్రయత్నములో వారు ప్రతిబంధములను లె చేయక జ్ఞానప్రబోధమునే దృష్టిలో ఉంచుకొని అనంత సం సాగరమును తాము అవలీలగ దాటివైచి ఇతరులను దాటింపజేసి అట్టివారే మహాత్ములు.

ప్రతివారును తామిప్పుడున్న స్థితిని బాగుగ పరిశోధించుకొ మహోన్నతమగు మహాత్ముల స్థితికి చేరుటకై అనవరతము ప్రయ త్నము సల్పుచు మానవ జీవితమును ఫలప్రదము గావించుకొనవలెను

# 51) వేదాంతభేరి చదువుచున్నారా?

వే లకొలది ఉపమాన ఉపమేయములతో

దాం తి శాంతులను వెదజల్లుచు

త గ్గదల లేక దినదినాభివృద్ధి నొందుచు

భే షుభేషు అని వేలకొలది భక్తులచే ప్రశంసించబడుచు

రి క్క (నక్షత్రము) వలె ఆధ్యాత్మిక గగనవీధులలో సంచరించుచు

చ దివిన వారికి ఇంపు గలిగించి మరల మరల చదువవలెనెడి ఉత్సాహము రేకెత్తించుచు.

దు ర్మార్గులు కూడ సన్మార్గులు కావచ్చునని శపథము చేయుచు

వు త్తమ లక్షణములను ఎట్లు అలవఱుచుకొనవలెనో మరియు అట్లు అలవఱుచుకొనినచో కలుగు ప్రయోజన మేదియో తెలుపుచు

చు క్కలవలె గనుపించు సూక్ష్మాతిసూక్ష్మములైన ఆధ్యాత్మిక రహస్యములను బట్టబయలు చేయుచు

న్నా మస్మరణ ఇత్యాది ద్వైతమునుండి తత్త్వమసి మొదలగు అద్వైతము వరకును గల పారమార్థిక తత్త్వమును బహిర్గత మొనర్చుచు

రా జవిద్యయగు బ్రహ్మవిద్యను గ్రామగ్రామమున మూలమూలన చాటుచున్న ఈ వేదాంతభేరి మాసపత్రికను ముముక్షుకోటి, భక్తకోటి చదివి ఆధ్యాత్మికోన్నతిని, పరమశాంతిని బడయుదురుగాక!

# 52) దేవుని గురించి...

దేవునియొక్క స్వరూపమెట్టిదని ప్రశ్నించువారు అనేకమంది యుంటారు. ఈ కనుపించు సూర్యచంద్రాదులు, నక్షత్రములు, గ్రహములు వెయ్యేల చరాచర ప్రపంచమును పరిపాలించు మహత్తర మైన శక్తి ఒకటి వుండి తీరాలి! ఆ శక్తియే దేవుడంటారు ఆస్తికులు. అట్టి శక్తిని ప్రకృతి (Nature) అంటారు నాస్తికులు. పేరేదైనా కానివ్వండి సృష్టి కనుపిస్తుంది. కావున సృష్టికర్త ఒకరుండాలని నిర్ణయానికొచ్చారు చాలామంది.

ఆ సృష్టికర్త ఎందుకు కనుపించలేదంటారు మరికొంతమంది- వారు కనుపించనవసరము లేదంటారు మహాత్ములు. కరెంటుకు సంబంధించిన ట్రాన్సుఫార్మర్ ఎక్కడో వుంటుంది. అది మనకు కనుపించదు. కనుపించనవసరము లేదు. అది అక్కడ నుండి విద్యుత్ పంపుతుంది. తద్వారా మన ఇంటిలో లైట్స్ వెలిగి చీకటి పోతుంది. అలాగే సృష్టికర్తయగు భగవంతుడు మన బాహ్యనేత్ర ములకు కనుపించనవసరములేదు. వారు వున్నచోటునుండి ఈ సృష్టిక్రమమును చక్కగా, సవ్యంగా నడిపించగల సమర్థులు. వారి సంకల్పముచే వారి పరివారమగు సూర్య, చంద్ర, నక్షత్రాది గ్రహాలు వారు నిర్దేశించిన కార్యక్రమములను తు.చ తప్పకుండా పాటించి అమలు పరచుచుందురు.

వేరొక దృష్టితో ఆలోచిస్తే భగవంతుడు మన వెంట మన ఇంట, మన చెంతనే వుండి మనము చేయు ప్రతి పనిని సాక్షిగ చూస్తున్నారు. కావున మంచిపనులే చేయాలి, మంచిగనే మాట్లాడాలి, మంచిగనే వుండాలి, మంచినే పెంచుకోవాలి. ఎవ రిపైన ద్వేషము, అసూయ, అపకారాదులు తలపెట్టరాదు. ఎవరిని

హింపించరాదు, బాధించరాదు. చేతనైనంత ఉపకారం చేయాలి. ఉపకారము చేయలేకపోతే ఊరికే ఉండుట కూడా ఒక విధముగ ఉపకారము చేసినట్లే (అపకారము చేయకుండుట ఒక విధముగ ఉపకారము చేసినట్లే.)

బాహ్యనేత్రములకు కనుపించక నిరాకారంగా అణువణువునా వ్యాపించియున్న భగవంతుడు మనము చేయు ప్రతి పనిని సాక్షిగ వీక్షిస్తున్నారని యెరింగి అత్యంత జాగరూకతతో వ్యవహరించవలెను. అప్పుడే మరుజన్మ శుద్ధముగ, శుభ్రముగ వుండగలదు. లేక జన్మరాహిత్యము కలుగగలదు. అలా కానిచో అశాంతి అనే గోతిలో పడి అలమటించవలసిందే. తద్వారా అమూల్యమైన మానవజన్మను మంటకలపవలసివచ్చును.

కావున భగవంతుని ప్రార్థిస్తూ, పూజిస్తూ, ఆరాధిస్తూ, ధ్యానిస్తూ, దయ, కరుణ, ప్రేమ, అహింస మొదలగు సుగుణములు గలిగినవారే భగవదనుగ్రహమునకు పాత్రులై శాంతిసుఖములతో విరాజిల్లుదురు. మనము కూడ అట్టి ప్రయత్నములో ముందుకు పోదాం!

# 53) ధనము...

డబ్బు, డబ్బు అని కలవరిస్తూ పరంధామయ్య కోట్లాది రూపాయలు సంపాదించాడు. అప్పటికి ఆ వ్యక్తికి 50 సంవత్సరాలు.

బాల్యస్నేహితుడగు వీరబ్రహ్మం ఒకనాడు ఆ కోటీశ్వరునింటికే తెంచాడు. ఎయిర్ కండిషన్డ్ రూపములో కుషన్‌బెడ్‌పై మూలుగుతూ కనుపించాడు ఆ కోటీశ్వరుడు. "ఎందుకయ్యా! ఏడుస్తున్నావు? మూలుగుచున్నావు. దిగులుతో దుఃఖసాగరంలో వున్నావు? నీ పేరుకు అదనంగా కోటీశ్వరుడు అనే బిరుదు సంపాదించావు, కోట్లు గడించావు. సమస్త భోగభాగ్యాలతో, సుఖసంతోషాలతో ఆనందంతో, ఆరోగ్యముతో, ఆహ్లాదముతో, కళకళలాడుచుందునని లోగడ నీవు ఊహించావు-గుర్తుందా?"

నీ ఊహలు, ఏమయ్యాయి? డబ్బే సర్వస్వమని, డబ్బుంటే సర్వం కొనవచ్చునని ఈ ప్రపంచంలో డబ్బుతో సాధించలేనిది, అసాధ్యమైనదేదీ లేదని ప్రగల్భాలు పలికితివిగదా? ప్రస్తుతము నీ పరిస్థితి చూస్తుంటే జాలేస్తుంది.

కోట్లు సంపాదించావు. ఆరంతస్తుల ఇల్లు కట్టావు. మొత్తము ఏ.సి. చేశావు. డజను కార్లు కొన్నావు. వందమంది పరిచారకులు ఇంటినిండా వున్నారు. కాని నీ బాధను తొలగించువారు లేకపోయిరి. ఈ బాహ్యావస్తువులు ధన,కనక, ఐశ్వర్యాలు, అధికారాలు, ఎన్ని వున్నను మనకు కొంతవరకే సహకరిస్తాయని ఇప్పటికయినా గుర్తుంచుకో!

**ధనముతో** పడక కొనగలవు కాని నిద్రను కొనలేవు.
వైద్యుని కొనగలవు కాని ఆరోగ్యమును కొనలేవు

డబ్బుతో కంటి అద్దములను కొనగలవు కాని చూపును కొనలేవు.

మందులను కొనగలవు కాని ఆయుస్సును కొనలేవు.

ప్రపంచమును కొనగలవు కాని శాంతిని ప్రసాదించే భగవంతుని కొనలేవు.

ఈ సత్యమును ఇప్పటికయినను గ్రహించగలిగితే ధన్యుడవు అని బాల్య స్నేహితుడు ధనికునకు వివరించాడు. ధనికునకు కనువిప్పు కలిగించాడు.

ఎన్ని వందల వేల కోట్లు సంపాదించినను అవి కాటికి పోవువాని వెంటరావు. అతనిని ఆదుకోలేవు. ఆయుస్సును పెంచలేవు. కావున కాలము అత్యంత విలువైనది. అమూల్యమైనది. గడచిన కాలమును కోట్లతో కొనలేము. అట్టి కాలమును అనవసర పనులకు వెచ్చించక ఇహపరములకు ఉపయోగపడు కార్యక్రమములకు ఉపయోగించుట వివేకవంతుని లక్షణము. అట్టి వివేకవంతుని జాబితాలో మనం కూడా చేరి జీవితపరమావధియగు మోక్ష సామ్రాజ్యమును బడయుటకు శక్తివంచన లేకుండా కృషి చేద్దాం. మన కృషికి భగవంతుని సహాయ సహకారాలు వుండుననుటలో సందేహము లేదు.

# 54) పండుగల అంతరార్థం

శాస్త్రములు, పెద్దలు, ఋషులు, మహాత్ములు దేనిని ఆచరించమని ఆదేశించారో అందులో ఎంతో నిగూఢమైన అంతరార్థము ఇమిడియున్నది. దాని బాహ్యార్థమునే పట్టుకొని అంతరార్థమును అణగద్రొక్కుచున్నారు. ఉదాహరణకు కొన్ని తెలుసుకుందాం.

పండుగలు వస్తే ఇల్లు, శరీరము శుభ్రపడును. అవి ఎలాగో విచారిస్తాం. ఇంటిని అన్ని విధాలా శుభ్రపరుస్తారు. ఇంటిలోని దుమ్ము, ధూళి, బూజు, పురుగులు మొదలగు అనారోగ్యము కలిగించువాటిని నిర్మూలిస్తారు. సున్నం కొడతారు. తద్వారా ఆరోగ్యమునకు అవసరమైన అన్ని ఏర్పాట్లు మనకు తెలియకనే జరిగిపోతాయి.

ఇంటితోపాటు దేహమునుకూడ శుభ్రపరుస్తారు. అనగా తలంటుస్నానము చేసి చక్కటి నూతన వస్త్రాలను ధరిస్తారు. పండుగలు అనే పేరు లేకపోతే ఈ పనులు చేయుటకు బద్ధకిస్తారు. రేపు పనిని వాయిదాలు వేస్తూ పోతారు. అప్పుడు పరిసరములు అపరిశుభ్రత చెంది వ్యాధిక్రిములు విజృంభించి మానవుని మనుగడకే ప్రమాదమును తెస్తాయి. పండుగల వలన అట్టి విరుద్ధచర్యలు నిరోధింపబడి అనేక ఉపయోగాలు మానవులు పొందుతున్నారు. ఇక మరొకటి-

**ఉపవాసము:** ఉపవాసం చేస్తే మంచిదన్నారు పెద్దలు. పుణ్యం వస్తుంది అన్నారు మరికొందరు. ఆ మాటలు విశ్వసించి చాలమంది ఉపవాసం చేస్తుంటారు. పుణ్యంతోబాటు ఉపవాసం వలన శరీరమను యంత్రమునకు కాస్త విశ్రాంతి లభిస్తుంది. అట్టి యంత్రములో జీర్ణముకాక వున్న పాత స్టాకు జీర్ణమగుటకు

అవకాశము ! ఇ్ుతుంది. తద్వారా యంత్రము చక్కగ, చురుకుగ తిరిగి బాగా నిచేయుటకు వీలుంటుంది.

ఈ విధంగా పూర్వీకులు, ఋషులు మా.వుని శ్రేయస్సుకోరి ఇట్టి చక్కటి ఆచారములను ఎన్నియో ప్రవేశపెట్టి మానవునికి మహోపకారము చేసిరి. వాటిని ఆచరణయందుం.. సత్ఫలితాలను పొందుతాం!

# 55) బుద్ధుని గురించి తెలుసుకుందాము

## a) బుద్ధుని నిరాడంబరత్వము

ఎందరో మహానుభావులు అందరికి వందనాలు అంటుంటారు పెద్దలు. అట్టి మహానుభావుల లిస్టులో గౌతమ బుద్ధుడు ఒకరు. అట్టి మహానుభావులను మరచిపోలేము.

2,500 సంవత్సరములనాటి బుద్ధుని గురించి ఈ రోజు కూడ మనము మననము చేసుకొంటున్నాము. ఈ మహానుభావుని దివ్యసందేశములు మన చెవులలో మ్రోగుచున్నవంటే వారు వేసిన పునాది చాలా బలమైనది.

ప్రతిరోజు బుద్ధ భగవానులు భక్తికోటికి దివ్యమైన ధర్మబోధ గావించుచుండెడివారు. ఇసుకవేస్తే రాలనంత భక్తకోటి వళ్ళంతా చెవులు చేసుకొని వారి బోధలు వినుచుండెడివారు.

పక్షులు సహితము వారి దివ్య సందేశము ఆలకిస్తున్నట్లు గోచరించుచుండెడిది. ఇలా రోజులు సాగిపోతుండెను. ఇలా రోజులు సాగిపోతుండెను. ఒకానొక రోజు విశేషమేమంటే భగవానులు విశ్రాంతి తీసుకొనదలంచి వారి శిష్యులలో ఒకరికి ఆనాటి ప్రబోధనా క్లాసు అప్పగించిరి.

భక్తులు భగవానుల రాకకొరకు నిరీక్షించిరి. కాని భగవానులు రాలేదు. శిష్యుడు వచ్చి విషయము వివరించి తన ప్రసంగమును ప్రారంభించెను. ఆ ప్రసంగము ఇలా సాగిపోవుచుండెను.

"బుద్ధభగవానుని వంటి మహానుభావుడు త్యాగి, యోగి, సన్న్యాసి, తపస్వి, అనుష్ఠానపరుడు, ఆచరణలో అగ్రగణ్యుడు ఈ లోకంలో ఇంతకుముందు పుట్టలేదు. ఇకముందు పుట్టబోడు.

ఈ విషయమును మీరంతా గుర్తుంచుకొండి" అన్నాడు. ఈ వాక్యాలు విన్న భక్తులు హర్షధ్వానాలు చేశారు, చప్పట్లు చరచారు. లోపల విశ్రాంతిలో వున్న బుద్ధ భగవానులు మెరపువలె వేదిక వద్దకు వచ్చి "ఆగండి, ఆగండి" అన్నారు! అంతా ఆశ్చర్యముతో ఉండగా, నిశ్శబ్దము అలుముకొంది. ఇంతవరకు తనను గురించి వివరించిన ఆ శిష్యునితో ఇలా అన్నారు.

బుద్ధుడు- నాయనా నీకెన్నేళ్ళు?

శిష్యుడు- నలభై సంవత్సరాలు.

బు- నీవెంత దేశం తిరిగినావు?

శి- కురు, పాంచాలం, అవంతి మొదలగునవి.

బు- అంతేనా ఈ లోకమంతా చూశావా?

శి- చూడలేదు. ఇంతకన్నా ఎక్కువ తెలియదు.

బు- నలభై ఏండ్లకు పైన నీకేమైన తెలుసా?

శి- తెలియదు.

బు- భవిష్యత్తు నీకు తెలుసా? రేపు జరుగబొయ్యేది చెప్పగలవా?

శి- తెలియదు.

బు- అలాంటప్పుడు నీవు బుద్ధునిలాంటి గొప్పవాడు ఇంతవరకు పుట్టలేదు.

ఇకముందు పుట్టబోడు అని ఇంతమంది సమక్షములో ఎలా చెప్పగలిగావు. జరిగినది తెలియదు, జరుగబోవునది తెలియదు. జరుగుతున్నది కూడా తెలుసుకోలేదు. అలా ఎప్పుడు చెప్పవద్దు. ఎందరో మహానుభావులు పుట్టి వుంటారు. ఇంకా పుడతారు. మనకు తెలిసిందే చెప్పాలి. తెలియనివాటి జోలికి ఎప్పుడు పోరాదు

అని శిష్యుని మందలించిరి.

బుద్ధ భగవానులు తమ జీవితములో నిరంతరము నిరా డంబరమునకే ప్రాధాన్యతి ఇచ్చి తాము తరించి ఇతరులను తరింపజేయుటకు అనేక ధర్మ రహస్యాలను ప్రబోధించిరి.

## b) ఒక పండితుడు బుద్ధ భగవానులతో వాదనకై ఆత్రుతపడుట

బుద్ధభగవానులు ధర్మబోధ గావిస్తుండగ ఒకనాడు శ్రోతల మధ్యనుండి ఒక పండితుడు లేచాడు. ఆయన ఆకారము చూస్తే శాస్త్రాలు చదివి చదివి శిష్యులకు బోధించి తల పండిపోయినట్లు గోచరించాడు. అపుడాతడు "గౌతమా! నీతో వాదించటానికి వచ్చాను. నేను ఓడితే నా మూడువందల మంది శిష్యులతో మీ బౌద్ధమతంలో చేరుతాము. తమరు ఓడిన పక్షమున మీరు మా మతము లోనికి రావాలి" అన్నాడు.

అపుడు బుద్ధుడు ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను–

"ఈ భూగోళం మీద మనిషి జీవితం చాలా స్వల్పం, స్వల్పమే కాదు అల్పం, అల్పమే కాదు అణువుతో సమానమైనది. ఈ అణువు అనంతములో నిలిచేది క్షణం. ఇది కాలసాగరంలోని నురుగులోపడి అటు ఇటూ తూలుతూ వున్నది. ఎప్పుడు నురుగు నుగ్గయిపోతుందో ఈ లోగా తాము చేయవలసిన కర్తవ్యమేమిటో ఆలోచించక తర్జనలు, భర్జనలు, వాదాలు వివాదాలు దేనికి– తనను గురించి తాము ముందుగ తెలుసుకొనవలెను. తదుపరి ఇతరులను గూర్చి తెలుసుకొనవచ్చును. ఎందుకా ఆవేశం? ఏం తెలిసిందని? ఎన్నడైనా ప్రక్కవారు బాధపడుతుండగ చూచి సాయం చేశారా?

ఆకలితో అలమచింటు ఒక ప్రాణికి అన్నంపెట్టి ఆదుకొన్నారా? కోరికలను చింపుకొన్నారా?

ఒక్క అడుగులో భూమండలాన్ని ఆక్రమించాలనే ఆశ, ఈ విశ్వంలో తనకన్న మిన్న ఎవరూ ఉండరాదన్న ఊహ ఎందుకు కలుగుతుంది? ఇట్టి ప్రయత్నాలలో మునిగి వుండగనే పిల్లవాని చేతిలోని గాలిపటం తెగిన రీతిగ జీవితం తెగిపోతుంది. ఆటబొమ్మ పగిలిన రీతిగ స్థూల శరీరం పగలటం చేరవలసింది చెందవలసింది అంతా తారుమారై అయోమయములోపడి అల్లాడిపోవడం తిరిగి మరో జన్మనెత్తడం, ఓ పండితుడా! ఇదంతా ఏమిటి? దేని కొరకు?"- అని ప్రవాహంలో సాగిపోతున్న ఆ ధర్మబోధ శ్రోతలు వళ్ళంతా చెవులు చేసుకొని వింటున్నారు.

భగవానులు మాట్లాడుతున్న తీరు ఆ పద్ధతి అనర్గళమైన ఆ ప్రవాహములాంటి ధోరణి-ఉచ్చారణ ఆ శాంతం చూచి అడగ వలసిన పండితుడు అడగలేక మారు మాట్లాడలేక భగవానుల పాదాలపై బడి "స్వామీ! నేను నా శిష్యులతో మీ మతంలోకి చేరుతున్నాను. దాసోఽహం" అన్నాడా పండితుడు.

ఈ విధంగా భగవానులు తమ బోధలచే అనేకమంది ఉద్దండు లను ఆకర్షించారు. అందులో చక్రవర్తులున్నారు, రాజులున్నారు, సాధువులు ఉన్నారు, పండితులున్నారు, సామాన్యులున్నారు, అంబ పాలి, కశ్యపుడు మొదలగువారున్నారు.

బుద్ధభగవానులు అన్ని వుండి త్యజించి వచ్చిన చక్రవర్తి, వారి వైరాగ్యం స్థిరమైనది. వారి మాటలలో ఒక ప్రత్యేక ఆకర్షణ గోచరించును.

నిండు యౌవనములో వుండి యువరాజు స్థానమును తృణీ కరించి, సుందరమైన భార్యను, సుపుత్రుని కూడ వదలుకొని

నిర్వాణమను స్థితిని బడసిన మహనీయుడు. కావుననే అవతార
ర్తిగ భావించి "బుద్ధభగవాన్" అని నేటికిని స్మరించుచున్నాము

## c) బుద్ధ భగవానులు 'సుదత్తు' అనే వ్యక్తిని భక్తునిగ మార్చుట

సుదత్తుడనే వ్యక్తికి భక్తులంటే, పెద్దలంటే గిట్టేది కా
ఒకనాడు సుదత్తుడు తన స్నేహితుని కలుసుకొనుటకు వెళ్ళాడు
ఆ స్నేహితుడు సుదత్తునికి ఎప్పుడు స్వాగతము చెప్పి అ
మైన మర్యాదలు చేసెడివాడు. కాని ఈసారి ముక్తసరిగ మాట్లా
"విశ్రాంతి తీసుకో, తదుపరి మాట్లాడుకుందాం!" అని వెళ్ళిపో
రాత్రికి వచ్చాడు.

రాత్రి తిరిగివచ్చి ఆ స్నేహితుడు "ఈ రోజు నీతో సరి
మాట్లాడుటకు తీరికలేకపోయింది. కారణము రేపు బుద్ధ భగవా
నులకు ఆతిథ్యమిస్తున్నాను. ఆ పనిలో మునిగిపోయివున్నాను" అ
చెప్పాడు.

సుదత్తుడు అంతకుపూర్వము భగవానుల గూర్చి విన్నాడేగాని
వారిని చూడలేదు. "మిత్రమా! వారిని గురించి నాకు
సదభిప్రాయములేదు" అన్నాడు.

"అయితే రేపు వారిని దర్శించు తదుపరి నీ అభిప్రాయము
తెలుపుము" అని స్నేహితుడు ముక్తసరిగ చెప్పి నిద్రకు ఉపక్రమిం
చాడు.

కాని సుదత్తునకు భగవానులను తొందరగా చూడాలి, మాట్లా
డాలి, వారిని పరీక్షించాలి- అనే ఆత్రుత అధికమైనది. వెంటనే

రాత్రికి రాత్రే భగవానులను చూడాలని బయలుదేరాడు.

సరాసరి భగవానుని ఆరామానికి చేరాడు. భగవానుడు గుమ్మం ముండే "రా! నాయనా! సుదత్తా! నన్ను పరీక్షించాలనే ఆత్రుతతో, కుతూహలముతో, అంధకారముతో భయంకరముగా వుండు దారి కొంకా లేని ఈ ప్రదేశమునకు వచ్చినావంటే నీలోని జిజ్ఞాస, తపన నాకర్థమయింద" నెను.

సుదత్తునికి మతిపోయినట్లయింది. నాలోని ప్రతి విషయము వీరికెలా తెలిసింది: మారు మాట్లాడలేక భగవానులయొక్క వర్చస్సు, తేజస్సు, ఆ విశాల హృదయం శాంతి స్వరూపము చూస్తూ ముద్దుబారిన శరీరముతో అలా నిలబడి మాట్లాడలేకపోయాడు. అలా చాలాసేపు ఆలోచించి భగవానుల పాదాలపైబడి "స్వామీ! నా తప్పు క్షమించి, అనుగ్రహించండి. భగవాన్ మీరు నా భిక్ష స్వీకరించాలి. మీరు నా శ్రావస్తికి రావాలి, నేను ఏర్పాటుచేయు ఆశ్రమంలో ఉండాలి, నా సర్వస్వం మీకు ధారపోస్తాను" అని ఆహ్వానించాడు భగవానులను.

## d) జేతవన వృత్తాంతము

ఆ విధంగా భగవానుల శక్తిసామర్థ్యములను గ్రహించి భగవానులకు సర్వస్వం ధారపోసి వారికి ఒక ఆశ్రమం నిర్మించాలనే సంకల్పముతో స్థలసేకరణకు బయలుదేరాడు సుదత్తుడు.

భగవానులకు జేతవనం చాలా అనుకూలముగయుండునని అతనికి తట్టింది. వెంటనే జేతుని కలుసుకొని "మీ తోట నాకు అమ్ముతారా!" అని అడుగగా "నీవేమి వ్యాపారము చేయదలంచావు నా తోటలో" అని జేతుడు ఎదురు ప్రశ్న వేశాడు.

"లేదు, నేను వ్యాపారము చేయుటకు కాదు. నాకు జ్ఞానోపదేశ మును చేసిన బుద్ధ భగవానులకు ఒక ఆశ్రమము కట్టిస్తానని మాట ఇచ్చాను. అట్టి ఆశ్రమ నిర్మాణానికి ఈ జేతవనం సరియైనదని నాకనిపించింది" అన్నాడు.

ఈ మాటలు విన్న జేతుడు అమ్ముటకు ఇష్టములేక అమిత మైన ఎక్కువ ధర చెప్పినచో అతడే ఆశ వదలుకొని వెళ్ళునే అభిప్రాయముతో "నా స్థలం చాలా విలువైనది. నా స్థలం ఎంత కావలయునో ఆ స్థలము నిండా నాణ్యాలు పరచవలసిందే" అని అన్నాడు.

భగవానులకు తన సర్వస్వం ధారాధత్తం చేయుటకు కంకణము కట్టుకొన్న సుదత్తునకు భగవానులకు తగిన స్థలము దొరికిందన్న ఆనందముతో "అలాగే" అని తను దాచిఉంచిన తరతరాలనాటి నాణ్యాలను స్థలములో పరచాడు. జేతుని సమీపించి "ఆ స్థలము నిండా నీవు కోరినట్లు నాణ్యాలను పరచాను. ఆ నాణ్యాలను తీసుకొని స్థలము స్వాధీనము చెయ్యమని" కోరాడు.

సుదత్తుడు తన స్థలములో పరచిన నాణ్యాలను చూసి ఆశ్చర్య చకితుడై కళ్ళు చెదిరినవాడై "ఎవరో ఒక సామాన్యవ్యక్తి ఇన్ని కోట్ల నాణ్యాలను త్యాగము చేస్తున్నాడే ఇంకా కావాలంటే పరుస్తానం టున్నాడే" అని ఆలోచనలో పడ్డాడు జేతుడు. తనేదో తప్పుచేసినట్లు అతని హృదయం బాధపడసాగింది. అనుకున్న మాట ప్రకారము పైకము తీసుకొని ఆ స్థలము సుదత్తునికి స్వాధీనపరిచాడు.

## జేతవనములో భవన నిర్మాణము

సుదత్తుడు వందలాదిమంది కార్మికులతో రాత్రింబవళ్ళు కష్టపడి గాలి వెలుతురు సకల సౌకర్యములు గల భవనములు, కోనే

రులు, ప్రసంగ మందిరాలు, విశ్రాంతి మందిరాలు, ప్రహరీగోడలను నిర్మించసాగాడు.

## జేతుని మనస్సు మారుట

ఈ విధముగా సర్వాంగ సుందరంగా సుదత్తునిచే భవన నిర్మాణములు జరుగుచుండగ జేతునికి కాలు చేయి ఆడిందికాదు. అతని మథనమునకు అంతము లేకుండెను. ఆవేదనతో అలమటించి "తన స్థలమును ఒక పవిత్రమైన ఆశ్రమము నిర్మించుటకు ధారాదత్తం చేయవలసిన నేను కాసులకు అమ్ముటయా! అయ్యో! నేనెంత పాపము చేశాను. ఆ డబ్బు మొత్తము నేను బుద్ధునికే అర్పిస్తాను" అని సంకల్పించుకొనెను. ఆ తలంపుతోనే అతనికి ఎంతో శాంతి లభించింది.

## జేతుడు కూడ ఆశ్రమ నిర్మాణములో పాలుపంచుకొనుట

వెంటనే సుదత్తుని వద్దకు వచ్చి "నా తప్పు క్షమించు. నన్ను రక్షించు. ఆశ్రమ నిర్మాణములో నాకు కూడా అవకాశమిమ్ము. ఈ పుణ్యకార్యక్రమములో పాల్గొను మహద్భాగ్యం కల్పించు" అని ప్రాధేయపడెను.

ఈ విధంగా జేతుడు కూడ భగవానుని యొక్క శక్తిని గమనించినందులకు సుదత్తుడు సంతసించి ఇరువురును కలసి ఆశ్రమ నిర్మాణమును పూర్తిగావించి భగవానుల కంకితము చేసిరి. ఆ వనము జేతునిదగుటవలన దానికి జేతవనమని పేరు. అది అలాగే కొనసాగెను.

ఆ వనమునకు బుద్ధ భగవానుల రాకతో ఒక ప్రత్యేకత ఏర్పడి నేటికి ఆ వనము విశేష ప్రాముఖ్యత సంతరించుకొనియున్నది.

బుద్ధ భగవానులు ఆ వనమునందే ఎక్కువ కాలము గడిపినట్లు బౌద్ధ గ్రంథాలు తెలుపుచున్నవి.

## ఇ) అంబపాలి చరిత్ర

ఒకానొక రాజ్యములో అంబపాలి అను వేశ్యయుండెను. ఒక నాడు ఆమె తన ఆమ్రవనంలో తిరుగుచుండెను. అచట బుద్ధునిగాంచి "ఎవరు మీరు? ఇక్కడికెందుకొచ్చారు?" అని అడిగింది. భగవానులు వివరణ ఇచ్చారు. తదుపరి ఆమె "నిండు యౌవనములో ఉన్న మీరు సన్న్యసించుట యెందుకు? దానిలో గల మర్మమేమి? మీ రూపురేఖల్లో చాలా సౌకుమార్యం కనిపిస్తుంది. మీరు రాజవంశములోనివారుగ వున్నారు" అన్నది.

"ఎలా వున్నా నాశనం తప్పదుగదా? నన్నెవరని అడుగుచున్నావు. చెప్తాను విను. నాది కపిలవస్తు నగరం. నేను శుద్ధోదన మహారాజు కుమారుణ్ణి. నన్ను సిద్ధార్థుడంటారు. నేను ఈ భౌతిక వాంఛలకు దూరంగా వుండాలని బయలుదేరినాను. ఈ వ్యాధులకు, బాధలకు, ముసలితనానికి, మరణాలకు కారణం తెలుసుకోడానికి బయలుదేరాను" అన్నారు భగవానులు.

### అంబపాలి మనస్సు మారుట

ఈ మాటలు విన్న అంబపాలి మనస్సు భౌతిక సుఖాలు, సంపదలు, సంపాదనల నుండి ఒక్కసారి వెనుదిరిగింది. "ఇంత వరకు నేను ఎంతో పాపము చేశాను" అని బోరుబోరున ఏడ్చి "క్షమించండి ప్రభో" అని భగవానుల పాదాలపై వాలి "ప్రభూ! నా ఇంటిని పావనము చేయండి. నా భిక్ష స్వీకరించండి" అని ప్రాధేయపడింది.

భగవానులు ఆమె యొక్క పశ్చాత్తాపమును చూసి ఆమె మనస్సు కుదుటపరచుట కొరకు ఆమె ఇంట భిక్ష స్వీకరించుటకు అంగీకరించి బయలుదేరిరి. లోకులు కాకులు, యథార్థ విషయములకంటే కల్పితాలకు ప్రాధాన్యత ఇచ్చుట కొందరి సహజ వృత్తి.

## అంబపాలి ఇంట భగవానులు భిక్ష గురించి ప్రజల ప్రవర్తన

భగవానులు అంబపాలి ఇంటి భిక్ష స్వీకరించు విషయము ఊరంతా ప్రాకింది. "బుద్ధుడంతటి పవిత్ర హృదయుడు, తపస్వి, సన్న్యాసి, సాధువు ఒక వేశ్య ఇంట భిక్ష స్వీకరించుటయా? ఎంత దోషము, ఎంత తప్పు, ఎంత పొరపాటు, అసలు ఆమె గురించి బుద్ధునికైమైనా తెలుసా? తెలిసే అంగీకరించారా? తెలియక అంగీకరించారా? బహుశా తెలియకనే అలా జరిగి ఉండవచ్చును" అని వారి వారి ఊహలతో కొందరు బుద్ధని వద్దకేతెంచి అంబపాలిని దూషిస్తూ, ద్వేషిస్తూ, హీనంగా అంబపాలి చరిత్రను ఏకరువు పెట్టిరి. వారు చెప్పినదంతా సావధానంగా, శాంతంగా, గంభీరంగా విన్నారు భగవానులు అలా చెప్పుచుండినవారు చెప్పి చెప్పి భగవానుల సమాధానము కొరకు నిరీక్షించిరి.

## భగవానుల సమాధానము

"అయిందా? మీరంతా చెప్పదలచింది, ఇంకా ఏమైనా మిగిలిందా?" అన్నారు భగవానులు. ఈ విధంగా పరిపరి విధముల అంబపాలిని గూర్చి చెప్పుచున్న జనంలో నుండి ఒకరిని పిలిచారు భగవానులు. అతని ఒక చేయి పట్టుకొని "నాయనా! ఇప్పుడు చప్పట్లు చరచు అన్నారు. ఈ చేయి వదలండి చరుస్తానన్నాడు.

ఖాళీగా మరో చేయి వుందిగా ఆ చేయితో కొట్టు అన్నారు. ఒక చేత్తో ఎలా సాధ్యం అన్నాడు అతను. ఒక్క చేత్తో చప్పట్లు కొట్టుట ఎలా అసాధ్యమో! అంబపాలి ఒక్కతే ఎలా చేస్తుంది? జారత్వం? రెండవవారెవరూ లేకుండానే ఆమె కులటయ్యిందా? ఈ నగరంలో చాలామంది ఆ పనిలో మునిగియున్నారు. కావున జారత్వం సాగింది. మీలో ఎవరూ ఆమె గడప తొక్కకుండా ఉన్నట్లయితే ఆమె ఆ విధంగా మారి వుండేదా? ఆమెకు డబ్బిచ్చి మభ్యపరచి చెడగొట్టింది ఆ స్థితికి దిగజార్చింది మీరు. ఎవరైనా ఇటువచ్చి నేనెలాంటి పాపము, అక్రమము, అన్యాయము, దోషము చేయలేదని ఖచ్చితముగ చెప్పండి. ఆమె ఇంటికి బిక్షకు వెళ్లకుండా మీ ఇంటికే భిక్షకు వస్తాను. రండి ఈ చెడు చేయనివారెవరో ఇటు వచ్చి నిలవండి" అన్నారు భగవానులు. ఎవరూ ముందుకు అడుగువేయలేదు.

"మరో విషయం ఆలోచించండి. వైద్యులు ఎవరికి కావాలి? రోగికి! పుణ్యం ఎవరికి కావాలి? పాపికి. శిక్ష ఎవరికి వేయాలి? నేరస్థునికి. పశ్చాత్తాపము ఎవరు పడాలి? పాపము, తప్పు చేసినవారు. మరో విషయం. ఓడ నడి సముద్రములో సాగిపోతుండగ నావలో లోనికి నీరు చేరి మునిగిపోతుంది! నీరు ఎత్తి పారపోయుట మంచిదేకాని ఓడకు పట్టిన రంధ్రం మూయుట అత్యంత ముఖ్యమైన పని. సంఘములోనూ అంతే. చెడు ఎటునుండి, ఏ దారి గుండా, ఏ వైపునుండి వస్తుందో గమనించి వారిని బాగుచేయాలి. మీ మీ కుళ్ళును, అసూయను, ఈర్ష్యను, ద్వేషమును వదలండి. ముందు మీరు బాగుపడండి. తరువాత చెడినవారిని బాగుచేయండి. సంఘానికి, ధర్మానికి కట్టుబడి, ధర్మము తప్పకుండా, సంఘాన్ని వదలకుండా బుద్ధిగా ఆలోచనతో నడచుకొండి. ఎవరికివారు పాపం చేయకుండా, ధర్మము తప్పకుండ నడచుకుంటే వాలు"

-ఈ విధంగా ఎన్నో ధర్మరహస్యాలను బుద్ధ భగవానులు వారికి బోధించి వారి మనస్సులను మార్చి వారిని శాంతింపజేసి వారిని ధర్మమార్గమున ద్రిప్పిరి. అంబపాలి ఇంట భిక్ష స్వీకరించిరి.

## e) జంతుబలిను గురించి బుద్ధుని అభిప్రాయం

శ్రావస్తికి సమీపంలో కశ్యపుడనే మహాపండితుడుండేవాడు. అతని పేరుతోనే ఒక అగ్రహారం వుండెను.

ఒకనాడు బుద్ధుడు ఆ అగ్రహారం గుండా పోవలసివచ్చెను. కశ్యపుడు బుద్ధుని ఆపి, "లోగడ నేను చేయు యాగాలకు జంతుబలి చేయుట తగదని, అలా చేయుట దోషమని ఏ శాస్త్ర ప్రమాణముతో చెప్పగలిగిరి" అని బుద్ధుని నిలదీసి ప్రశ్నించెను.

బుద్ధుడు చిరునవ్వుతో ఇలా అన్నాడు "యాగము పేరుతో జంతుబలి గావించి, ఆ జంతుకి ముక్తి ప్రసాదించుచున్నానని లోగడ నీవు అన్నావు గుర్తుందా? కశ్యపా! అలా ముక్తి కావాలని అడగనిదే ఆ జంతువుకు ముక్తి ప్రసాదించాలనే తపన, ప్రేమ నీకు వున్నట్లైతే మీ మీ తల్లిదండ్రులను, బంధువులను, మిత్రులను, కుమారులను అందుకు ప్రోత్సహించి, వారిని బలి యిచ్చి యాగం చేయరాదా? వారంతా మోక్షం (ముక్తి) కొరకు తాపత్రయప డుతున్నారుగదా? ముక్తి, మోక్షం తేలిగ్గా దొరికే వస్తువయితే దానికొరకు తాపత్రయపడేవారికెందుకు ఇప్పించరు? ముక్తిని ఆ మేక, గుర్రం, మరొక జీవియో అడుగుట లేదుగదా?

ముక్తి, మోక్షం ఒకరి సొత్తు కాదు. అది సత్కర్మలవల్ల, సత్సంకల్పంవల్ల, సత్క్రియలవల్ల అందరికి అందుతుంది.

గత జన్మలోనిది ఈ జన్మలోనికి వస్తుందని నమ్ముతున్నావు.

తిరిగి ఈ జన్మలోను పాపకార్యాలు చేస్తున్నావు. సరైన మార్గాన్ని ఎప్పుడు అన్వేషిస్తున్నావు? ఆచరిస్తావు?" అని బుద్ధభగవాన్ ధారా వాహికగా ధర్మబోధ చేస్తూ చెప్పుకుపోతున్నారు. వారి వాక్కుల్లో తియ్యదనం ఉంది, సారం వుంది. అర్థం వుంది, గంభీరత ఉన్నది. వారి ప్రవాహంలాంటి ధోరణికి అంతా ముగ్ధులయ్యారు. కశ్యపుడు కూడ తల వంచాడు. కాని అతనిలోని 'అహం' ఇంకా చావలేదు. అతనిలోని నోరెత్తగల శక్తిని భగవానుల మాటల ధోరణి ఆపివేసింది. అతడికి ఎంత మాట్లాడిన ఇక విలువ రాదు. సూర్యుడు ఉదయించక ముందు దీపము ఎంతో వెలుతురివ్వగల్గుతుంది. సూర్యుడు వచ్చాక దాని వెలుగు పలచగను, బలహీనముగ గోచరిస్తుంది. అజ్ఞానుల శక్తి గూడ అలాగే వుంది. ఆయన వెంట వచ్చిన శిష్యుల యొక్క మనస్సంతా సూర్యకిరణాలు సోకిన మంచులా కరిగిపోయింది. కశ్యపునికి జ్ఞానోదయమయింది. "గతంలో మిమ్ము ద్వేషించినందుకు క్షమించండి. మీరు సిద్ధార్థులే కాదు, చరితార్థులు, కొంతకాలం నా అగ్రహారంలో వుండి మా ఆతిథ్యాన్ని స్వీకరించండి" అన్నాడు కశ్యపుడు. అలాగే అన్నారు బుద్ధ భగవాన్.

# 56) గురుదేవా...

శిష్యుడు- ప్రకృతి, వికృతి అంటారు నాకు బోధపడుటలేదు గురుదేవా?

**గురువు- ఎవరి వస్తువు వారివద్ద** వుండుట ప్రకృతి. ఇతరుల వస్తువులను దోచుకొనుట **వికృతి. ఇతరులకు** ఇచ్చుట సంస్కృతి.

శిష్యుడు- కారములు ఎన్ని రకాలు స్వామి?

గురువు- కారములలో ఎన్నో రకాలు గలవు. అందులో ప్రమాదమును కలిగించునవి మూడు. అపకారము, అహంకారము, ప్రతీకారము, అను మూడు కారములు మానవునికి వికారము కలిగించి వికాసమును, వివేకమును పోగొట్టును.

శిష్యుడు- మరి ఏ కారమును మానవుడు అవలంబించాలో తెలవిస్తారా?

గురువు- నాయనా! ఉపకారము, సహకారము అను రెంటిని ఆచరించిన వాడు ఉత్తముడై విరాజిల్లగలడు.

శిష్యుడు - శాంతి, సుఖము పొందుటకు మార్గము తెలవిస్తారా?

గురువు- 1. కక్షలు, కార్పణ్యాలు వదలి కనికరమును, ప్రేమను పెంచుకొనుము.

2. సంసారములో వున్నను ఉత్తమ సంస్కారమును కలిగి యుండుము.

3. అర్థము ఎట్లున్నను పరమార్థమును, విధి ఎట్లున్నను దైవసన్నిధిని అలవరచుకొనుము.

4. ఇతరులను బాధించుట మాని దైవము కొరకు, ధర్మము కొరకు పాటు పడుము- ఈ సద్గుణములే శాంతి, సుఖములకు మార్గములు.

శిష్యుడు- స్వామీ! ఇంకేమైనా మాకు మంచిదారి చూపించు మహావాక్యాలు సెలవిస్తారా?

గురువు- నాయనా! జాగ్రత్తగా వినుము. పథకాలు వేయుటలో సిద్ధహస్తులై ఆచరణలో బద్ధకస్తులు కాకూడదు.

చమత్కారాలు ఎన్ని చేసినా మహత్కార్యాలు సాధించాలి.

సత్సంకల్పముతో సత్కార్యక్రమాలు చేసి సద్గతి పొందాలి. దుస్సంకల్పములను దూరీకరించాలి.

భ్రమలో పడకుండా బ్రహ్మమును పొందాలి.

మతి చెడినచో గతి చెడును. కావున మతిలో మాలిన్యము లేకుండా చేసుకోవాలి.

శిష్యుడు- గురుదేవా! దేవుడు ఒక్కడే అంటారు. దేవునకు చాలా పేర్లు ఎలా వచ్చాయో శెలవిస్తారా?

గురువు- నాయనా శ్రద్ధగా, చక్కగా వినుము.

"ఏకం సత్ విప్రా బహుధా వదంతి"

"వస్తువు ఒక్కటే, పేర్లు అనేకము" అని ఉపనిషత్ చెప్పినది. వాటర్, జల్, నీరు, పానీ, తన్ని - ఇవి అన్నియూ ఒకే నీటియొక్క పేర్లు. భాషాభేదమే కాని భావము ఒక్కటే. చెవిరింగు, మెడలో హారము, చేతి ఉంగరము, గడియారం యొక్క గొలుసు ఇవి అన్నియు ఒకే బంగారం యొక్క రూపములేగాని అన్యము కాదు.

ఈ విషయాలు బాగా జీర్ణించుకో నాయనా!

శిష్యుడు-అలాగే ! గురుదేవా! సెలవు.

# 57) నామకరణం

ఏ వ్యక్తి అయినా ఈ లోకంలో ఆవిర్భవించగానే నామకరణం చేయుట పరిపాటి. కొందరి పేర్లకు వారి ఆచరణకు సంబంధం వుండదు.

ఉదాహరణకు : ఒక వ్యక్తి పేరు ప్రేమమూర్తి. కాని ఆచరణలో ద్వేషమూర్తి.

మరో వ్యక్తి ధర్మారావుకాని అధర్మపనులలో ఆరితేరిన వ్యక్తి.

మరో వ్యక్తి పేరు వివేకమూర్తి. అవివేకపనులు తప్పితే ఒక్కటి కూడ మంచి పని చేయడు.

ఇంకో వ్యక్తి పేరు పుణ్యమూర్తి కాని చేసే పనులన్నీ పాపపు పనులే. ఒకతని పేరు ఆనందరావు కాని ఎప్పుడూ ఏడుపే.

ఎక్కడో వుంటారు మహానుభావులు. వారి పేరు వింటేనే పుణ్యం. వారిని దర్శిస్తే మరీ పుణ్యం. అట్టి పుణ్యపురుషుని చరిత్ర ఒకటి ఉపనిషత్‌లో వుంది. అట్టి పుణ్యపురుషుడు ఎక్కడికో ప్రయాణమై వెళ్ళుచుండగా మార్గమధ్యంలో ఒక సాధువు కనిపించి- "నాయనా! నీపేరు ఏమి?" అని అడిగెను.

"నా పేరు మోహజిత్" అని సమాధానమిచ్చెను.

"పేరు చాలా బాగుందికాని, నీ పేరులోని అర్థము నీకు తెలుసా?"

"తెలియకేమి, స్వామీ! మోహమును, వ్యామోహమును, అజ్ఞానమును జయించినవాడను అని అర్థం."

"అయితే నీవు నిజముగ జయించినావా?"

"నేనొక్కడినేకాదు మా ఇంటిలోనివారందరూ జయించినారు"

"అయితే నీ అడ్రసు నాకివ్వు, నేను తిరిగి వచ్చేవరకు నీవు

ఇక్కడనే వుండు" అని ఆ సాధువు అడ్రసు ప్రకారం అతని తల్లిదండ్రులవద్దకేగి- "ఏమండీ! మీ పుత్రుడు మోహజిత్తు అడవిలో ఒక సింహముచే చంపబడినాడు. అతని రక్తసిక్తమైన వస్త్రములు ఇవిగో చూడుడు" అని ఏడుస్తూ చెప్పనారంభించెను.

ఆ తల్లిదండ్రులు నవ్వుతూ, "ఎందుకయ్యా ఏడుస్తున్నావు. 'జాతస్య హి ధృవో మృత్యుః' పుట్టినవాడు తప్పక చావవలసిందే. పుట్టినప్పుడు ఒక్కడే పుట్టుటలేదు. మరణము కూడ కలసి పుట్టినది. ఇందులో ఏడుపుకు అవకాశం లేదు"- అని సమాధానములిచ్చిరి ఆ తల్లిదండ్రులు.

ఆ సాధువు వెంటనే వెనుతిరిగి మోహజిత్ వద్దకేతెంచి, "అయ్యా! నేను నీ అడ్రసు ప్రకారం నీ తల్లిదండ్రుల వద్దకేగితిని. నీ తల్లిదండ్రులిరువురు చనిపోయినారు" అని విషాదవదనముతో విషయమును వివరించగ, ఆ మోహజిత్తు, "స్వామీ! ఆత్మజ్ఞానమును ఆర్జించిన నాకు ఏ మాత్రము బాధలేదు. తల్లిదండ్రులు, బంధువులు, సంసారం, ఆస్తి, అంతస్తులు-ఇవన్నియు స్వప్నములోని సంపదలవంటివి. మేలుకొనినవాడు స్వప్నములోని సంపదలగూర్చి, వ్యక్తులగూర్చి ప్రాకులాడడు. కనుక నాకు ఏ వియోగదుఃఖము లేదు"

ఆ ప్రత్యుత్తరము విని సాధువు సంతసించి- "నాయనా! నీవు సార్థకనామధేయుడవు. నిన్ను పరీక్షించుటకే నీ జననీజనకులు మరణించారని చెప్పాను. వారు సజీవముగనే యున్నారు" అని పలికి వెడలిపోయెను.

కావున దేనిని గూర్చి విచారించక మంచిగ వుండి మంచిపనులు చేసి మానవ ధర్మము నెరవేర్చినవాడే మోహజిత్.

మనము కూడా మోహజిత్‌ను ఆదర్శంగా తీసికొని మన పేరుకు మానవత్వానికి న్యాయము చేకూర్చి ధన్యులమవుదాం.

# 58) అసూయవలన అనర్థములు

అన్ని దుర్గుణాలకు మూలము అసూయ. అసూయవలవనే దుర్యోధనునికి పాండవులంటే గిట్టలేదు. పాండవులు సుఖంగా, సంతోషంగా వుండుటవలన దుర్యోధనునికి అన్నము సహించలేదు. ఇట్టి అసూయే మహాభారతయుద్ధమునకు మూలకారణమయ్యెను. అలజడులు, ఆవేశాలు, కక్షలు, కార్పణ్యాలు, కాఠిన్యాలు, కలహాలు జరుగుటకు కూడ ఈ అసూయే కారణము.

"ఓ అర్జునా! నీకు అసూయలేదు కావుననే గీతనుప దేశిస్తున్నాన" ని శ్రీకృష్ణ భగవానుడు గీత 9వ అధ్యా యము మొదటి శ్లోకములో వివరించియున్నారు. దీనిని బట్టి శ్రీకృష్ణుని దృష్టిలో అసూయ అను దుర్గుణము ప్రమాదకరమైనదని తెలియుచున్నది.

అసూయ అనగా తోటి వ్యక్తి ఆనందంగా, సుఖంగా, శాంతిగా, సంతోషంగా వుండుట చూచి ఓర్వలేనితనమే!

"తనకు సంపదలు లేకపోయినను బాధలేదు. కాని ఎదుటి వానికి సంపదలు వుండరాదు" అను మనస్తత్వముగలవారు సమా జములో అక్కడక్కడ కనుపిస్తున్నారు. వీరు సమాజమునకు చీడపురుగువంటివారు.

వందల గజాల విస్తీర్ణముగలిగిన మర్రిచెట్టును సహితము క్షణా లలో మాడిపోవునట్లు, ఎండిపోవునట్లు చేయు శక్తి వేరుపురుగునకు గలదు. అదే విధముగా ఎంతటి గొప్పవారిలోనైనను అసూయ అను వేరుపురుగు ప్రవేశించినచో ఆ వ్యక్తిని అది సర్వనాశనము చేయును. దహించివేయును. కావున అసూయ విషయములలో చాలా జాగరూకత వహించవలయును.

10

ఒకానొక వ్యక్తి ఒక ముసలమ్మను "అమ్మా! నీ ఇంట్లో దొంగలు పడ్డారుగదా! అన్నీ దొచుకెళ్ళారు. కాని నీవు సంతోషంగా వున్నావు. కారణం ఏమిటి? నీకు వేదాంత తత్త్వము ఏమైనా జీర్ణమయిందా?" అని అడుగగా- "మా ఇంట్లో వస్తువులకంటే మా పక్కింట్లో వారి వస్తువులు ఎక్కువ మొత్తములో దొంగతనము జరిగినందులకు సంతోషంగా వుంద" ని సమాధానము చెప్పిందట ఆ ఇల్లాలు.

దీనినిబట్టి అసూయ ఎంత అల్పమయిన గుణమో ఊహించుకొనవచ్చును.

ఒక ధనికుడు అన్న సమారాధన చేయించదలంచి మంచి మేలు రకము సరుకులు తెప్పించి వంట చేయించి అందరికి భోజనాలు వడ్డించిరట. కాని తిన్న వారందరూ వాంతులు చేసుకొనుచుండిరి. ఎక్కడ పొరపాటు జరిగిందని విచారణ జరిపించగా పులుసు వండిన పాత్రకు కలాయి లేదని తేలిందట. పాత్రకు కలాయి లేని ఒక్క దోషముతో చక్కటి కందిపప్పు తదితర వస్తువులన్నియు ఏ విధంగా వ్యర్థములైనవో అదే విధంగా అసూయ అనునది మానవునిలో ప్రవేశించినచో సమస్త సద్గుణాలను అది వ్యర్థమొర్చివేయును.

కావున ఆధ్యాత్మికరంగమునగాని, రాజకీయ రంగమునగాని, సాంఘికరంగమునగాని అసూయను ఎవరును దరికి చేర్చరాదు. అసూయ లేనప్పుడే తాను చేసిన జపధ్యానాది పూజలు సత్ఫలితాలు ఇవ్వగలవు.

అంటరాదు, ముట్టరాదు, తాకరాదు అను పదాలను అసూయకు జోడించుట మంచిది. అనగా అసూయ, ద్వేషము, క్రోధము, హింస మొదలగు దుర్గుణాలకు దూరంగా వుండి వాటిని మాత్రమే 'అంటరానివిగా, తాకరానివిగా, ముట్టరానివిగా భావించి బహిష్కరించుట మంచిది.

# 59) దుఃఖమునకు కారణము

ఒక పట్టణమున ఒక కోటీశ్వరుడుండెను. అతనికి అనేకమంది సేవకులు, కార్లు, లారీలు, బస్సులు వున్నవి. పది అంతస్థుల భవనము. అందులో వున్న అన్నిగదులు ఎయిర్ కండిషన్‌తోను, కలరు టీ.వీ. లతోను, స్పాంజి పరుపులతోను, అనేక సుందర వస్తువులతోను నిండియుండెను. చూచువారలకు వైకుంఠంవలె కాన్పించుచుండెను.

ఒకనాడు అతని భార్య ఇతర దేశమునకేగెను. అచట ఆమె ప్రమాదవశాత్తు ఆకస్మికముగ చనిపోయెను. ఆ వార్త విన్న కోటీశ్వరుడు చిన్నపిల్లవానివలె ఏడ్పుచుండెను. ఈ ఏడ్పుకు కారణము ఒకింత విచారిస్తాము. రోజు ఎందరో చనిపోయినట్లు వార్తలు మనము వింటున్నాము. లక్షాధికారీ వింటున్నాడు. కాని మనము ఏడుస్తూ వుంటామా? ఆ ధనవంతుడు ఏడుస్తున్నాడా? లేదు.

అలా చనిపోయినట్లు విన్న వార్త వలన ఏడుపు రాదు. దుఃఖము రాదు. అలా వచ్చునట్లైనచో మనము ప్రతిరోజు "కంటిన్యూ" గా ఏడవవలసిందే. మరి బాధ, దుఃఖము ఎందులోనుండి వచ్చినవో ఆలోచిస్తాము. "అహం, మమ" అను రెండక్షరములలోనే ప్రపంచమంతా ఇమిడియున్నది. నేను, నాది, నావారు, నా వస్తువు, నా భార్య, నా కుమారుడు, నా భర్త, నా ఆస్తి, నా సంపదలు ఇత్యాది 'న' కారముతో నలుగుతూ వున్న వస్తువులు మననుండి దూరముకాగానే దుఃఖిస్తాము. కావున దుఃఖమునకు మూలము వస్తువులు పోవుటలో లేదు. నా వస్తువు పోయింది అను వాక్యములో వుంది. ఇతరుల వస్తువులు పోయిన వార్తలు రోజు వింటున్నాము. మరి ఏడుస్తున్నామా? లేదుగదా?

జీవితములో ఏ ఆపత్తు గలిగినను తద్వారా సంభవించు దుఃఖమునకు దూరంగా వుండుటకు ఏదైనా మార్గముగలదా? అని చాలామంది అడుగుచుందురు. ఉదాహరణకు ఒక వ్యక్తికి ధనబలము, విద్యాబలము, కీర్తి బలము, అధికార బలము, శరీర బలము మొదలుగా గల బలములన్నియు ఉన్నవి. మరి ఆ వ్యక్తి యొక్క పిల్లవాడు చనిపోయెను. ఆ వ్యక్తి అత్యంత బాధతోను, దుఃఖముతో విలపించుచున్నాడు. మరి అతనికి సమస్త బలములు వున్నవిగదా? మరి ఎందుకు ఏడ్చుచున్నాడు. అన్ని బలములకన్న ఇచ్చట కావలసిన బలము మనోబలము. ఆత్మబలము, విచారణా బలము, దైవబలము.

ఇట్టి బలముగలవానిని ప్రపంచములో ఏ శక్తి బాధింపజాలదు. మహాత్ములు, ఋషులు, ఋషీశ్వరులు, తపస్సంపన్నులు ఇట్టి దైవ బలము ద్వారానే దుఃఖములకు దూరమైనారు. ఈ సందర్భమున స్వామి రామతీర్థులవారి విషయము గుర్తుకు తెచ్చుకుందాము.

ఒకనాడు స్వామిరామతీర్థులవారు ఒక వేదిక నధిరోహించి వేలాదిమందికి దైవతత్త్వమును గురించి వివరంగా, విపులంగా వివరించుచుండిరి. ఆ సందర్భములో ఒక వ్యక్తి ఒక చీటీ తెచ్చి వారికిచ్చెను. ఆ చీటి చదువుకొని ప్రక్కనపెట్టి యథా ప్రకారముగ దైవతత్త్వమును గురించి ఉపన్యసించెను. అంతా పూర్తి అయిన పిదప ఒక వ్యక్తి వచ్చి,"స్వామీ! తమరు అనర్గళంగా మహోన్నత ఆధ్యాత్మిక రహస్యాలను, చెప్పుచుండగా మధ్యలో ఏదో చీటీ వచ్చింది ఏమిటని" అడుగగా, "నాయనా! నాకు పూర్వాశ్రమములో ఏకైక కుమారుడు ఒకడు గలడు. అతను చనిపోయినట్లు వార్త వచ్చెను. అంతే!" అని ముక్తసరిగా సమాధానమిచ్చెను. ఆ సమాధానమునకు ఆ వ్యక్తి ఆశ్చర్యపడి "స్వామీ! తమ కొమారుడు చనిపోయిన వార్త మీకు బాధ, దుఃఖమును కలుగజేయలేదా?" అని అడుగగా!

"నాయనా! మంచు చల్లగా వుంది, నిప్పు వేడిగ వుందను వార్త విన్నప్పుడు ఆశ్చర్యమేస్తున్నదా?అది సహజమేగదా? మంచు వేడిగను, నిప్పు చల్లగను వుందను వార్త వింటే ఆశ్చర్యము. అలాగే పుట్టిన వ్యక్తి చనిపోయాడంటే ఆశ్చర్యము లేదు. చనిపోలేదంటేనే ఆశ్చర్యము. అది ప్రకృతికి విరుద్ధము" అని సెలవిచ్చిరి. ఇట్టి మహాత్ముల ప్రబోధముల ద్వార అసలైన కీలక రహస్యములను గ్రహించి దుఃఖమునకు దూరమై, ఆనందము మన వశము చేసుకొని, శాంతిగను, సుఖముగను జీవితము చరితార్థము చేసుకొందాము!

# 60) అహంకారం

**కా**రాలు అనేక రకాలు.

అహంకారం, మమకారం, దురహంకారం, ఈ కారాలు మాన వునికి వికారము గలిగించి ఆకారము చెడగొట్టును.

ఈ కారాలు గలవాడు అధోగతి పాలుగాక తప్పదు. చరిత్ర పుటలు తిరగవేస్తే దుర్యోధనుడు, దుశ్శాసనుడు, హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు మొదలగువారు అహంకార, మమకారాల చేతనే వినాశాన్ని కొనితెచ్చుకున్నారు. నిండుకుండ నిండుగ మెండుగ స్థిరంగా వుండును. వెలితి కుండ కదులుచుండును. అలాగే పెద్దలు, మహాత్ములు తమకు ఎన్ని విద్యలు వున్నను, తపస్సు వున్నను అలా వున్నట్లు గోచరించును. కాని కొద్దిపాటి మిడిమిడి జ్ఞానము గలవారు పొంగి పొంగి గొప్పలు చెప్పకొనుచుందురు.

బిరుదులు, సన్మానములు ఇచ్చువారు లేనిచో వారే ఇతరులను ప్రేరేపించి వాటి ఖర్చు భరాయించి తమకొరకై ఉత్సవాలు ఊరేగింపులు చేసుకొనువారు లేకపోలేదు.

ఒక పండితుడు పలురకాలైన బిరుదులు గల బోర్డు తన ఇంటికి తగిలించుకొనుట చూచిన ఒక స్నేహితురాలు పండితుని భార్యతో "నీ భర్త గానికి ఈ బిరుదులు ఎక్కడివి ఎవరిచ్చార"ని అడుగగా- "అంతటి మహానుభావునికి ఒకరిచ్చుట, తీసుకొనుట ఎందుకని మంచిరోజు చూచి వారే ఏర్పాటుచేసుకున్నార" ని పండితుని భార్య సమాధానమిచ్చిందట. బిరుదులు సన్మానాలు ఊరేగింపుల మీద వున్న శ్రద్ధ పదిమందికి ఉపయోగపడు కార్యములపై దృష్టి కేంద్రీకరింపజేసి తమ ధనమును సద్వినియోగపరచువాడే మానవ జన్మకు శోభ తెచ్చువాడు. అలా కానివాడు "మానవుడు" అనే

పదమునకు కళంకము తెచ్చినవాడే యగును.

కాబట్టి జనులు ప్రయత్నపూర్వకముగ అహంకార, మమకార, అపకారములను తొలగించుకొని ఉపకారమును చేబట్టి బ్రహ్మాకారమును పొంది విరాజిల్లవలెను. ఇదియే మానవుని జీవిత లక్ష్యము.

# 61) దేవుడు ఒక్కడే

వస్తువు ఒకటే పేర్లు అనేకములు

బంగారం ఒకటే ఆభరణములు అనేకములు

పాలు ఒకటే ఆవులు రంగులు అనేకములు

మనిషి ఒకటే పేర్లు అనేకములు

ఊరు ఒకటే దారులు అనేకములు

అలాగే దేవుడు ఒకడే పేర్లు అనేకములు. ఈ విషయాన్ని గురించి విపలంగా వివరించుకొందాము.

అనగనగా ఒక రాజు ఆ రాజును ప్రజలు రాజు అని, భార్య నా భర్త, అని సంతానము మా తండ్రియని, తల్లి మా కొమారుడని, కోడళ్ళు మా మామగారని, మనమళ్ళు మా తాతగారని, తమ్ముళ్ళు మా అన్నాగారని, సంబోధిస్తారు.

ఒకే వ్యక్తి భర్తగను, తండ్రిగను, మామగను, అన్నగను, తాతగను, ముత్తాతగను ఎలా పిలువబడుచున్నాడో అదే విధముగ ఒకే భగవంతుడు కూడ రకరకాల పేర్లచే పిలవబడుచున్నాడు.

ఎవరు ఎన్ని పేర్లతో పిలిచినను, ఆరాధించినను చిక్కులేదు. కాని దేవుని పేరుతో మతకలహాలు, మారణహోమాలు, దురాగతాలు దుర్మార్గులు చేపట్టుట సహించరాని నేరము.

ఇట్టి అరాచకాలను నిర్మూలించి సర్వమత సమన్వయమును బోధించు మహోన్నత ఆశయములు గల మహాత్ముల కొరకు లోకము ఎదురుచూచుచున్నది. మతిని శుద్ధము చేయునదే మతము అని పెద్దలు ఎంత చెప్పినను ఆచరించు వారు అరుదుగా వున్నారు. భాషాభేదమేగాని భావమొక్కటే అను విషయమును

కూడ గ్రహించుట అత్యంత అవసరము.

ఒక యాత్రికుడు పాదచారియై పోవుచుండ మార్గమధ్యములో అతనికి దప్పికాయెను.

ఒక పల్లెటూరు చేరుకొని ఒక ముసలమ్మ ఇంటికి వెళ్ళి తల్లీ! పెద్దమ్మా! పానీ పానీ అని కేకవేసెను. మరొకడు కూడ అదే సమయమునకు వచ్చి తన్నీ తన్నీ అని కేకవేసెను. వేరొకడు వచ్చి వాటర్, వాటర్ అని అడిగెను. ఎవరు మీరు నన్ను తిట్టుచున్నారు అని కేకలు వేసినది ముసలమ్మ, ముసలమ్మ మాటలు వారెవరికి అర్థముకాలేదు.

ఈలోగా మరొకడు వచ్చి పెద్దమ్మా దప్పికగుచున్నది కాస్త మంచినీరివ్వమని అడిగెను. వెంటనే ఆమె చెంబుతో నీరు తెచ్చి యిచ్చెను. మనుమడిగింది నీరే కాని మన భాషాభేదముతో ముసలమ్మను బాధించి, మనము బాధపడవలసి వచ్చిందన్న నగ్నసత్యాన్ని తక్కినవారు అప్పుడు తెలుసుకున్నారు.

పిల్లవాడు తన తండ్రిని నాన్న, ఫాదర్, డాడి, తండ్రి అని ఏ పేరుతో పిలిచినా తండ్రి పరుగెత్తుకొని వచ్చునుగదా? అలాగే మన అందరికి తండ్రియగు భగవంతుని ఏ పేరుతో పిలిచినను పలుకుదురు.

కావున భగవంతుని భక్తితో, ప్రీతితో, జపించి ధ్యానించి సర్వ జీవుల యెడల ప్రేమ, దయ, కరుణ, పరోపకారము మున్నగు సద్గుణములు గలిగి భగవంతుని కృపకు పాత్రులమగుదుముగాక!

# 62) వాయిదాలు

మంచిపనులు చేయాలని సంకల్పము గలుగుటయే అరుదు. ఒక వేళ వందలమందిలో ఒకరికి కలిగినే రేపు రేపని వాయిదాలు వేయువారు లేకపోలేదు. మంచిపనులు చేయుటలో వాయిదాలు వేయువారు చేతులకు అందిన సువర్ణావకాశాన్ని జారవిడుచుకొనినవారే అగుదురు.

ఒకరిని హింసించాలని, బాధించాలని, అపకారము చేయాలని సంకల్పము స్వప్నములో కూడా రాకూడదు. ఒకవేళ వచ్చినచో ఇట్టి పాడుపలను చేయకూడదని దృఢతర వజ్ర సంకల్పము చేయవలెను. మానవులలోనేగాక పశు పక్ష్యాదులకు కూడ ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడయినా మంచి చేయాలని మంచిగ వుండాలని సంకల్పము తప్పక గలుగకపోదు.

అట్టి మంచిబుద్ధి వలన మంచికార్యాలు, దైవకార్యాలు, పరోప కార్యాలు చేయాలని సంకల్పము గలుగగలదు. అట్టి సంకల్పము గలిగిన వెంటనే, వెనువెంటనే, తక్షణమే అమలుపరచుటకు పూను కొనవలెనేగాని వాయిదాలు వేయుటకు ప్రయత్నించరాదు. రేపుకు రూపులేదని కబీరుదాసు సెలవిచ్చియున్నారు.

ప్రపంచములో చాలమంది మంచి పనులను వాయిదాలు వేస్తూ వుంటారు. కానీ తమ తమ భోజనాలకు రేపటికి వాయిదా వేస్తారా? వేయరు. ఇతరులకు ఏదైనా దాన, ధర్మము చేయవల సివస్తే రేపు రమ్ము, తరువాత రమ్ము, వచ్చేవారము చేస్తాము. రాబోవు నెల చూస్తాము. ఆ తదుపరి సంవత్సరం ఆలోచిస్తామని వాయిదాలు పరంపరలోకాలయాపన చేయువారు తన జీవితములో పుణ్యధనమును సంపాదించలేరు. అలా పుణ్యధనమును కూడబెట్టని

వారికి పరలోకములో, ఇతర లోకములో తిప్పలు తప్పవు.

కావున పరలోకములో బాధలు తొలగాలంటే ప్రశాంతంగా గడపాలంటే ఇహలోకములోనే ప్రయత్నించాలి. ప్రయత్నలోపము ఎట్టి పరిస్థితులలో పనికిరాదు.

క్రొత్త సినిమా టికెట్ దొరకకపోయినను భల్లూకపట్టుతో ఏదో విధంగా ప్రయత్నలోపము చేయక ఏ విధంగానైనా టికెట్ కొని సినిమా చూచుటలో వున్న ప్రయత్నము, దానధర్మాలు చేయుటకు, గుడికి పోవుటకు, మంచి చేయుటకు, తోటి వ్యక్తికి సహకరించుటకు ఉపయోగించినచో అచిరకాలములోనే మహోన్నత వ్యక్తిగ, ఆదర్శమూర్తిగా అందరు నిన్ను కొనియాడుటయేగాక యథారాజా, తథాప్రజా అని ఆర్యోక్తిగ మనద్వారా మన సన్నిహితులు, అనుచరులు మన సిద్ధాంతములకు ఆకర్షితులై వారు కూడ మన అడుగుజాడలలో పయనించి, వాయిదాలను విరమించి మంచి చేసి మంచి ఫలితమును పొంది దివ్యమైన, భవ్యమైన, భద్రమైన జీవితమును గడుపగలరనుటలో సందేహములేదు.

# 63) ఆనందమెచట ?

సృష్టిలోని ప్రతి జీవి, ప్రతి ప్రాణి, చీమ మొదలుకొని మానవులవరకు గల ప్రతివారు ఆనందము కొరకు అహర్నిశములు పాటుపడుచుందురు. మరి ప్రయత్నములు ఫలించుచున్నవా? పరిపూర్ణ ఆనందము "సంతృప్తి" అను మూడు అక్షరములలో ఇమిడియున్నది.

ఎవరైతే వున్నదానితో తృప్తిపడుదురో వారికి ఆనందము వశమగును. ఎవరైతే అత్యాశకు లోనగుదురో వారిని దుఃఖము వెంబడించగలదు.

దురాశ దుష్ఫలితములిచ్చును.

అత్యాశ అధోగతికి చేర్చును.

అని ఒక మహనీయుడు సెలవిచ్చెను. ఆనందము, ఆనందము అని కలవరించిన ఆనందము లభించదు. చెరకుగడె వద్దకు వెళ్ళి 'చెరుకు రసము, రసము' అని పలికిన అది రసము తెచ్చి మన నోట్లో పోయదుగదా? ప్రయత్నమువలన రసమును ఆస్వాదించవలెగదా? అలాగే ప్రయత్నముచేతనే పరిపూర్ణ ఆనందము లభించగలదు.

ఒక శిష్యుడు తన గురుదేవులను సమీపించి స్వామీ! ఆనందమునకు సులభ మార్గమును సెలవివ్వవలసిందిగా ప్రార్థించెను. అంతట ఆ గురుదేవుడు శిష్యుని ఉద్దేశించి "నాయనా! అదిగో అటు చూడు. ఆ చిన్నబాలుడు, పాపాయి ఎంత ఆనందంగా ఆడుతూ పాడుతూ వున్నారో? గమనించుము. ఆనందమనగా ఆ పాపాయి జన్మహక్కుగా గోచరించుచున్నదా? మరి ఆ పాపాయి, ఆ చిన్నపిల్లవాడు అంత ఆనందంగా వుండుటకు కారణము ఒకింత ఆలోచించుము. ఆ పిల్లవానికి నీవు ఒక బంగారు ఉంగరమిమ్ము. దానిని గిరాటువేయును.

లక్షలు విలువచేయు ఒక కిలో బంగారపు ముద్దకూాఆ- ఆ పిల్లవానివద్ద వుంచుము. దానిపై కూడా అనాసక్తి ప్రదర్శించునేకాని ఆసక్తికాని, వ్యామోహమునుగాని, మోహమును గాని ప్రదర్శించడు. ఇప్పుడు గమనించితివా ఆ పిల్లవాడు ఆనందంగా వుండుటకు మూలకారణము" అని గురువు శిష్యునికి హితోపదేశము చేసెను. **దీనిని బట్టి 'ఆనందము' మనవశమగుటకు** పిల్లవాని మనస్తత్వము గలిగి యుండుటయే **ఏకైక సాధనోపాయము.**

మరి ఇట్టి చక్కని సులభమైన మార్గమున ఎవరు పయనించెదరో వారు ఈ అశాంతి అను అరణ్యమును దాటి శాంతి, సుఖము, సంతోషము, ఆనందమను ఉద్యానవనములో ప్రవేశించగలరు.

దేశాధినేతలు, కోటీశ్వరులైనవారు ఆనందంగా వుందురని ఎవ రైనా అనుకొంటే అది వట్టి భ్రమ. స్వప్నములో కూడా వారు నిజమైన యథార్థమైన ఆనందమును అనుభవించి యుండరనుమాట యథార్థము.

ప్రపంచములోని సమస్త దుఃఖములు, బాధలు కిరీటము ధరించి అధికారమనే అశ్వమును (గుఱ్ఱమును) అధిరోహించి స్వారీచేయు వానివెంట వుండునని ఒక మహాత్ముడు సెలవిచ్చియున్నాడు.

మనస్సులో ఎప్పుడు కలతలు, కార్పణ్యాలు, కఠినాలు గలిగి అతలకుతలపడి ఉడికిపోవుచున్నవారు ఈ క్రింది విషయములను ఒకింత జీర్ణించుకొన్నచో కొంతలో కొంతనైన ఆనందమునకు దగ్గర కాగలరు.

జరుగనున్నది-జరుగకమానదు. జరుగబోనిది-జరుగనే జరుగదు.

ఈ విషయమును చింతన చేసుకొని, మనస్సును స్థిరముగా వుంచుకొనిన ఆనందము మనవెంట, మన ఇంట, మనచెంత వుండగలదనుటలో అతిశయోక్తి లేదు. సందేహము లేదు. ఇట్టి స్థితి భగవంతుడు సర్వులకు సర్వదా సర్వకాలము అనుగ్రహించాలని మనసా శిరసా వేడుకొనుట యుక్తము.

# 64) సుస్వాగతము

ఉప్పు, కర్పూరము ఒకే ఆకృతి కలిగియుండును. కాని వాటి స్వభావము వేరు.

అలాగే అందరూ మనుషులే. కాని మనుష్యులలో పుణ్యవంతులు వేరు. మనుష్యులలో మానవత్వముగలవారు కొందరే. మానవులలో 4 తరగతుల వారుందురని వారి స్వభావములు వివరించుచున్నారు పెద్దలు.

## మొదటి రకమువారు:-

జీవితమును దివ్య తేజముగ గడుపుటకై ప్రయత్నించుదురు. Not long life but Divine life. దీర్ఘ జీవితముగాదు ముఖ్యము దివ్యజీవితము. ఎంతకాలము జీవించామని కాదు ముఖ్యము ఏ విధముగా జీవించాము అనునది ముఖ్యముగా భావించి

ఒకరి బాధను - తొలగించుచు

ఒకరికి ఉపకారము - చేయుచు

తోటి ప్రాణిని ఆపదలో ఆదుకొనుచు

ఈ విధంగా కొద్ది రోజులు జీవించినను తమ జీవితము ధన్యజీవితమని బావించెడివారు.

## రెండవ రకమువారు:-

తినుటకై జీవించుచున్నామని భావించెదరు. వారి స్వభావము ఇలా వుండును-కడుపే కైలాసం, ఇల్లే సమస్తం. వంటినిండా తిని, ఇంటినిండా దొర్లి, కంటినిండ నిద్రపోవుదురు. ఇంతకుమించి వారికి ఏది పట్టదు.

## మూడవ రకమువారు:-

తన గ వ తాను చూచుకొనడు. ఇతరులను మోసగించి అన్యాయముగ సంపాదించి ఆనందించుచుండును.

## నాలుగవ రకమువారు:-

తనకు అన్నీ వున్నను అనుభవించుచున్నను ఇతరులకు అపకారము చేసి ఆనందించు స్వభావము గలవాడు. ఈ విధంగా కాలం గడిపేవారు కూడ కొందరు వున్నారు.

లోక కళ్యాణము కొరకు తన జీవితమును ఎవడు ధారపోసి దివ్యమైన భవ్యమైన జీవితమును గడుపునో అట్టివాడు ప్రపంచములో ఏ శక్తికి జంకనివాడై మృత్యువుకు కూడా స్వాగతము పలుకగలడు. అట్టివాడే నిజముగ పుట్టినవాడు. అట్టి మనుష్య రత్నాన్ని కన్న తల్లి అదృష్టవంతురాలు, తండ్రి పుణ్యాత్ముడు. అట్టివారి కొరకై మనమంతా నిరంతరము ఎదురుచూచుచుండవలెను.

వారికే స్వాగతము - సుస్వాగతము.

# 65) కళ్ళజోడు

ఒక గుడిలో ఒక పాలరాతి తెల్లటి కృష్ణ విగ్రహముండెను. అందులో నలుగురు భక్తులు ప్రవేశించి దేవునికి నమస్కరించుకొని పూజారి ఇచ్చిన తీర్థము పుచ్చుకొని ప్రసాదము చేతబూని అటు ప్రక్కగల ఒకక అరుగుపై కూర్చుండి ప్రసాదము ఆరగించుచుండిరి.

అందులో ఒకడు "ఆహా! ఆ కృష్ణ విగ్రహము ఎంత తెల్లగ తళతళ మెరయుచున్నద"ని అనెను. రెండవవాడు "నీ కండ్లకు చత్వారమా? ఆ విగ్రహము ఎర్రగ వుంటే తెల్లగ వుందంటున్నావనె"ను. మూడవవాడు "నల్లగ వుంద"ని అరవసాగాడు.

ఈ అరుపులకు పూజారి పరుగెత్తుకొని వచ్చి వారి వాదనను వారి సమస్యను గ్రహించాడు. తదుపరి అతడు వారితో ఇట్లు పలికాడు. "ఏమండీ! పరమభక్తులారా! మహాభక్తులారా! మీ వాదన వింటే నవ్వు వస్తున్నది. నేను పూజారిని విగ్రహము ఏ రంగు వుందో మీకంటే నాగు బాగా తెలుసుగదా? రండి నా వెంట విగ్రహము రంగు ఎట్టిదో మరోసారి చూడండి"ని వారిని తీసుకొనిపోయి వారి వారి కళ్ళజోళ్ళను తీయించి చూపించెను. అప్పుడు ఆ విగ్రహము తెల్లటిదని అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు.

ఇంతకు ఆ విగ్రహము వారికి ఆయా రంగులలో కనుపించుటకు కారణము తెలుపు-ఎరుపు-నలుపు- పసుపు రంగులుగల వారి వారి కళ్ళజోళ్ళే. అలాగే ఒక బాధలో ఉన్నాడనుకోండి. వానికి ప్రపంచము రోతగా కనుపించును.

మరొకడు లాటరీలో లక్షలు ఆర్జించినాడు. ఇంకొకడు వ్యాపారములో లాభము గడించినాడనుకోండి. వానికి సర్వత్ర ఆనందముగా సంతోషమే గోచరించును.

ఒకనాడు శ్రీకృష్ణుడు దుర్యోధనునికి, ధర్మరాజుకు ఒక పనిని పురమాయించాడు. "దుర్యోధనా, నీవు ప్రపంచమంతా తిరిగి ఒక మంచివానిని తీసుకొని రమ్ము."

"ధర్మరాజా! నీవు ప్రపంచమంతా గాలించి ఒక చెడ్డవానిని తీసుకొని రమ్ము"

ఇద్దరు తిరిగి ఖాళీగా వచ్చారు ఎవరిని తేలేదు.

దుర్యోధనునికి-మంచివాడు కనుపించలేదు.

ధర్మరాజుకు-చెడ్డవాడు కనుపించలేదు.

దీనినిబట్టి దృష్టి భేదమే కాని వస్తు భేదము లేదని తెలియుచున్నది. అలాగే "సృష్టిని మార్చలేము దృష్టిని మార్చుకో" అన్నారు ఒక మహనీయుడు.

"దివ్యం దదామి తే చక్షుః పశ్యమే యోగమైశ్వరమ్"

"దివ్యనేత్రములో నా విశ్వరూపాన్ని చూడుమ"ని అర్జునునకు శ్రీకృష్ణుడు తెలిపెను గీతలో. వీటన్నిటి సారాంశము జ్ఞానము, విజ్ఞానమను కళ్ళజోడుతో ప్రపంచమును వీక్షించువాడే ధన్యుడని, వాడే ఉత్తముడని తేలుచున్నది. కాబట్టి మనమంతా జ్ఞాననేత్రమును సంపాదించుటకు అహర్నిశము పాటుపడుదాం. సాధిస్తాం.

# 66) ఏది నీ వస్తువు ?

అనగనగా ఒక కోటీశ్వరుడు. అతనికిగల సంపదలు కోకొల్లలు. వందలాది కోట్ల విలువగల ఫ్యాక్టరీలు, లక్షలాది విలువగల కార్లు, పెక్కు అంతస్థులుగల భవనములు, వందలాదిమంది సేవకులు, మరియు రాజకీయ పలుకుబడిగలిగి అతడు జీవించుచుండెను.

ఇలా సమస్త భోగములతో విలాస జీవితము గడుపుచుండిన ఆ కోటీశ్వరునకు 40వ యేట అనారోగ్యముతో మృత్యువు సంభవించెను.

అతనికి తిరిగి మానవ జన్మ వచ్చెను. ఇంతవరు కోటీశ్వరుడుగా వున్న ఆ వ్యక్తి చనిపోయి కర్మవశాత్తు తనవద్ద నౌకరుగా వున్న సేవకుని ఇంటిలో జన్మించెను: అతను పెరిగి పెద్దవాడై 10 సంవత్సరముల వయస్సుగలవాడయ్యెను. అతని జన్మలో ఒక ప్రత్యేకత గలదు.

గత జన్మ దినచర్యలు అన్నియు అతనికిపుడు జ్ఞాపకమునకు వచ్చెను. అతడు తన పూర్వపు ఇంటిని సమీపించి- "నేను కోటీశ్వరుడననియు, ఈ కారు, ఈ ఇల్లు, యావదాస్తి నాదేయనియు, మీరంతా నేను చెప్పినట్లు ఆచరించ వలయుననియు" పలుకుచుండ ఇతనికి మెదడు చెడినదని, పిచ్చి పట్టినదని తలంచి ఇంటివారు పిచ్చాసుపత్రికి పంపిరి.

అతను చెప్పిన ప్రతి మాటలోను యథార్థమున్నది. అతను పూర్వపు తన తల్లిపేరు, తండ్రిపేరు, ఇంటిలోని వస్తువుల గుర్తులోత సహా చెప్పుచుండెను. అయినా ఆ వస్తువులు అతనికిచ్చెదరా? ఆ కారు వాడుకొనుటకు అంగీకరించెదరా? ఆ భవనములో వుండుటకు ఒప్పుకొందురా!

నాయనా! ఒక విషయము ఆలోచించు. ఆ సమస్త రాజ భోగములకు, వస్తువులకు గత జన్మలో నీవే యజమానివి. నీ మాట కాదని నీ సేవకుడు అనడు. నీ ఆజ్ఞ వారికి శిరోధార్యము. ఈ రోజు నీ కండ్లముందే ఆ కార్లు తిరుగుచున్నవి. అయినను నీవు స్కూలుకు వెళ్ళుటకు కనీసము సైకిలు కూడ నీకు లేదు. కాలి నడకన వెళ్ళుచున్నావు. నివసించుటకు మంచి ఇల్లు లేదు. పూరి గుడిసెలో తల దాచుకొని నేలపైన పరుండుచున్నావు! తినుటకు కడుపునిండా తిండిలేదు. ఒకపూట కాస్త గంజి త్రాగుచు జీవితమును వెళ్ళబుచ్చుచున్నావు.

నీ కండ్లముందే నీ ఆస్తి, ఐశ్వర్యము నీవు చూస్తూ నీకు గుర్తుకువస్తున్నా, వాటిని నీవు అనుభవించుటకు వీలు లేకపోవు విషయమును నీవు ఒక్కసారి ఆలోచిస్తే, ఏది నీ వస్తువు? ఈ వస్తువులు, వాహనాలు, భవంతులు శాశ్వతములు కావని ఇప్పటికైనా గ్రహించి, వెంట వచ్చి ఆపత్తులలో ఆదుకొనునది పుణ్యమేయని భావించి అట్టి పుణ్యమును మహాత్ములు బోధించు పుణ్య మార్గము లద్వారా సంపాదించుము. పుణ్యకార్యములు చేసి, జప ధ్యాన దాన ధర్మములను గావించుచు భగవద్భక్తిని పెంపొందింపచేసుకొనుచు జీవితమును గడుపు. ఆ పుణ్యమే నీ వస్తువై ఎల్లపుడు నీ వెంట వచ్చి, నీదై నీకు శాంతి సుఖములను ప్రసాదించగలదు. ఆ పుణ్యమే నీకు శ్రీరామ రక్ష.

# 67) నవగ్రహాలు

సూర్యునిచుట్టూ ఉన్న గ్రహాలు 9.

1. మెర్క్యూరీ (బుధుడు) - సూర్యునికి 3 కోట్ల మైళ్ళ దూరములో ఉన్నది. సూర్యుని ప్రదక్షిణ చేయుటకు 28 రోజులు పట్టును. దీనికి చంద్రుళ్ళు లేరు.

2. వీనస్సు (శుక్రుడు)- సూర్యునికి 7 కోట్ల మైళ్ళ దూరం. ఇది సూర్యుని చుట్టూ తిరుగుటకు 325 రోజులు పట్టును.

3. భూమి- సూర్యునికి తొమ్మిదికోట్ల మైళ్ళదూరము. సూర్యుని చుట్టుటకు 1 సంవత్సరము పట్టును.

4. మార్సు (అంగారకుడు)- సూర్యునికి 14 కోట్ల మైళ్ళదూరము సూర్యుని ప్రదక్షిణ చేయుటకు 687 రోజులు పట్టును. ఈ మార్సు చుట్టూ రెండు చంద్రుళ్ళు తిరుగుచున్నాయి.

5. జ్యూపిటర్ (బృహస్పతి)-సూర్యునికి 47 కోట్లమైళ్ళ దూరం. సూర్యుని చుట్టూ తిరుగుటకు 12 సంవత్సరములు పట్టును. ఈ జ్యూపిటర్ చుట్టూ 9 చంద్రుళ్ళున్నారు.

6. శాటర్న్ (శని)- సూర్యునికి 68 కోట్లమైళ్ళ దూరం. సూర్యప్రదక్షిణానికి 30 సంవత్సరములు పట్టును.

7. యురేనస్సు- సూర్యునికి 180 కోట్లమైళ్ళ దూరములో ఉన్నది. సూర్యుని చుట్టూ తిరుగుటకు 84 సంవత్సరములు పట్టును

దీనిచుట్టూ 4 చంద్రుళ్ళు ఉన్నారు.

8. నెప్ట్యూను- సూర్యునికి 350 కోట్లమైళ్ళ దూరం సూర్యుని చుట్టుటకు 165 సంవత్సరములు పట్టును. దీనిచుట్టు ఒక చంద్రుడు ఉన్నాడు.

9. ప్లూటో - సూర్యునికి 694 కోట్లమైళ్ళు దూరం సూర్యుని చుట్టూ తిరుగుటకు 2 50 సంవత్సరములు పట్టును.

ఈ విధంగా సూర్యునిచుట్టూ తిరుగు ఈ నవగ్రహాలు, వాటి చంద్రుళ్ళు కలిసిన కుటుంబం పేరే సూర్యమండలం అందురు.

# 68) లోభానికి సంకెళ్ళు

కామ, క్రోధ, లోభాలు మూడున్ను మూడు నరకద్వారాలని శ్రీకృష్ణ పరమాత్మ గీతయందు స్పష్టంగా చెప్పియున్నారు. ఈ మూడు దుర్గుణాలు చేరి జీవుని పాతాళానికి అణగద్రొక్కి వేస్తూంటవి. కాబట్టి వీటిబారినుండి జీవుడు ఎంత శీఘ్రంగా తప్పుకుంటే అంతమంచిది.

లోభమంటే పిసిరిగొట్టుతనం. లోభికి త్యాగబుద్ధి ఏమాత్రం వుండదు. డబ్బు కూడబెట్టి, కూడబెట్టి లోభి అకస్మాత్తుగ కన్నుమూస్తాడు. తానుతినడు ఒకడికి పెట్టడు. జీవితంలో ఒక్క కాకికైనా మెతుకు పెట్టడు. ఒక్క పిల్లికైనా బిచ్చం వేయడు. అన్నం తినేటప్పుడు నేతిగిన్నె ప్రక్కన పెట్టుకుంటాడే కాని నేయి వేసికోడు.

నిధిని సర్పం కావలికాచునట్లు, తన డబ్బుకు అతడు కాపలాదారుగ ఉండునే కాని దానిని వినియోగించడు.

తేనెటీగలు కష్టపడి సంపాదించిన మధువును ఇతరులకు ధారబోయునట్లు, లోభి జీవితాంతము వఱకు ధనరాసుల్ని సంపాదించి సంపాదించి తుదకు ఏ ప్రభుత్వానికో, ఏ జ్ఞాతులకో ఇచ్చి వెళ్తాడు.

డబ్బుకు వారసులు నలుగురచ-

చత్వారో విత్త దాయాదాః<br>
ధర్మ భూపాగ్ని తస్కరాః<br>
జ్యేష్ఠ భ్రాత్రవమానేన<br>
త్రయః కుప్యన్తి సోదరాః

ధర్మము, రాజు, అగ్ని, దొంగ - వీరు నలుగురు డబ్బుకు వారసులట. వీరిలో జ్యేష్ఠుడగు ధర్మానికి డబ్బును ఖర్చుపెట్టకపోతే తక్కిన ముగ్గురు తమ్ములు కోపగించి ఆ డబ్బును స్వాధీనం చేసికొందురని జనవాక్యం.

కాబట్టి డబ్బును ధర్మకార్యాలకు వినియోగించాలి. లోభి అట్లా చేయడు. అందుకే తాను కష్టపడి సంపాదించినదంతా ఇతరులకు ధారబోసి తనదారిని తాను చక్కాపోతాడు.

కోటికిని పడగెత్తి
కొండంత ధనమును
కూడబెట్టిన నేమి మనసా
దానధర్మము లేక
దాచిన సొమ్మంత
పరుల పాలైపోవు మనసా.

అని ఒక కవిపుంగవుడు ఎలుగెత్తి చాటాడు. కనుక నరక ద్వారమగు ఈ లోభాన్ని ముముక్షువు ఏ మాత్రము దరికి జేర్చక దానికి సంకెళ్ళు తగిలించి విశాలభావము కలవాడై, దాతృత్వబుద్ధికి తన హృదయంలో చోటిచ్చి బీదసాదలను ఆదుకొంటూ, నిస్వార్థబుద్ధితో మెలగాలి. అపుడే మనస్సు నిర్మలమౌతుంది. అపుడే దైవానుగ్రహానికి ఆస్కారముంటుంది. ఆత్మానుభూతి కలుగుతుంది.

ఇక లోభానికి తగిలించే సంకెళ్ళేమిటో ఒకింత విచారిస్తాం. లోభబుద్ధిని పోగొట్టటానికి మనస్సుకు బాగా హితబోధ చెయ్యాలి-

"ఓ మనస్సా! ఈ లోకానికి వచ్చేటప్పుడు నీవేమైనా వెంట తెచ్చావా? ఈ లోకాన్ని విడిచివెళ్ళేటప్పుడు ఏమైనా వెంట తీసుకుపోతావా? మటి మధ్యలో వచ్చిన ఈ సంపదపై అంత

మమత్వమెందుకు? దానధర్మాలకు వినియోగించి పుణ్యం ఎందుకు సంపాదించగూడదు? ఓ మనస్సా! అలసింపకు, త్వరపడుము, ఇప్పటికే చాలాకాలం వ్యర్థంగా గడచిపోయింది. భగవంతునిపై అపారమైన విశ్వాసం కలిగి, త్యాగశీలత్వం అవలంబించి శేషించిన ఆయుస్సును ధర్మకార్యాలలో సద్వినియోగం చెయ్యి" మనస్సుకు చేయు ఇట్టి హితబోధయే లోభానికి సంకెళ్ళు ఇట్టి వివేకమే లోభబుద్ధిని అరికట్టు ఆయుధం. దీన్ని ఆశ్రయించి నరకద్వారాలను తట్టుచున్న మనస్సును వెనక్కి మరల్చి కుమార్గానికి బోనీయక, అంతర్ముఖం చేసి ఆత్మయందు స్థాపించి జీవుడు పరమానందమనుభవించును గాక!

# 69) మానవత్వము - ఒలంపిక్స్

24వ ఒలింపిక్స్ క్రీడలు కొరియాదేశములోని సియోల్ నగరములో విజయవంతముగ పరిసమాప్తమైనవి. కార్యకర్తలు బ్రహ్మాండమైన ఏర్పాట్లను చేసి అతిథి, అభ్యాగతులకు చక్కని సౌకర్యములను చేసిరి. నూట అఱువది యొక్క దేశములనుండి క్రీడాకారులు అరుదెంచిరి. సహృదయ వాతావరణంలో ఆటపోటీలు కొనసాగినవి. ఆయా దేశస్థులు తమ తమ రాజకీయ విభేదములు ఎన్ని ఉన్నప్పటికిని, వాటని విస్మరించి, అందఱును కలిసిమెలసి ఆటలలో పాల్గొనిరి. వారిదేశములు వేఱు, రూపములు వేఱు, మతములు వేఱు, వర్ణములు వేఱు, భాషలు వేఱు, ఆచారవిచారములు వేఱు, పద్ధతులు వేఱు. వారిలో కొందరు అస్తికులు కలరు. మరికొందరు నాస్తికులు కలరు. కాని అందరును ఐకమత్యముతో ఒకే త్రాటిమీది నడచుచు, సహృదయతతో మెలిగిరి. ఇదియొక విశేషమనియే చెప్పవచ్చును.

విభేదములను విస్మరించి సామరస్యముతో వర్తించుటయే మానవత్వము. దీనినే ఇంగ్లీషులో Sportsmanship- గంభీరభావము- అని చెప్పుదురు. ఇట్టి సమరసభావము ఒలింపిక్ క్రీడలలో కొట్టవచ్చినట్లు కనిపించినది. ఇట్టి విభేదరహిత ప్రశాంత వాతావరణమే మానవునికి గొప్ప విభూషణమై అలరారుచున్నది.

క్రీడలవలన, వ్యాయామము వలన దేహదార్ఢ్యము, ఆరోగ్యము పెంపొందును. కాని అంతమాత్రముతో మనపని పూర్తికాలేదు. మానసిక పవిత్రతను, చరిత్రశుద్ధిని, హృదయ నిర్మలత్వమును కూడ బడయువలెను. మనకున్నది స్థూలదేహము ఒకటియేకాదు. సూక్ష్మదేహము కూడ కలదు. అదియే మనస్సు. అదియే హృదయము

దాని ఆరోగ్యమును కూడ జాగ్రత్తక కాపాడుకొనుచుండవలెను. ఈ ప్రకారముగ, శారీరక, మానసిక ఆరోగ్యములు రెండును సిద్ధించినచో, రెండిటి యొక్క నిర్మలత్వము ఏర్పడినచో ఇక జీవితము యొక్క చరమలక్ష్యమగు దైవసాక్షాత్కారము సిద్ధించినదే యగును. అపుడే జీవునకు పరిపూర్ణ సుఖశాంతులు లభించగలవు. అపుడే మానవ జన్మము సార్థకమగును.

ఇక ఒలింపిక్స్ క్రీడలలో ప్రముఖముగ కానుపించిన మరొక విశేషము పట్టుదల. ఆటలలో పాల్గొనిన ప్రతివాదును తాను ప్రథమముగ నెగ్గి స్వర్ణపతకమును సంపాదించవలెనని గొప్ప పట్టు దలతో, దృఢనిశ్చయముతో వ్యవహరించును. ఈ పట్టుదల, ఈ ఉత్సాహము, ఈ దృఢతరదీక్ష కేవలము క్రీడలలోనే కాక, ఇతర రంగ ములందును, ముఖ్యముగ ఆధ్యాత్మరంగమందును అత్యావశ్యకము. "నేనెట్లయినను యత్నించి, ఈ జీవితమందే దైవసాక్షాత్కారమును సాధించివేయుదును. ఎన్ని ఆటంకములు వచ్చినను దృఢతరదీక్షతో ఆత్మానుభూతిని బొందుదును" అను గొప్ప పట్టుదల సాధకునకు అవసరమై యున్నది.

కాబట్టి ముముక్షువులు ఒలింపిక్ ఆటలందు పాల్గొనిన క్రీడాకా రుల భంగి జాతి విబేదములను, వర్ణభేదములను, మతవిభేదములను విస్మరించి, విశాలభావము కలవారై, గొప్ప పట్టుదల వహించి ఇంద్రియమనంబులపై విజయము సాధించి ప్రణవ పతాకమును చేతపట్టుకొని ముందుకు కొనసాగుచు ఆత్మ సాక్షాత్కారమను స్వర్ణ పతకమును కైవసము చేసుకొని జీవితములను సుఖమయములుగ నొనర్చుకొందురు గాక !

# 70) పరమార్థ విద్యాలయము

ఆధ్యాత్మిక పాఠశాలయందు మూడు క్లాసులు (తరగతులు) కలవు. ఆయా క్లాసులవారి పాఠ్యక్రమము ఈ క్రింద పొందుపఱుపబడినది-

మొదటి క్లాసు-

1) చిత్తస్య భోగైర్ద్వౌ భాగౌ శాస్త్రేణైకం ప్రపూరయేత్
గురుశుశ్రూషయా చైకమవ్యుత్పన్నస్య సత్క్రమే

(మనస్సును నాలుగు భాగములుగ విభజించి, అందు రెండు భాగములను లోక వ్యవహారములతోను, ఒక భాగమును శాస్త్ర విచారణ చేతను, తక్కిన ఒక భాగమును గురుసేవాదులతోను నింపవలెను. [దీనిని ఎలిమెంటరీ కోర్సు (Elementary Course) అని చెప్పవచ్చును.]

రెండవ క్లాసు-

2) కించిద్వ్యుత్పత్తియుక్తస్య భాగం భోగైః ప్రపూరయేత్
గురు శుశ్రూషయా భాగౌ భాగం శాస్త్రార్థచిన్తయా.

సాధనయం దొకింత పరిపక్వత బొందినవాడు మనస్సు యొక్క ఒక భాగమును లోక వ్యవహారముతోను, రెండు భాగములను గురుసేవాదులతోను, తక్కిన ఒక్కభాగమును శాస్త్ర విచారణతోను నింపవలెను. [దీనిని హైస్కూల్ కోర్సు (High School Course) అని చెప్పవచ్చును.]

మూడవ క్లాసు-

3) వ్యుత్పత్తిమనుయాతస్య పూరయేచ్చేతసోన్వహమ్
ద్వౌభాగౌ శాస్త్రవైరాగ్యైర్ద్వౌ ధ్యానగురుపూజయా.

సాధనయందు చక్కగ ఆరితేరినవాడు లోక వ్యవహారమున పూర్తిగ వదలివేసి మనస్సుయొక్క రెండు భాగములను శాస్త్రవిచారణా వైరాగ్యములతోను, తక్కిన రెండు భాగములను ధ్యానగురు పూజాదులతోను సదా నింపవలెను. [దీనిని కాలేజి కోర్సు (College Course)] అని చెప్పవచ్చును.

| | లోక వ్యవహారము | శాస్త్ర విచారణ | గురుసేవ | |
|---|---|---|---|---|
| 1. ఎలిమెంటరీ తరగతి | | $\frac{1}{2}$ మనస్సు | $\frac{1}{4}$ మనస్సు | $\frac{1}{2}+\frac{1}{4}+\frac{1}{4}=1$ |
| 2. హైస్కూలు తరగతి | | $\frac{1}{4}$ మనస్సు | $\frac{1}{4}$ మనస్సు | $\frac{1}{4}+\frac{1}{2}+\frac{1}{4}=1$ |
| 3. కాలేజి తరగతి | 0 మనస్సు | $\frac{1}{2}$ మనస్సు | $\frac{1}{2}$ మనస్సు | $0+\frac{1}{2}+\frac{1}{2}=1$ |

ఈ మూడు తరగతులకోర్సు చక్కగ చదివి, పూర్తిచేసినవారికి దైవ సాక్షాత్కారమను పట్టము (Certificate) లభించును. అపుడాతడు పరమార్థ రంగమున పట్టభద్రుడు (Graduate) కాగలడు. కావున జనులీ పరమార్థ పాఠశాలయందు ప్రవేశించి చక్కగ చదివి విజయులై బ్రహ్మానందమను వేతనమును బడయుచు సుఖముగ నుందురుగాక!

# 71) శ్రీనారాయణ గురుదేవులు

## (శ్రీ మహర్షి మలయాళస్వాములవారి పరమగురువులు)

ధర్మోద్ధరణము కొఱకును, పతితమానవజాతియొక్క సమున్నతివి స్థాపించుట కొరకును, మహావీయు లప్పుడప్పుడు పుడమిపై యవతరించుచుందురు. శ్రీ నారాయణ గురుదేవులట్టివారు. వారు ఆధునికి యుగ ప్రవక్తలు. దక్షిణభారతమున మలబారు దేశమున 1856 సంవత్సరమున జన్మించి, 72 సంవత్సరముల కాలము జీవించి, కనివినియెఱుగని అద్భుత మహత్కార్యములాచరించి, మానవకోటికి మహత్తర సేవయొనర్చి 1928 సంవత్సరములో తమ యవతారమును చాలించిరి. వారు స్థాపించిన గొప్ప గొప్ప ఆధ్యాత్మిక సంస్థలే వారి అనుపమ సేవకు నేటికిని ప్రత్యక్ష నిదర్శనముపై యున్నవి.

ఒకేజాతి, ఒకేమతము, ఒకేదేవుడు (One Race, oen Religion, one God) అనునదియే వారి సిద్ధాంతము. ప్రతి జీవియు భగవత్స్వరూపమేయను పరమసత్యమును వారు పదేపదే యుద్ఘాటించుచు జనులలో ప్రేమ, దయ, కరుణ మున్నగు దైవగుణములను వ్యాపింప జేసిరి. అనేక ధర్మసంస్థలను, మఠములను, ఆశ్రమములను, దేవాలయములను స్థాపించి తద్వారా లోకమందొక వినూతన ఆధ్యాత్మికశక్తిని రేకెత్తించిరి. నిద్రాణమై యున్న ప్రపంచమును జాగరితమొర్చిరి.

భిన్నత్వమును, భిన్నదృష్టిని రూపుమాపి ఏకత్వమును, అభిన్న పరమార్థ దృష్టిని వ్యాపింపజేసిరి. తమ తపశ్శక్తి చేత లోకములో అద్భుతలీలలను ప్రదర్శించుచు వారు సాక్షాత్ దైవమువలెనే అవనిపై సంచరించిరి. లెక్కలకొలది జనులకు గురుదేవులై పఱిగిరి. కనుకనే

వారిని 'నారాయణ గురుదేవ్' అని సంబోధించుటకు కారణము. సేవయే వారి ముఖ్యోద్దేశ్యము, పతితులను ఉద్ధరించుటయే వారి యాశయము. ప్రతి విషయమునందును సంకుచితత్వమును కడిగి వేయుటయే వారి లక్ష్యము. మఱియు విశాలదృక్పథము నవ లంబింపచేయుటయే వారి బావము. తదనుగుణ్యముగనే వారు వ్యవహరించిరి. కావుననే జనులలో బ్రహ్మాండమైన ఉత్తేజమును, నవచైతన్యమును ఉద్దీపింపజేయగల్గిరి. వీరు శ్రీ మహర్షి మలయా ళస్వాములవారికి పరమ గురువులు.

బ్రిటీష్‌వారీ దేశమున పరిపాలించుచున్న రోజులలో, భారత సంస్కృతి కుల విద్వేషముల వలన పతనావస్థలోనున్న క్లిష్ట సమయమున దక్షిణాది రాష్ట్రమైన కేరళలో శ్రీ నారాయణ గురు దేవులు జన్మించిరి. తల్లి కుట్టియమ్మ, తండ్రి మాధవ్ ఆశాన్. కేరళ రాష్ట్రమునకు ముఖ్య పట్టణమైన త్రివేండ్రమునకు కొంది దూరములోగల చంపగంది గ్రామములో వారు నివసించుచుండిరి. 1854వ సంవత్సరమున ఆగస్టు 26వ తేదీయందు శ్రీనారాయణ గురుదేవులు జన్మించిరి. వారు బాల్యకాలము నుండియు గొప్ప సాంఘిక సంస్కర్త. అస్పృశ్యత వారికి గిట్టనే గిట్టదు. చిన్నకాలమున వారు అస్పృశ్యుల దగ్గరకు వెళ్ళి వారిని కౌగలించుకొని తిరిగి ఇంటి కివచ్చి తన కుటుంబసభ్యులను ముట్టుకొనుచుండువారు. వారిని తాకినంత మాత్రమున ఏ హానియు కలుగదని ప్రయోగాత్మకముగ వారు నిరూపించిరి.

శ్రీ నారాయణ గురుదేవులు చిన్నవయస్సునందే సంస్కృత సాహిత్యము నేర్చెను వేదాంతాధ్యయనము గావించెను. ధ్యానము, యోగసాధనలు చేయుచుండెను. ప్రఖ్యాత భారతీయ ఇతిహాసములైన రామాయణ, బారతముల యెడల వారికి ఆసక్తి జనించెను. వాటిని చక్కగ అధ్యయనము చేసిరి. కొంత కాలమునకు అద్వైంగో అను

గ్రామము నందు శ్రీ నారాయణులు సంస్కృతమును బోధింప దొడగిరి. తదుపరి వారు అనేక ఆధ్యాత్మిక గ్రంథములను పఠించిరి.

తదుపరి వారికి మోక్షము యెడల కాంక్ష పెరిగి పెక్కు ప్రదేశములు సంచరించిరి. తుదకు కన్యాకుమారి జిల్లాలోనున్న మరుత్వాన్ కొండలలో ఒక గుహలో నివసించుచు, కందమూలాదులను సేవించుచు బహుకాలము తపస్సు చేసిరి. ఆ కొండగుహలో ఏకాంతముగ ఒకే ముద్రలో గంటలకొలది కూర్చుని ధ్యానించుచుండిరి. కొంతకాలమునకు వారికి జ్ఞానోదయమయ్యెను. వారు శివాష్టకము, సుబ్రహ్మణ్యస్తోత్రము, గుహాష్టకము మున్నగు గ్రంథములను వ్రాసిరి. సమకాలీన జ్ఞానులలో శ్రీ నారాయణగురుదేవులు చాల గొప్పవారు. దేవుని యెడల, జీవునియెడల పరమ ప్రీతికలవారు.

అట్టి మహనీయుల పవిత్రాచరణ, దివ్యప్రబోధము మానవకోటికి పరమాదర్శములై యున్నవి. వారి యడుగుజాడలలో నడచుటయే జనులకు మహత్తర శాంతి చేకూరగలదనుటలో ఏ సంశయమును లేదు. కాబట్టి వారు కావించిన అమూల్యపారమార్థికోపదేశములను లెస్సగ కార్యాన్వితమొనర్చుకొని, వారు చూపిన విశాలదృక్పథమును చక్కగ అలవఱచుకొని, సంకుచితభావములను పారద్రోలి జనులు పవిత్రాత్ములై వెలయుదురుగాక!

# 72) జనమేజయ మహారాజు

ఒకనాటి చరిత్రము గతచరిత్ర అంటారు. అట్టి గత చరిత్రను సాంగో పాంగముగ అందించుటకు రచయితలు పూనుకుంటుంటారు. అట్టి పురాతన రచయితలలో ముఖ్యులు వేదవ్యాసమహర్షి. వారు అనేక చారిత్రాత్మక చరిత్రలు మనకందించారు. వాటిలో ముఖ్యమైనది మహాభారతము. అట్టి మహాభారతములో ఒక భాగమైన జనమేజయ వృత్తాంతమును గురించి కొస్త తెలుసుకుందాము.

పరీక్షిన్మహారాజు కుమారుడయిన జనమేజయ మహారాజు ఒక నాడు సభాభవనములో సింహాసనాసీనుడై తన పురోహిత, మంత్రి, సామంత, బంధువర్గ సపరివార సమేతముగా ఏవేవో సమాలోచనలు చేయుచుండెను. ఆకస్మికముగా ఒక ద్వారపాల కుడు వేగముగా వచ్చి "మహారాజా ఎవరో ఒక భూసురోత్తము ఉతమ దర్శనం కొరకు వేంచేసియున్నాడ"నెను. "వెంటనే వారిని లోపలికి పంపించు" అని ఆజ్ఞాపించాడు జనమేజయ మహారాజు. అలాగే అన్నాడు ద్వారపాలకుడు.

మహాతేజశ్శాలియైన ఒక బ్రాహ్మణోత్తముడు లోనికి రాగానే రాజు రెండు చేతులను జోడించుకొని భక్తిపూర్వకముగ నమస్కరించి అర్ఘ్యపాద్యాది విధులతో ఆబ్రాహ్మణుని పూజించి :

"మహాత్మా! తమరు ఎవరు? ఏ కార్యార్థమై ఇక్కడికేతెంచారు? పవిత్రమైన మీ పాదపద్మాల స్పర్శతో మా సభాభవనం పునీత మైంది. తమ రాకకు కారణం సెలవివ్వండి" అన్నాడు జనమేజయ మహారాజు.

"రాజా! నా పేరు ఉదంకుడు. నా రాకకు కారణం అడిగారు. చెప్తున్నాను వినండి" అని ప్రారంభించాడు ఆ బ్రాహ్మణోత్తముడు.

"ఒక నీచుడు అహంకారముతో గర్వముతో నిష్కారణంగా నాకు అపకారం చేశాడు. అంతేకాదు ఆ పాపాత్ముడు విశ్వవిఖ్యాతమైన చంద్రవంశానికి వెలుగురేఖయై వెలిగిన నీ తండ్రియగు పరీక్షిన్మహారాజును క్రూరమైన విషాగ్నులతో కాల్చి చంపాడు" అని క్లుప్తంగా ముగించాడు ఆ వచ్చిన విప్రుడు.

"తుంటరితనం తలకెక్కిన ఆ పొగరుబోతు ఎవరో తెలియచేయండి హరిహర బ్రహ్మాదులు అడ్డుకున్నా, అనంత ప్రకృతి మహాశక్తులు ప్రతిఘటించినా అతనిని విడవను. అతనిని నిలువునా చీల్చి రక్తధారలను దోసిటపట్టి నా తండ్రికి తర్పణం విడుస్తాను. చెప్పండి స్వామీ ఎవడా పాపిష్టి కిరాతకుడు" అని జనమేజయుడు కోపముతో ఊగిపోతూ ప్రశ్నించాడు.

" ఆ పాపిష్టి జన్ముడు తక్షకుడు" అని ముక్తసరిగ చెప్పి మౌనము వహించాడు ఉదంకుడు.

జనమేజయుడు పండ్లు కొరుకుతూ సభాభవనము అంతయూ కలియచూచి "ఈ విషయము ఎందుకు ఇంతకాలము దాచావు?" అని మహామంత్రిని అడిగాడు.

అందుకు సమాధానముగా- "చిరంజీవి! నీ పసితనములో జరిగిన ఈ దారుణ సంఘటనను నీకు తెలియచేసి నీ మనస్సును కృంగదీసి అశాంతతి చేయవద్దని నీ తల్లియగు ఐరావతీదేవి మాకు అప్పట్లో ఆజ్ఞాపించారు. ఆ బ్రాహ్మణుడు చెప్పింది యథార్థమే! శృంగి అనే మునిబాలుడు శపించిన కారణంగా తక్షకుడే నాన్నగారిని కాటువేసి చంపాడు" అన్నారు మహామంత్రి.

"సాటిలేని మేటి పరాక్రమవంతుడైన నా తండ్రిని ఒక సామాన్య క్షుద్ర సర్పం వంచనచేసి దారుణమైన దుర్మరణానికి పాల్పడచేసిందన్న బాధ నా హృదయంలో రంపపుకోతయై హింసిస్తుంది. ఈ

అపకారానికి ప్రతీకారము చేయనిదే నా మనస్సు శాంతించదు. నా తండ్రి ఆత్మకూడ సంతుష్టి చెందదు. ఆ విషయం తర్వాత నిర్ణయించుకుందాం. ముందు నా తండ్రి అకాలమరణ గాధను వివరంగా తెలుసుకో దలచినాను" అన్నాడు జనమేజయుడు మహామంత్రితో.

మహామంత్రి గొంతును సరిచేసుకొని చెప్పుటకు ఉపక్రమించాడు. జనమేజయునితో పాటు ఉదంకుడు సభికులు ఆ గాధను వినుటకు చెవులను సరిచేసుకొని ఉత్కంఠులై వున్నారు.

## ౩) పరీక్షిత్ - పాము

మహామంత్రి జనమేజయునకు ఇలా చెప్పెను :

మీ ముత్తాతగారైన యుధిష్ఠిరమహారాజు మీ తండ్రిగారైన పరీక్షిన్మహారాజుకు పట్టం కట్టి సింహాసనమును అధిష్టింపచేసిన పిదప పూర్వుల అడుగుజాడలలో నడుస్తూ రాజ్యాంగాన్ని న్యాయమార్గంలో సంరక్షిస్తూ వచ్చారు. మీ నాన్నగారు అప్రతిహతమైన పరాక్రమశాలి. వన్యమృగాల వలన ఆటవిక ప్రజలు నానాయాతనలు పడుచుండుట గమనించి మునిజనులు కూడా వాటి బాధ తప్పించాలనే సంకల్పముతో పరివారసమేతుడై ఒకనాడు వేటకు వెళ్ళాడు.

ఒకచోట క్రూరమృగము వారి కంటబడింది. దానిని వధించాలనే ధ్యేయముతో దానిని తరుముకుంటూ పరివారాన్ని కూడ విడిచిపెట్టి చాలాదూరం వెళ్ళాడు పరీక్షిత్తు. మధ్యాహ్నామయింది. ఎండ వేడి అధికమైంది. నోరు ఎండిపోయింది. నీరు కరువాయెను. ఎక్కడ వెతికిన దోసెడు నీరు లభించలేదు. అలసిపోయి నీటి కొరకు తిరుగుచుండగా ఒక ముని వాటికి కనిపించెను.

అది శమీక మహర్షి ఆశ్రమం

ఆ సమయంలో శమీక మహర్షి సర్వస్వము మరచి నిశ్చల మనస్సుతో ధ్యాన నిమగ్నుడై యుండెను. త్రాగుటకు నీరులేక కోరెండిపోవుచున్న సంకటస్థితిలో వున్న పరీక్షిన్మహారాజు "దాహం వేస్తోంది స్వామీ! కాస్త మంచినీరు ఇప్పించండి, రక్షించండి, కరుణించండని" ఎన్ని పర్యాయాలు అడిగినా ధ్యానములో నిమగ్నుడైన శమీక మహర్షికి ఆ మాటలు వినిపించలేదు.

## పరీక్షిత్తు అవమానంగా భావించుట

ఈ తాపసి నన్ను అగౌరవపరుస్తాడా? మంచినీరు ఇమ్మి ప్రార్థిస్తే మౌనము వహిస్తాడా? తాపసులకింత అహంకారమా? అని ఆవేశముతో అటు ప్రక్కనే చచ్చి పడివున్న పామును తీసి మహర్షి మెడలో వేసి తన దారిన తాను వెళ్ళాడు పరిక్షిత్తు. అలా వెళ్ళిన పరిక్షిత్తు తన పరివారముతో కలసి రాజధాని చేరాడు.

## పిడుగువంటి వార్త

శమీక మహర్షి పుత్రుడగు శృంగి కొంత సమయానికి ఆశ్రమము చేరి తండ్రి మెడలోని చచ్చిన పామును చూచి "ఏనాడు ఎవరికిని ఇసుమంత ద్రోహము చేయతలపెట్టని మహా సాత్త్వికుడయిన నా తండ్రిని అవమానపరచిన వ్యక్తి ఈ రోజు నుండి 7 దినములలోగా తక్షక విషాగ్నికి భస్మమై పోవుగాక!" అని శపించాడు.

## శాప ఉపశమనమునకై శమీక మహర్షి ప్రయత్నించుట

కొంత సమయానికి శమీక మహర్షి ధ్యానసమాధి నుండి లేచి తన కుమారుడు తొందరపాటుతో, ఆవేశముతో చేసిన శాపాన్ని తెలుసుకొని. దానిని ఉపసంహరించు కొమ్మని కుమారుడు అగు శృంగిని ఆదేశించాడు. అది అసాధ్యమని తన వశములో లేదని ఉపసంహరణ విధానము తనకు తెలియదని శృంగి జవాబిచ్చెను.

ఆవేశముతో తన కుమారుడు చేసిన తప్పిదనాన్ని పరిక్షిత్తుకు తెలియచేయుమని తన శిష్యున్ని పంపాడు శమీక మహర్షి.

## ఒంటి స్తంభం మేడ

ఈ అశుభవార్త విన్న పరీక్షిన్మహారాజు జరిగిన దానికి దుఃఖించి ఆవేశము అనర్థములకు మూలమని గ్రహించి శాపము నుండి తనను తాను రక్షించుకొనుటకు మార్గమును అన్వేషించుటలో నిమగ్ను డాయెను. మంత్రులు సామంతులు కలసి అప్పటికప్పుడే ఒక ఒంటి స్తంభము మేడను తయారుచేయించి అందులో పరీక్షిన్మహారాజును వుంచిరి. ఆ మేడ చుట్టూ అప్రతిహతులైన వీరభటులను సేనానా యకులను కాపలాగా వుంచి ఎట్టి క్లిష్టపరిస్థితినైనను ఎదుర్కొనుటకు కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లు చేసిరి.

దేశవిదేశాల నుండి సుప్రసిద్ధులైన సిద్ధహస్తులైన విష వైద్యులను, మంత్రగాళ్ళను రప్పించిరి. ఇంత గట్టి భద్రతా ఏర్పాట్ల మధ్య పరిక్షిత్తు భగవన్నామస్మరణ చేస్తూ 6 రోజులు చక్కగ కాలం గడిపెను. శాపగండం నుండి గట్టెక్కుటకు మరొక్క రోజు మాత్రమే వుంది. అది కీలకమైన రోజు, చీమను కూడ లోపలికి అనుమతించము అను రీతిలో అప్రతిహతమై భద్రతా ఏర్పాట్లు చివరి రోజగు ఏడవరోజు చేయించిరి.

ఇలా వుండగ హస్తినాపురములోని ఒక పౌరుడు కట్టెల కొరకై అడవికి వెళ్ళి ఏదో ఒక వింతైన వార్తను తెచ్చాడని కొందరు రక్షక భటులు ఆ వ్యక్తిని నా వద్దకు తీసుకొని వచ్చిరి అన్నాడు. మహామంత్రి.

"ఆ వ్యక్తి తెచ్చిన వార్త ఏమిటి?" అని చాలా కుతూహలంగా అడిగాడు. జనమేజయ మహారాజు.

# b) హస్తినాపురమందలి ఒక పౌరుడు చెప్పిన అద్భుత విషయము

"ఓ మహారాజా! ఆ పౌరుడు తాను అనుభవించిన విషాదాన్ని నాతో ఇలా చెప్పెను"- అన్నాడు మహామంత్రి.

"ఈ రోజు కట్టెలు కోసం పోయి ఒక అద్భుతమైన, ఆశ్చర్య కరమైన విషయాన్ని చూచాను. ఈ రోజు లేచిన వేళ మంచిది కావుననే నేను తిరిగి రాగలిగాను. తక్షకుని విషాగ్నికి బూడిదనై ఒక మహానుబావుని మంత్రశక్తిచే బ్రతికి బయటపడగలిగాన" న్నాడు ఆ పౌరుడు.

"అడవిలో చాలా దూరం వెళ్ళితిని. ఒకచోట చాలా పెద్ద చెట్టు నాకంట పడినది. దానిపై నేను అధిరోహించి కొమ్మలు నరుకుటకొరకు ఆలోచిస్తున్నాను. ఉన్నట్లుండి నా చూపు క్రిందకు పడింది. ఎక్కడనుండో ఊడిపడ్డట్టు ఒక బ్రాహ్మణుడు అక్కడ కనుపించాడు. ఎవరి కోసమో ఎదురుచూస్తున్నట్లున్నాయి. అతని చూపులు. మరికొద్దిసేపట్లో మరో బ్రాహ్మణుడు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ఆ దారిన పోవుచుండెను. ముందుగ చెట్టువద్దకు వచ్చిన బ్రాహ్మణుడు ఆయనకు అడ్డుతగిలి ఎరురు స్వామీ? మీరు ఎక్కడికి అంతత్వరగా వెళ్ళుచున్నారు" అని అడిగెను.

## కాశ్యపుని వృత్తాంతము

"నా పేరు కాశ్యపుడు. ధర్మాత్ముడయిన మా మహారాజుకు ఒక మునిబాలుని వలన సంక్రమించిన శాపమగు తక్షక విషాగ్నిని ప్రతిఘటించి బ్రహ్మదేవుడు నాకు ప్రసాదించిన సంజీవిని మహామంత్రముతో మహారాజు ప్రాణాలను రక్షించాలని పోతున్నా" నన్నాడు కొత్త బ్రాహ్మణుడు.

"అది నీ వశం కాదు. సామాన్యమైన మంత్ర తంత్రాలకు అప్రతిహతమైన తక్షకుని విషం విరుగుడు పడదు. వృథాప్రయత్న ముతో నవ్వులపాలు పడుటకంటే వచ్చిన దారిన వెళ్ళండి" అన్నాడు మొదటి బ్రాహ్మణుడు.

"మీరు పొరబడుతున్నారు. కాలకూడ విషమైనా నా మంత్ర ప్రభావము ముందు నిస్తేజమై పోతుంది. అల్పమైన తక్షక విషం నాకొక లెక్కకాదు" అన్నాడు రెండవ బ్రాహ్మణుడు.

"అయితే పరీక్షిత్తుకు బ్రతికిస్తానన్నావే. ధైర్యం వుందా?"

"నీకు నేను చెప్పటమెందుకు? రేపు ఈ పాటికి అట్టి సంతో షవార్త దేశదేశాల ప్రజలతో పాటు మీరు కూడ స్వయంగా తెలుసుకుంటారు. దయచేసి సెలవివ్వండి. ఇప్పటికే చాలా కాలం యాపన జరిగింది. తక్షకుని క్రూరవిషాగ్నినుండి నా సర్వశక్తులను ధారపోసి మహారాజును కాపాడుకోవాలి"- అని ఆ బ్రాహ్మణుడు అడుగు ముందుకు వేయబోగానే-

ఇంతవరకు ప్రశ్నల వర్షం కురిపించిన మొదటి బ్రాహ్మణుడు "ఆగండి. నేను తక్షకుణ్ణి." ఇదిగో ఫలవృక్షములతో కళకళలాడుచున్న ఈ మహావృక్షాన్ని కాటు వేస్తాను. ఒక్క పుష్పం వాడకుండా ఒక్క ఫలం కందిపోకుండా ఈ చెట్టును ఆశ్రయించుకొనియున్న ప్రాణుల తోపాటు యథావిధిగా పునరుజ్జీవించేయగలరేమో ప్రయత్నించండి. అప్పుడు తేలిపోతుంది మీరు నిజంగా మీ మహారాజును బ్రతికించ గలరో లేదో" అంటూ ఆ బ్రాహ్మణుడు ఉన్నట్టుండి భయంకరమైన ఒక పెద్ద పాముగ మారిపోయాడు. అగ్నికణాలు విరజిమ్ముతున్న నోరు తెరచి నేనున్న చెట్టును కాటువేశాడు. వెంటనే ఆ వృక్షముతోపాటు నేను కూడ విషజ్వాలకు ఆహుతియై పోయాను. మరికొద్ది సేపటికి చెట్టు యథాప్రకారం వుంది. నేను నా స్థానములోనే వున్నాను.

తక్షకుడు మరలా బ్రాహ్మణుడిగా మారి కాశ్యపునితో "స్వామీ, మహాత్మా! ఎదురులేని నా విషాగ్నికి తిరుగువుందని నిరూపించుకొన్నారు. మీ సంజీవని మంత్ర మహిమ అద్భుతమైందని అంగీకరిస్తున్నాను. కాని ఈ చెట్టును బ్రతికించినట్లే పరీక్షిత్తును మాత్రం మీరు బ్రతికించరాదు. అమోఘమైన మునివాక్కు మొక్కపోవడం మంచిదికాదు. ఇదిగో ఈ మణిపూర్ణములైన ధన రాసులను స్వీకరించి మీ ప్రయత్నము విరమించుకోండి" అని తన ప్రభావముతో అప్పటికప్పుడు ధనరాసులను సృష్టించి కాశ్యపుని ముందుంచాడు తక్షకుడు. అని వివరించాడు పౌరుడు.

ఈ విషయము తెలుసుకొన్న వెనువెంటనే తోటి మంత్రులను సమావేశపరచి కొత్తవారిని ఎవరిని నగరములో ప్రవేశించనీయకూడదని ఉత్తర్వులు చేశాను. అనుమానితులను నిర్దాక్షిణ్యముగా చెరలో వేయుమని రాజభటులకు వివరించాను. నేను క్షణం క్షణం మహారాజు యోగక్షేమాలు విచారించుకుంటూ అన్ని ఏర్పాట్లను పర్యవేక్షణ చేసుకుంటూ ఎలాగైనా ఈ గండంనుండి మా రాజు గారిని రక్షించమని భగవంతుడ్ని ప్రార్థిస్తూ వుండిపోయాను. ప్రొద్దు క్రమముగా పడమటి దిశగా వాలింది. ఏ ఉపద్రవం లేకుండా సాయంకాలం అయింది. ఇక కొద్దిసేపట్లో సూర్యుడు అస్తమించే వేళ సమీపిస్తూ వుండగ భవన సంరక్షణభారాన్ని స్వయంగా పర్యవేక్షించుచున్న తరుణములో రాజుగారి అంగరక్షక భటుడు వచ్చి అత్యవసరంగా పరీక్షిన్మహారాజుగారు రమ్మంటున్నట్లు చెప్పాడు. వెంటనే వడివడిగా రాజుగారి వద్ద కేతెంచితిని.

అప్పటికే అక్కడ పదిమంది బ్రాహ్మణులు నాన్నగారి ముందు ఫలపుష్పాలున్న బంగారు పళ్ళెరాన్ని వుంచుతూ నాకు కనిపించారు. ఆ బ్రాహ్మణులను చూడగానే నాకు అనుమానం కలిగింది. 'ఎవరు

మీరు? మాకు తెలియకుండా ఇక్కడికి ఎలా వచ్చారు?' అని గద్దించి అడిగాను. వారు జవాబు చెప్పకుండా మీ నాన్నగారగు పరీక్షిన్మహారాజును చూచి నవ్వారు. నాకు ఇంకా సందేహము కలిగింది. ఈ బ్రాహ్మణులు మీ నాన్నగారికి ఇచ్చిన ఫలాన్ని చూచి ఆయన సంతోషముతో 'మహామంత్రి భగవంతుడు పంపిన దేవ దూతలు వీరు. వీరిచ్చిన ఈ ఫలము ఎంత సువాసనతో అందముగ వుందో! చూడుము' అని అంటూండగనే ఫలములో నుండి ఒక పురుగు బయటకు వచ్చి పెద్దదిగా మారుతున్నది. 'మహారాజా! ఇది ఏదో మాయాజాలముగా వుంది. ప్రమాదభూయిష్టంగా వుంది. ఆ పండును విసిరిపారేయండి. వీళ్ళను బంధించుటకు అనుమతి యివ్వండి' అని రాజుగారిని ప్రాధేయపడ్డాను. రాజుగారు అదేదీ వినిపించుకొనక వాళ్ళతో 'మీకేమి కావాలో కోరుకోండి' అనగానే వారు 'మాకు మీ ప్రాణాలు కావాలి మహారాజా!' అన్నారు నరరూపములో వున్న విషసర్పాలు.

### మారువేషంలో తక్షకుడు

'మేము నిజమైన బ్రాహ్మణులం కాము. తక్షకుని ప్రార్థనచే బ్రాహ్మణ రూపం ధరించి అదృశ్యరూపంలో మీ భవనంలో ప్రవేశించిన నాగకుమారులం' అంటూ క్షణాలలో వారు మాయమ యిపోయిరి. మరుక్షణం నాన్నగారి చేతుల్లోని పండులో వున్న చిన్న పురుగు పెరిగి పెరిగి తక్షకుడుగా మారి మీ నాన్నగా రగు పరీక్షిన్మహారాజును దారుణంగా కాటువేసి మాయమైపోయెను. వెంటనే నాన్నగారు ఆ విషాగ్నికి మాడిపోయిరి. అని మహామంత్రి జనమేజయ మహారాజుకు వివరించెను.

## c) సర్పయాగం

తన తండ్రియగు పరిక్షిన్మహారాజుకు జరిగిన మరణ వృత్తాంతమంతయూ మహామంత్రి ద్వారా వినిన జనమేజయ మహారాజు మనస్సుకు చిరాకు కలిగెను. "నా తండ్రికి అకాల మృత్యువును కలిగించిన తక్షకుని, అతనికి సహకరించిన నాగులను నిలువునా కాల్చి భస్మం చేయనిదే నాకు మనశ్శాంతి వుండదు. మహామంత్రీ వెంటనే నాగలోకం మీదికి యుద్ధం ప్రకటించండి" అన్నాడు జనమేజయ మహారాజు.

## ఉదంకుడు ఇలా అన్నాడు

"మహారాజా! అట్టి అవసరం లేకుండానే చతుర్దశభువనాల్లో వున్న సర్పాలన్నీ మీవద్దకే వచ్చి చచ్చిపోయే సులభమైన పద్ధతొకటుండి" అన్నాడు. "ఏమిటో ఆ పద్ధతి త్వరగా సెలవివ్వండి" అన్నాడు జనమేజయ మహారాజు. 'సర్పయాగం చేయండి' ఆ మహాయజ్ఞం చేస్తే శత్రుభంజనం, మిత్రరంజనం కలుగుతాయి "అయితే అట్టి యజ్ఞం ఎలా, ఏ విధంగా చేయాలో మీరే దగ్గరుండి చేయించండి" అన్నారు రాజుగారు. "మహాభాగ్యం" అన్నాడు ఉదంకుడు.

## యజ్ఞమండపం

హస్తినాపురి వెలుపల విశాలమైన మైదానములో పురప్రజలు క్రిక్కిరిసిపోయారు. దేశదేశాలనుంచి మిత్రులు, బంధువులు అనేకులు వచ్చి చేరారు. మరియు మునులు, మునీశ్వరులు ఎందరో ఏతెంచిరి. జనమేజయ మహారాజు తన అర్ధాంగియగు వపుష్టాదేవితో కలపి యజ్ఞదీక్షను వహించరు. ఋత్విజులందరూ ఆసీనులై మంత్రములు పఠించుచుండిరి. ఆ మంత్రము కాలపాశాలై జాతులను లాక్కొని ప్రారంభించాయి. తెల్లటి పాములు కొన్ని, ఎర్రటి పాములు కొన్ని, పచ్చవి కొన్ని, నల్లటివి కొన్ని, రెండు శిరస్సులు, ఐదు శిరస్సులు గలిగినవి కొన్ని రకరకాలుగా వింతైన

పాములు ఆక్రందనచేస్తూ యజ్ఞగుండంలోని అగ్నిజ్వాలలోపడి ప్రాణాలు విడిచిపెట్టసాగాయి. విషపూరితమైన సర్పశరీరాలు అగ్నిలో కమిలి పగిలిపోతూంటే దుర్గంధం ధూమంతో కలిసి ఆ ప్రాంతమంతా వ్యాపించింది. ఇలా సాగిన సర్పయాగంలో చాలా వరకు సర్పములన్నియు బూడిదయిపోయాయి.

## తక్షకుని వంతు

చివరగా తక్షకుని వంతు వచ్చింది. తక్షకుడు భయపడి ఇంద్రుని శరణు పొందాడు. అయినా మంత్రప్రభావము ముందు తక్షకుని యుక్తులు ఫలించలేదు. మంత్రాలు బంధించుకొని ఈడ్చుకొని రాసాగాయి. తక్షకుని నోటినుండి వెలువడే విషాగ్ని జ్వాలలకు ఆకాశమంతా ఎర్రబడిందా అనిపించింది.

ఆకస్మికముగా ఒక బ్రాహ్మణుడు యజ్ఞశాలకేతెంచాడు. "స్వామీ! తమ రాకతో యజ్ఞము పూర్ణత్వము పొందినది. తమ రాకకు కారణము సెలవివ్వండి తమరు ఆజ్ఞాపించండి" అన్నాడు జనమేజయుడు.

"రాజా! ఇప్పటికే చాలావరకు సర్పములు తమ యజ్ఞములో ఆహుతి అయినవి. ఇక చాలు సర్పయాగము విరమించండి" అన్నాడు ఆ బ్రాహ్మణుడు. "అలాగే" అన్నాడు జనమేజయుడు. అదే సమయంలో ఆకాశమంతా వినిపించేంత శబ్దములో బుస లుకొడుతూ పరిసరాలను భయంకరంగా చేస్తూ మంత్రపాశాలు పట్టి లాగుతుంటే గిరగిరా తిరుగుతూ యజ్ఞగుండంలో పడబోతున్న తక్షకుడు అందరికి కనిపించాడు.

ఆ చివరి క్షణంలో "ఆగు తక్షకా! ఆగు. కరుణామూర్తి యగు జనమేజయ మహారాజు నిన్ను క్షమించి రక్షించాడు. వెళ్ళిపో" అన్నాడు. ఆ బ్రాహ్మణుని ఆ వాక్కు తక్షకుని వెనక్కి మళ్ళించింది.

ఆ మరుక్షణం సర్పయాగమునకు శాంతివచనములు పలికారు.

ఇంతటి మహత్తరమయిన సర్పయాగమును విరమింపచేసి తక్షకుని కాపాడిన ఆ బ్రాహ్మణుని పేరు ఆస్తికుడు. ఇతని పేరు తలంచినంతనే పాము విషము హరించునని పెద్దలు చెప్పుచుందురు.

ఈ క్రింది మంత్రమును పఠించుట ద్వారా పాము విషమునుండి ఉపశమనము పొందవచ్చునని నమ్ముచుందురు.

## పాము మంత్రము

1. యో జరత్కారుణా జాతో జరత్కారౌ మహాయశాః
ఆస్తీకః సర్పసత్రే వః పన్నగాన్ యోఽభ్యరక్షత
తం స్మరన్తం మహాభాగా న మాం హింసితు మర్హథ

2. సర్పాపసర్ప భద్రం తే గచ్ఛ సర్ప మహావిష
జనమేజయస్య యజ్ఞాన్తే ఆస్తీకవచనం స్మర

3. ఆస్తీకస్య వచః శ్రుత్వా యః సర్పో న నివర్తతే
శతధా భిద్యతే మూర్ధ్ని శింశవృక్షఫలం యథా

1. తా. జరత్కారుడను ఋషివలన జరత్కారు అను నాగ కన్యకు జనించిన ఆస్తీకుడను ఋషిసర్పయాగమున సర్పములను రక్షించెను. అతనిని నేను స్మరించుచున్నాను. మహాభాగ్యశీలురగు సర్పములారా! మీరు నన్ను కఱువకుడు.

2. మహావిషధరులగు ఓ సర్పములారా! మీరు పారిపొండు. మీకు శుభముగుగాక! జనమేజయుని యజ్ఞము యొక్క సమాప్తి సమయమున ఆస్తీకునకు మీరు చెప్పిన వాక్యములను స్మరింపుడు.

3. ఆస్తీకునకు చెప్పిన శపథ వాక్యములను వినియు ఏ సర్పము వెడలిపోదో, దాని శిరస్సు శింశవృక్షమువలె వందలకొలది ముక్కలైపోవును.

# 73) సద్గుణాలు లేని విద్య వ్యర్థము

ఈనాడు విద్యాలయాల సంఖ్య,విద్యార్థుల సంఖ్య విశేషంగా పెరుగుచున్నది.కానీ విద్యాప్రమాణాలు సన్నగిల్లుచున్నవి.

విద్యను వికాసము కొరకుగాక విలాసము కొరకు, ఉపాధికొరకు అభ్యసించు వారు అధికమగుచున్నారు. ఉన్నతవిద్యను అభ్యసించిన కొందరు వినయ విధేయతలకు దూరమగుచున్నారు.

విద్యకన్న ముఖ్యము సంస్కారము.

సంస్కారము లేని విద్య విద్య అనిపించదు.

గాలిపటమునకు గట్టి త్రాడు ఎంత ముఖ్యమో చదువులకు సంస్కారము అంత ముఖ్యము. త్రాడుతెగిన గాలిపటము ఏకొంపలోనో, ఏకంపలోనో పడి దానిరూపును ఎట్లు కోల్పోవునో అలాగే సంస్కారము లేని చదువు మానవుని వికారవంతముగ చేయును.

చెల్లని నోటును ఎవరును దరికి చేర్చరుగదా? చివరికి భిక్షగాడు కూడ దగ్గరకు చేర్చడు. అలాగే ఎంత చదువుకొన్నను సద్గుణాలు లేనివానిని ఎవరును గౌరవించరు.

వినయము లేని-విజ్ఞానము

వివక్షతలేని-పని

మాధుర్యము లేని-పాండిత్యము

సత్యములేని-పలుకు

కృతజ్ఞత లేని-మైత్రి

నీతి నిజాయితి లేని-రాజకీయాలు

రాణించవన్నారొక మహనీయుడు. విద్యతోపాటు. విజ్ఞానము, వినయము, విధేయత, సచ్ఛీలము వున్నప్పుడే విద్య వికసిస్తుంది.

ప్రకాశిస్తుంది. ప్రశాంతినిస్తుంది.

సమాజమునకు సదా అవసరమగునది సదాచారముతో కూడిన సద్విద్య.

పశుత్వము నుండి - మానవత్వమునకు మానవత్వమునుండి - మాధవత్వమునకు కొనిపోవుటకు ఉపయోగపడు విద్యయే నిజమైన విద్య.

విద్యను సద్వినియోగపరుచుకొనువారికంటే దుర్వినియోగపరచు వారధికమగుచున్నారు.

సద్గుణాలు లేని విద్య తనకుగానీ తన తోటివారికిగానీ ఉపయోగపడదు.

చిల్లులు గలిగిన పడవ ఎవరికిని ఉపయోగపడదు. ఒకవేళ దానిని ఉపయోగించుకొనుటకు ప్రయత్నించినవానినే అది ముంచును. అలాగే సద్గుణాలు లేని విద్యావంతుని ఆశ్రయించినవారుకూడ మునిగిపోవుదురు.

నేటి విద్యను గూర్చి భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఇలా అన్నారు-

"మేలు చేసినవారికే - కీడు చేయు
కూడు పెట్టినవానినే - కూలద్రోయు
విద్యనేర్పినవానినే - వెక్కిరించు
ఇదియె ప్రోగ్రెస్సు - ఈనాడు విద్యలందు.
విద్యకాదు ముఖ్యము - సద్విద్య అవసరము"

1. సదాచారము 2. సత్ప్రవర్తన 3. సన్మార్గము 4. సచ్చరిత్ర. ఈ నాలుగు స్తంభాలమీద నిర్మితమైన విద్యాభవనము ఎందరికో

పేదతీర్చగలదు. ఎందరికో ఆశ్రయము ఇవ్వగలదు. ప్రశాంతిని చేకూర్చగలదు. భౌతిక విజ్ఞానముతోపాటు నైతిక ధార్మిక ఆధ్యాత్మికములకు సంబంధించిన విద్యయే నిజమైన విద్య.

"చదివి చదివి చదివి చావంగనేటికి
చావులేని చదువు చదవలయు
చదివి, చదివి, చదివి కోటి జనులు చచ్చిరిగదా
విశ్వదాభిరామ వినురవేమ"

అంటారు వేమనయోగి.

మనోమాలిన్యాన్ని తొలగించు విద్య నేటి సమాజమునకు అవసరము. గుడ్డకు పట్టిన మురికిని పోగొట్టుటకు రకరకాల సబ్బులు ఉపయోగపడును. మనోమాలిన్యము అను మురికిని పోగొట్టుటకు ఏ విద్య ఉపయోగపడునో అదియే నిజమైన విద్య - సద్విద్య. ఇట్టి సద్విద్య కొరకు మనమంతా ప్రయత్నించి అట్టి విద్యాలయాలను వెతకి అందులో చేరి సద్గురువులయొద్ద ఉపదేశము పొంది 'విద్య' అను పదానికి విలువను పెంచుదాం!

# 74) కష్టాలను చూచి పారిపోరాదు

పరిస్థితులన్నీ సక్రమంగ, అనుకూలంగ వుంటే అందరూ సంతోషంగా నవ్వుతూ ఆడుతూ పాడుతూ వుంటారు. అది గొప్పకాదు ఆశ్చర్యం కాదు.

కానీ విషమ పరిస్థితులు ముంచుకొచ్చినప్పుడు, ఆపత్తులు, కష్టాలు, నష్టాలు వెంటాడుచున్నప్పుడు మనము నవ్వగలగాలి. అట్టివానినే 'స్థితప్రజ్ఞుడు' అని గీతలో గీతాచార్యులు సెలవిచ్చారు.

ఎట్టి విపత్కర విషమ పరిస్థితినైనా ఎదుర్కొనుటకు సిద్ధంగా వుండాలి. ఉండగలగాలి.

నిజమైన సైనికుడు దేశసంరక్షణకు తన ప్రాణాలను సహితం లెక్కచేయకుండా శత్రువులతో పోరాడుటకు ఎట్లు ఉత్సాహపడునో అలాగే ప్రతి వ్యక్తి ఒక సైనికునివలె కష్టాలను, నష్టాలను, ఆపత్తులను ఎదుర్కొనుటకు ముందుకు ఉరకవలసిందేకానీ వెన్ను చూపరాదు, అధైర్యపడరాదు. నిరుత్సాహపడరాదు.

కష్టాలు, నష్టాలు పరీక్షలేకానీ నిజజీవితానికి అంతాలు కావు. బంగారం బాగా కాగితేనే స్వచ్ఛమైన మేలిమిబంగారంగా తయారగుతుంది. వడ్లు రోకలిదెబ్బలు తింటేనే బియ్యంగా తయారయి ఉపయోగపడతాయి.అలాగే కష్టనష్టాలను ఒరిపిడిరాయి ద్వారానే మనము నిజమైన సాధకులుగ-చక్కనైన వ్యక్తులుగ రూపుదాల్చగలము.

కష్టనష్టములకు మనము జంకరాదు. మనలను చూచి అవే జంకవలె. ఇతనితో పోటీపడలేమని కష్టాలే తోక ముడుచుకోవాలి. అట్టి ధైర్యమును నిజజీవితములో ప్రదర్శించినవానిని ప్రపంచములో ఏశక్తి ఓడించలేదు.

తన యావదాస్తి, సర్వసంపదలు, సమస్తము ఒకవేళ

తననుండి దూరమయినను అంతేగదా! పోతేపోనీలే అను స్వభావముగల వ్యక్తులు లోకమునకు సదా అవసరమైయున్నారు. అట్టివ్యక్తులు కొందరైన వున్నచో తనపరిధి లోని కొందరికైనను అట్టి ధైర్యవచనాలు నూరిపోసి అధైర్యమును, నిరుత్సాహమును, నిర్మూలింపచేసి ఆత్మహత్యలబారినుండి తప్పించగలరు. ఆత్మ హత్యలకు మూలకారణం భావోద్రేకమే. అవసర ఉద్రేకమును చల్లబరచువారు సమాజమునకు సదా అవసరము.

కష్టాలు ఎక్కడ లేవు? ఏరంగంలో లేవు? ఏవృత్తిలోలేవు? అన్నిటా అన్ని చోట్ల, అన్ని వేళలా వుంటూనే వుంటాయి. ముండ్ల వనములో నడిచే వ్యక్తి ఒక్కొక్క ముల్లు తీసుకొని నడవాలంటే సాధ్యమా? అది అసాధ్యము. తన ప్రయాణం సాగదు. గమ్యస్థానం చేరలేదు. చెప్పులు ధరించి దర్జాగ ముండ్లను లెక్క చేయకుండ వడివడిగ గబగబ నడిచి తన ప్రయాణం సాఫీగా కొనసాగించుకొనగలదుగదా? చెప్పులు ధరించబడమను ఉపాయము ద్వారా ముండ్లనుండి తప్పించుకొనినట్లు ప్రతి అపాయమునకు ఒక ఉపాయముంది.

ఈ ప్రపంచమే కష్టనష్టముల ముండ్ల వనము. కష్టమను ఒక్కొక్క ముల్లును వేరి పారేయుటకంటే కష్టములోనే సుఖప డుటకు ఉపాయములను అన్వేషించి అలవరచుకోవాలి. పెద్దలు, మహాత్ముల రకరకాల ఉపాయాలను కనిపెట్టి, వారు స్వయంగ వాటిని పాటించి తద్వారా ఉపశమనం పొంది వాటిని మన ముందు వుంచారు. అందులో మొదటిది ధైర్యము.

'క్షుద్రం హృదయ దౌర్బల్యం, త్యక్త్వోత్తిష్ఠపరన్తప' అను గీతాచార్యుల వచనాలే మనకు కొండంత అండ. బండరాయిని కూడ విగ్రహంగా మార్చి అందరిచేత పూజలందుకొనునట్లు చేయుట శిల్పి చాకచక్యంగదా!

అలాగే అధైర్యవంతుని కూడ ధైర్యవంతునిగ చేసి మాయతో యుద్ధము ప్రకటించి జయం పొంది శాంతి సామ్రాజ్యములో హాయిగ విశ్రమింపచేయుటకు సహకరించేవారిని సద్గురువు అంటారు.

అట్టి సద్గురువును అన్వేషించి వారి సూచనలమేరకు మాయను ఎదిరించి కష్టనష్టాలను పక్కకునెట్టి శాంతిగ, సుఖంగ, సంతోషంగ జీవితనౌకను ముందుకు సాగిపోనిద్దాం!

# 75) నోటికి తాళం వేద్దాం

నోరు చాల విచిత్రమైంది. నోరు ఊరిస్తుంది. ఆడిస్తుంది, ఆనందిస్తుంది. అధోగతికి కూడా చేరుస్తుంది.

కాలు జారినా ఫరవాలేదు. నోరు జారకూడదంటారు మహాత్ములు. ఇట్టి నోరును అదుపుచేయుట మహాకష్టము.

వెనుకటికి కొందరు వైజ్ఞానికులు ఒకచోట సమావేశమై మాట్లాడే యంత్రమును కనిపెట్టినచో బాగుండునని చర్చించసాగిరి. వెంటనే మరో సభ్యుడు లేచి సోదరులారా! మాట్లాడే యంత్రము (నోరును) దేవుడే కనిపెట్టాడు. దానిని మూసే ఉపాయం ఇప్పుడు ఆలోచించాలన్నాడట. అలా అందరూ తర్జనభర్జన చేసి ఏకగ్రీవంగా నిర్ణయించిన ఉపాయమే మౌనము.

మౌనముద్వారా మహాకార్యాలు సాధించవచ్చునంటారు. మాటల్లో శక్తి క్షీణిస్తుంది అవసరమైతే తప్పక మాట్లాడు. అనవసరంగా ఒక్కమాట మాట్లాడవద్దు. ఒక శబ్దం అవసరమైనచోట రెండు వాడకు అంటారు అనుభవజ్ఞులైన పెద్దలు.

మౌనము ద్వారా కలహాలు, కలతలు దూరమగును. తద్వారా మనస్సుకు ఉత్తేజము, ఉల్లాసము అధికమగును.

మౌనముద్వారా ఆరోగ్యము అభివృద్ధియగునని ఆరోగ్యశాస్త్రం చెప్తుతుంది. అట్టి అమిత విలువైన మౌనమునెందుకు పాటించకూడదు? కాసేపు వాగవద్దంటే వాగుడు ఆపలేనివారు చాలామంది వున్నారు. మరికొందరు వాగుడే ఆహారంగా భావించెడివారున్నారు. వాగడమంటే మహా సరదాపడేవారు అనేకులున్నారు. అట్టి వాగుడువలన శరీరయంత్రము అనవసరంగా కొంత శక్తి కోల్పోతుందని

హించగలగాలి.

వాగుడువలన ఎదుటివానిని అనవసరంగా హింసించినవారగు
రు. ప్రక్కవాడు చెవులు మూసుకొన్నను, ప్రక్కకు సర్దుకున్నను
ాని బాధ గ్రహించకుండా తన ధోరణిలో వాగుడు కొనసాగించు
ారినేమని పిలవాలో అర్థమగుటలేదు.

దేవుని స్తోత్రం చేయమంటే, గీత చదవమంటే నోరు నొస్తుం
ంటారు. ఓపిక లేదంటారు, శక్తి లేదంటారు. కానీ గంటలు,
ంటలు ఊకదంపుడు మాటలకు మాత్రం ఓపిక, ఓర్పు ఉరకలేస్తుంది
ాలామందికి.

మౌనమే మహావ్రజ కవచంగా భావించి అంతర్ముఖుడైయున్నచో
ోపల అకుంఠితమైన శక్తి ఉద్భవించగలదు. అన్ని అవయవాలు
మతమ శక్తి బయట ప్రపంచములో ఖర్చుచేస్తున్నవి. అన్ని
వయవాలు బయట ప్రపంచములో నిద్రించినచో అంతర్ముఖంగ
ద్భుతమైన శక్తి ఉద్భవించగలదు కావున అనవసర మాటలతో
ాలమును వృధాచేయక జపధ్యానాది అనుష్ఠానాదులచే శరీర
ుంత్రమునకు పవిత్రత చేకూర్చినవాడే ధన్యుడు.

దేహమే దేవాలయమంటారు విజ్ఞులు. అనవసర మాటలతో,
తిట్లతో, బూతువాక్యాలతో దేహమనే దేవాలయమును అపరిశుభ్రం
చేసి పవిత్రతకు భంగం కలిగించుట మానవత్వమునకే మచ్చ. తన
బుద్ధిని శుద్ధము చేసుకొని బుద్ధిమంతుడగుటకు ప్రయత్నించువాడే
నిజమైన యోగి. రోగి కావాలంటే ప్రయత్నం అవసరంలేదు. కాని
యోగి కావాలంటే ఇంద్రియాలను అదుపులో వుంచుకొనవలసిందే!

భోగికి యోగము అంటారు, రోగం మాత్రం అంటుతుంది.

కావున భోగాలకు దూరంగా వుండి తద్వారా రోగాలను దులి
పివైచి యోగమార్గములో పయనించి శాంతిధామము చేరుటకు

ప్రయత్నించువాడు తప్పనిసరిగ నోటికి తాళం వేయవలసిందే!-

నోటికి తాళం వేసినవాడు ప్రపంచాన్నే జయించగల శక్తిగల వాడు కాగలడు. అట్టి ప్రయత్నములో ప్రయత్నలోపం లేకుండా ప్రయత్నించు సాధకుడు తప్పనిసరిగా విజయభేరి మ్రోగించగలడు. అట్టి విజయభేరి మ్రోగించుటకు మనమంతా ఎందుకు ముందుకు అడుగువేయరాదు!!

# 76) భగవదనుగ్రహమునకు సులభమార్గము

దేవునికి కొబ్బరికాయలు కొట్టుట మాత్రమే భక్తి అని తలంచ రాదు. కొబ్బరికాయలు ఒకవైపు కొట్టును మరోవైపు ప్రాణికోట్ల తలకాయలను కొట్టువారు లేకపోలేదు. అట్టివారు భక్తుల లిస్టులోనికి ఎన్నడును చేరలేరు.

తినడానికి తిండి లేనివాడు కొబ్బరికాయ కొని సమర్పించలేడు. అంతమాత్రముచే వాడు భక్తుడు కాకపోడు. భగవంతుడు కొబ్బరి కాయలను కాని మరి ఇతర వస్తువులను కాని కోరడు. నైవేద్యాలు అడుగడు. ఇవి అన్నియు మన తృప్తికొరకు సమర్పించుచున్నాము.

'నిర్వైర స్సర్వభూతేషు
యస్స మామేతి పాండవ'

సర్వప్రాణికోట్లయందు వైరములేనివాడు, ఏ ప్రాణిని హింసించ నివాడు మాత్రమే నన్ను చేరుకుంటాడు అంటారు గీతాచార్యులు. దీనినిబట్టి భగవంతుని మన సంపదలతోను అధికారములతోను కొనలేము.

అమితమైన అపారమైన భక్తిచేతను ప్రేమ, దయ, కరుణ, పరోపకారాది సద్గుణములచేతను భగవంతుని అనుగ్రహమును బడయునన్నాము.

శాస్త్రాలు, ఉపనిషత్తులు మొదలగునవి ఈ విషయమునే వాక్కొ వక్కాణించుచున్నవి. మహాత్ములు పహింతము పవిత్రతకు పరోప కారానికి ప్రాధాన్యత ఇచ్చుచున్నారు. పరమేంద్ర పకారారంటున్నారు. పరమాత్మను పొందుటకు పైసా ఖర్చు లేదంటున్నారు. అదువు

ంకు పరుగెత్తనవసరంలేదనియు, వున్నచోటునుండియే భగవంతుని సేవించి తరించవచ్చును అంటున్నారు. ఎవరికిని అపకారం తలపెట్టవద్దనియు ఉపకారం చేయలేకపోతే ఊరకే వుండుటకూడ ఒకవిధంగా ఉపకారం చేసినట్లేననియు సెలవిస్తున్నారు.

కావున విజ్ఞుడగువాడు ఇట్టి చక్కటి హితవాక్యాలను ఆలకించి ఆచరించి అనుష్ఠించి భగవంతుని సన్నిధానమును పొంది జనన మరణాది సుడిగుండమునుండి తప్పించుకొనుటకు ప్రయత్నిస్తాడు.

ఎంతయో విలువగలిగిన మానవజన్మను పొందిన మనమంతా ఉన్నత శిఖరాలు అధిరోహించుటకు ప్రయత్నించనిచో భవిష్యత్తులో సద్గతి పొందగలమని ఊహించలేము. మనము పుణ్యకార్యాలు చేసి పునీతులము కాకపోతే పాపకార్యాచరణవలన పతనమైపోవుట తథ్యము. పావనమా లేక పతనమా? ఈ రెండు మన చేతులలోనే వున్నాయి. పతనమగుటకు ప్రయత్నము అవసరములేదు. పావనత్వముతో పరమాత్మను పొందాలంటే మాత్రము విశేషమైన ప్రయత్నము అవసరము. అట్టి ప్రయత్నములో వుంటూ ఒకవేళ ప్రాణాలు పోయిననూ-

"శుచీనాం శ్రీమతాంగేహే"

శుచి, శుభ్రత, చక్కటి ఆచారములతో కూడినచోట తిరిగి జన్మింపచేస్తాను అని సెలవిచ్చారు గీతాచార్యులు. కావున మంచినే చేస్తాము, మంచిగనే వుందాము, మంచిదారే చూచుకొందాము అను ఈ త్రిసూత్ర పథకమును స్వీకరించి మనమంతా ముందుకు సాగిపోదాం. జన్మరాహిత్యానికే కృషిచేద్దాం! మన కృషి సఫలమగునని ఆశిద్దాం!

# 77) నిరాశను నిర్మూలిద్దాం!

'నిరాశ' అను పెనుభూతము ఎవరిని ఆశ్రయించునో వాడు ఒక్క అంగుళం ముందుకు సాగిపోలేడు. ఏ మంచిపని చేయమని ప్రోత్సహించినా వెనుకంజ వేస్తాడు, ప్రతిది సందేహమే. నేను సాధిస్తానా? నాచేతనౌతుందా? నావల్లకానిపని అని ఎప్పుడు ఏడుస్తూ కూర్చుంటాడు. ఇది ఒకరోగం అంటాడు ఒక మహనీయుడు. ఈ రోగం ఎవరికి సోకినా చింత, అసాంతితప్ప జీవితమునకు శోభ వుండదు. కాంతి వుండదు.

జీవితమన్నాక ఎత్తుపల్లాలుండకపోవు. ప్రయత్నముతో సత్ఫలితాలు సాధించగలమనే దృఢమైన నమ్మకముతో ముందుకు సాగిపోవాలి. సంకట పరిస్థితులు జీవితమునకు ఒరిపిడిరాళ్ళవంటివి. అత్యుత్తమస్థానం పొందిన వారందరు నిరాశకు చోటివ్వనివారే!

నిరాశాపరుడు జీవితములో అంధకారంతో అలమటించవలసిందే!

ఆశావాది ఎప్పటికైనా సఫలీకృతుడై జీవితములో నవ్వగలడు.

థామస్ ఎడిసన్ అను శాస్త్రవేత్త కోటానుకోట్ల విలువైన యంత్రసామగ్రితో ఒక ప్రయోగశాలను (లేబరేటరీ) నిర్మించుకొని, అందు తన పరిశోధనలను కొనసాగించి ఎన్నో అద్భుత రహస్యాలను కనుగొని వాటి ఫలితాలను, విజయాలను కాగితాలపై రికార్డుచేసి ఆ ప్రయోగశాలలో భద్రపరచుకొని ఆయన సాధించిన సత్ఫలితాలను చూసి ఆనందించేవాడు.

1914లో ఆ ప్రయోగశాల అగ్నికి ఆహుతైంది. తాను కష్టపడి సాధించిన అద్భుత రహస్యాలన్నీ అగ్నిలో బూడిదైపోయాయి. ఆ దృశ్యాన్ని కండ్లారా చూస్తూ - 'హే భగవాన్ నా శాస్త్ర పరిజ్ఞా

నాన్ని మరోసారి పరీక్షించుకొను అవకాశం కల్పించారా? నన్ను పరీక్షించదలంచారా? నీ ఆజ్ఞ శిరసావహిస్తాను' అని ప్రార్థించాడు. భగవాముని కృప అనంతం. అది ఏ రూపంలోనైనా రావచ్చును. దానిని తట్టుకొను శక్తి మనకుండాలి - అంటాడు ఆ శాస్త్రవేత్త.

మహనీయులు ఇలా ప్రబోధిస్తున్నారు. "నిరాశ ఎందుకు, మీపై మీకు విశ్వాసం లేదా? నిరాశను వదలండి - ఈ అంటువ్యాధి మీనుండి మరొకరికి సోకగలదు. చివరికి సమాజాన్నే ముంచగలదు కనుక నిరాశను నిర్మూలించండి ఆశను అధిగమించండి"

కావున భగవంతునిపై నమ్మకముంచి మంచిపనులు చేయాలనే సత్సంకల్పముతో ముందుకు సాగిపోవలసిందేకాని, వెనుకంజ వేయరాదు. నిరుత్సాహము నుండి బయటపడి ఉత్సాహముతో ఉరకలువేస్తూ జీవితమును ఉన్నత ఆశయములకు అంకితం చేయాలేకాని పరిస్థితులకు తలబగ్గి పారిపోరాదు. అది పిరికివాని లక్షణం.

Be Fearless - నిర్భయులై ముందుకు సాగండి - అంటారు స్వామి వివేకానంద. వారిని ఆదర్శంగా తీసుకొని మనమంతా ముందుకు సాగిపోదాం!

# 78) కారాలలో ప్రమాదకరమైనది అహంకారం

కారం ఎక్కువైతే శరీరంలోని రక్తాన్ని పీల్చేస్తుంది. కాని అహంకారం ఎక్కువైతే మానవత్వాన్నే పీల్చేస్తుంది.

అట్టి మహాఘోరమైన 'అహంకారం' ఎవరిలో ప్రవేశించునో వాడి గతి అధోగతే.

చెదపురుగు పట్టిన వస్తువు ఏవిధంగా పనికిరాకుండా పోవునో 'అహంకారం' అనే చెదపురుగు పట్టినచో మానవత్వం కృశించి నశించిపోవును.

అట్టి అహంకారం అను చెదపురుగును నిర్మూలించుటకు భక్తి, ప్రేమ, దయ అను 'మందే' శరణ్యాం. లేనిచో అహంకారం వెర్రితలలు వేస్తుంది. వెర్రి ఆలోచనలు కలిగిస్తుంది. మానవత్వం నుండి రాక్షసత్వంలోనికి నెట్టేస్తుంది.

ఇట్టి అహంకార లక్షణాలు కలవారు చరిత్రపుటలలో కోకొల్లలు. కొందరి గురించి తెలుసుకుందాం.

తన అనుమతి లేకుండా తన రాజ్యంలో ఎవరూ విందులూ, వినోదాలూ చేయరాదంటూ శాసించాడు ఒక రాజు. ఆనందం అనేది తన ఒక్కడి సొత్తు అనుకున్నాడు. మరొకరాజు సంగీతాన్ని బహిష్కరించేడట. దేశంలో ఎక్కడా సంగీతాన్ని వినకూడదని శాసించాడట. సంగీతవిద్వాంసులు ఒకనాడు ఏడుస్తూ ఒక శవపేటికను మోసుకుపోతూ ఆ రాజుకు ఎదురయ్యారట. ఎందుకు ఏడుస్తున్నారని అతడు ప్రశ్నించాడట. తమరు సంగీతాన్ని నిషేధించారు గదా? దానిని పూడ్చిపెట్టడానికి వెళ్తున్నామని జవాబు చెప్పారట ఆ విద్వాంసులు. అందుకు సిగ్గుపడవలసిందిపోయి, బాగా

లోతుగ పూడ్చమని చెప్పాడట ఆ రాజు. ఇలా వుంటాయి అహంకార లక్షణాలు.

ధనవంతులు విలువైన వస్తువులు మ్రింగి పొట్టంలో దాచుకు న్నారని తెలిసి వారి పొట్టలను చీల్చి మరీ దోచుకున్నాడు ఇంకొక్క రాజు. అహంకారం రకరకాలుగా చిలవలు, పలువలు వేస్తుంది. దుర్యోధన, దుశ్శాసన, హిరణ్యాకశిపు మొదలగువారి అహంకార లక్షణాలు అందరికీ తెలిసినవే.

ఒకానొకరాజు ఏనుగును ఎక్కి వందిమాగధులంతో రాజవీధిన పోవుచున్నాడు. దారిలో ఒక సాధువు అడ్డంగా పడుకున్నాడు. రాజభటులు దారికడ్డు తొలగమన్నారు. చెప్పడానికి మీరెవరన్నాడు ఆ సాధువు. రాజాజ్ఞ అన్నారు భటులు. అయితే నేను రాజాధిరాజును అన్నాడు ఆ సాధువు. ఆ రాజు ఏనుగునుండి దిగి సాధువుతో మీ రాజ్యమెక్కడ? సైన్యమెక్కడ, మీ ధనాగారమెక్కడ? అని ప్రశ్నించాడు.

అందుంకు సాధువుయొక్క సమాధానం - నాకు శత్రువులు లేరు. కావున సైన్యముతో పనిలేదు. అన్నీ త్యజించినవాడిని కాబట్టి సంపదలతో పనిలేదు. ఏ రాజ్యానికి వెళ్ళినా గౌరవంగా చూస్తారు ఆదరిస్తారు అన్నాడా సాధువు.

సాధువు వాక్యాలు విన్న ఆ రాజు తన అహంకారాన్ని, అవి వేకాన్ని తెలుసుకొని సాధువుకు దాసోహమని నమస్కరించాడు. ఇలా కొందరైనా తమ అహంకారాన్ని గ్రహించి దానినుండి విముక్తి పొందగలిగినవారు ధన్యులు.

రాజు రౌతుయనెడి భేదము బ్రతికి వుండేవరకెరా.

మట్టి మట్టి కలసినాక ఎట్టి భేదాలుండురా.

శ్మశానంలో రాజు మట్టి, సేవకుని మట్టి వేరు వేరు రంగులుగ

వుంటావు. ఉన్న మూణ్ణాళ్లు మంచి లక్షణాలతో సద్గుణాలతో కాలం గడిపిన వారిపేరు ఇహంలో అందరు స్మరిస్తారు. పరంలో సద్గతి లభిస్తుంది.

కావున అహంకారాన్ని నిలువునా చీల్చి, చెండాడి దాని బారి నుండి తప్పించుకొనువారు అదృష్టవంతులు. అట్టి అదృష్టవంతుల జాబితాలో మనమంతా చేరిపోదాం!

# ధరల పట్టిక

## శ్రీ శుకబ్రహ్మాశ్రమ గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | గీతామకరందము (తెలుగు) ............ | 100.00 |
| 2. | Gitamakaranda (English) ............ | 100.00 |
| 3. | యోగవాసిష్ఠరత్నాకరము ............ | 80.00 |
| 4. | రామాయణ రత్నాకరము ............ | 60.00 |
| 5. | భాగవత రత్నాకరము ............ | 60.00 |
| 6. | భారత రత్నాకరము ............ | 60.00 |
| 7. | ఉపనిషద్రత్నాకరము ............ | 50.00 |
| 8. | గీతోపన్యాసములు ............ | 35.00 |
| 9. | మోక్షసాధన రహస్యము ............ | 35.00 |
| 10. | పరమార్థ కథలు ............ | 40.00 |
| 11. | అధ్యాత్మ రామాయణము ............ | 18.00 |
| 12. | బ్రహ్మానంద వైభవము ............ | 18.00 |
| 13. | భజనలు కీర్తనలు ............ | 18.00 |
| 14. | అమృత బిందువులు ............ | 18.00 |
| 15. | శ్రీ మలయాళ మహర్షి ............ | 10.00 |
| 16. | శ్రీ భగవద్గీత (స్థూలాక్షరి) ............ | 18.00 |
| 17. | శ్రీ భగవద్గీత (మూలం) ............ | 6.00 |
| 18. | వివేకానంద సింహనాదము ............ | 16.00 |
| 19. | దివ్యసూక్తులు ............ | 10.00 |

| | | |
|---|---|---|
| 20. | యమలోక వార్తలు ............ | 4.00 |
| 21. | శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి జీవిత చరిత్ర | 25.00 |
| 22. | తత్త్వసారము ............ | 4.00 |
| 23. | మానవబోధ ............ | 4.00 |
| 24. | పాండవగీత ............ | 4.00 |
| 25. | ఆధ్యాత్మ జడ్జిమెంటు ............ | 4.00 |
| 26. | బ్రహ్మచర్య విజయము ............ | 30.00 |
| 27. | ఆత్మానుసంధానము ............ | 18.00 |
| 28. | ప్రణవ పూజ ............ | 3.00 |
| 29. | గౌరీపూజా విధానము ............ | 3.00 |
| 30. | ద్వాదశ మంజరి ............ | 3.00 |
| 31. | ఆధ్యాత్మిక హితోక్తులు ............ | 3.00 |
| 32. | మోక్షద్వార పాలకులు ............ | 3.00 |
| 33. | ధ్యానపద్ధతి ............ | 3.00 |
| 34. | ఆత్మతత్త్వ విచారణ ............ | 3.00 |
| 35. | వైరాగ్య సాధన ............ | 3.00 |
| 36. | మట్టిలో మాణిక్యము ............ | 3.00 |
| 37. | "వేదాంతభేరి" ఆధ్యాత్మిక మాసపత్రిక సంవత్సర చందా | 30.00 |
| | "వేదాంతభేరి" ఆధ్యాత్మిక మాసపత్రిక శాశ్వత చందా | 300.00 |

# కేసెట్స్

శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి గీతోపన్యాసముల క్యాసెట్ ఒక్కొక్క అధ్యాయముగల

ఆడియో క్యాసెట్ 35.00

(మొత్తము 18 క్యాసెట్స్), తత్త్వసారం, మానసబోధ, యతి గీత, తత్త్వగీత, గీతాపారాయణ

శ్రీ స్వాములవారి గీతోపన్యాసముల

వీడియో క్యాసెట్ (ఒకటి) 200.00

మొత్తము 15 వీడియో కేసెట్స్ వెల 2,520.00

గ్రంథములు కావలసినవారు క్రింది అడ్రసుకు వ్రాయుండి

(పోస్టేజి అదనము)

మేనేజరు

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ శుకబ్రహ్మాశ్రమము పోస్టు

శ్రీ కాళహస్తి - 517 640, చిత్తూరు జిల్లా.

Phones : 2543 & 2239

STD. 08578